# మధురస్మృతులు

మాలతీ చందూర్



క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి • విజయవాడ 2

క్వాలిటీ ప్రచురణ
ప్రథమ ముద్రణ :
జూన్ - 1983

మధురస్మృతులు

రచన :
మాలతీచందూర్

వెల : రు. 25-00

ముఖచిత్రం
చంద్ర

ప్రచురణకర్త
కె. మురళీకృష్ణ

ముద్రణ :
సాకేత ప్రెస్,
విజయవాడ - 3

ప్రతి ఇంటా - ముఖ్యంగా ప్రతి జంటా - ఇంకా ప్రతి స్త్రీ

తన ఆభరణాలుగా చూచుకోవలసిన పుస్తకాలు

# శ్రీమతి మాలతీచందూర్ రచనలు

| | |
|---|---|
| వంటలు - పిండివంటలు | 20-00 |
| అందాలు - అలంకారాలు | 7-50 |
| మహిళలకు మధుర జీవనం | 7-50 |
| ప్రశ్నలు - జవాబులు | 15-00 |
| జాబులు - జవాబులు | 13-00 |
| మనసులోని మనసు | 18-00 |
| ఆలోచించు | 9-00 |
| ఏమిటీ జీవితాలు | 12-00 |
| ఓ మనిషి కథ | 16-00 |

| | | |
|---|---|---|
| వంటలు - వార్పులు (శాకాహార, మాంసాహార, కూల్‌డ్రింక్స్) | యం. జయలక్ష్మి | 10-00 |
| 60 రోజుల్లో ఇంగ్లీషు భాష | డి. వి. ఎస్. ఆర్. మూర్తి | 21-00 |

ఆంధ్రుల అభిమానరచయిత్రి

# యద్దనపూడి సులోచనారాణి

## ఇ త ర న వ ల లు

| | |
|---|---|
| హృదయగానం | 22_00 |
| మధుర స్వప్నం | 16_00 |
| దాంపత్య వనం | 15_00 |
| నీరాజనం | 16_00 |
| సహజీవనం | 15_00 |
| ఈ దేశం మాకేమిచ్చింది ? | 15_00 |
| అనురాగతోరణం | 10_00 |
| స్నేహమయి | 12_00 |
| సంసార రథం | 10_00 |
| రాధాకృష్ణ | 13_00 |
| కీర్తికిరీటాలు | 20_00 |
| ప్రేమలేఖలు | 20_00 |
| పార్థు | 12_00 |
| ప్రేమసింహాసనం | 18_00 |
| | 15_00 |

# మధురస్మృతులు

ఆరోజున సూర్యభగవానుడు మామూలుగానే ఉద యించాడు. తోటలోని పక్షులు రోజూలాగానే కిల కిలారావాలు చేస్తున్నాయి. ముందువాకిట్లో - అప్పుడే విచ్చుతున్న మందారాలూ — గులాబీమొగ్గలూ — 'నువ్వా గొప్పా - నేను గొప్పా' అన్నట్లు, గాలి వాటుకి తలలు ఆడిస్తూ సవాలుచేస్తున్నాయి. వరం డాలో కుర్చీవేసుకు కూచుని — ఆనాటి దినపత్రిక చూస్తూ, వేడివేడి టీ తాగుతూవున్నది నాగమణి. చుట్టూ నిశ్శబ్దం. వంటింట్లోంచి ఆదెమ్మకూడా ఎక్కడా అలికిడి చేయటంలేదు. ఈపాటికి ఆవరణలో ఒక పది పదిహేను మందన్నా పేషంట్లు కూచుని వుండేవారు. ఈరోజు వొక్క పేషంటుకూడా రాలేదు. అసలు నర్సు ఎలిజబెత్ కూడా వచ్చినట్లులేదు. ఎందుకని ?

'ఆదెమ్మా – !' పిల్చింది నాగమణి.

ఆవైపునుంచి శబ్దంలేదు. బదులుకూడా రాలేదు.

'ఆదెమ్మా !' ఈసారి గట్టిగానే పిల్చింది.

'వస్తున్నా' అంటూ ఆదెమ్మ తాపీగా పెళ్ళినడకలు నడుస్తూ వచ్చింది.

'ఎలిజబెత్ రాలేదా ?'

'లేదు' అన్నట్లు తలవూపింది.

'మరియమ్మ...?'

'నేను చూడలేదండి'

'తాళాలు పట్టుకువెళ్ళలేదా ?'

'చూసివస్తాను' ఆదెమ్మ వంటయింటివైపుకి వెళ్ళింది.

నాగమణికి ఆశ్చర్యంగా వుంది. మరియమ్మ అందరికంటే ముందు వచ్చి, ఆదెమ్మదగ్గర కూచుని కబుర్లు చెప్తూ, ఒకకప్పు టీ తాగి, ఆ తరువాత 'క్లినిక్' వూడ్చి – బల్లలూ బెంచీలు తుడిచి తన రాకకోసం ఎదురుచూస్తుండేది. ఈ కార్యక్రమం పదేళ్ళగా క్రమం తప్పకుండా నిర్విఘ్నంగా నిర్వహిస్తున్న మరియమ్మ ఎందుకు రాలేదు ? వంట్లో బాగాలేదా ? జ్వరం వచ్చినా యిక్కడికొచ్చే మందుపుచ్చుకుంటుందే ? పోనీ ఎలిజబెత్ ఏమయింది ?

'ఆదెమ్మా !' ఈసారి కోపంగా, విసురుగా పిల్చింది.

'వస్తున్నాను'

ఆదెమ్మ కంఠంలో కాస్త నిర్లక్ష్యం చోటుచేసుకున్నట్లు అనిపించింది నాగమణికి. ఏం జరిగింది ? పదేళ్ళగా ఒక్కనాడుకూడా తనమీద విసుక్కోని ఆదెమ్మ ఎందుకిట్లా చేస్తున్నది

ఆదెమ్మ వచ్చి గుమ్మానికి ఆనుకుని నుంచుంది. మాటలు రానట్టు, మాటాడటం యిష్టంలేనట్టు నుంచుంది.

'మరియమ్మ తాళాలు తీసుకెళ్ళలేదా ?' అడిగింది నాగమణి. ఈ ప్రశ్న యింతక్రితం అడిగాను - దానికి జవాబు చెప్పలేదు - అని సంజాయిషీ అడుగుతున్నట్లు.

'లేదు.'

'రానని చెప్పిందా ?'

'లేదు.'

'ఇప్పుడు టైము ఎంతో తెలుసా ?'

'చూడలేదు' ఆ కంఠంలో ఒకరకమైన నిర్లక్ష్యం.

'నేను చెప్తాపట్టు - ఏడుదాటింది.'

ఆదెమ్మ మాట్లాడలేదు.

'ఎలిజబెత్ రాలేదా ?'

'ఊహూ'

'అయితే తాళాలు యిట్లా యివ్వు. క్లినిక్ తెరిచి నేను వూడ్చి - శుభ్రం చేస్తాను' లేచింది నాగమణి కుర్చీలోంచి.

ఆదెమ్మ మాట్లాడకుండా టేబుల్‌మీద తాళాలుపెట్టి వంటింటివైపుకి వెళ్ళిపోయింది - యివేమీ పట్టనట్లు.

నాగమణికి ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్లుగా వుంది. తలఎత్తి చూసింది - చుట్టూ పరిసరాలు మామూలుగా వున్నాయా - లేక కొత్త ప్రదేశంలో వున్నానా అన్న సందేహంతో: ఈయిల్లు, యీ పరిసరాలు పదేళ్ళనుంచి ఎలా వున్నాయో - యీరోజూ అలాగే వున్నాయి. ఎక్కడా మార్పులేదు. అయితే ఆవరణలోవున్న ఆ పెద్ద వేపచెట్టుకిందవున్న సిమెంటుచప్టా - చెట్టుమొదట్లో గుండ్రంగా, ఎత్తుగా, వెడల్పుగా కట్టించిన ఆ సిమెంటుదిమ్మ ఖాళీగా వుంది. తెల్లవారేసరికి దానిమీద రోగులు ఎదురుచూస్తూ కన్పించేవారు. ఈరోజు ఎవ్వరూలేరు. ఒక్క పేషంటుకూడా ఎందుకు రాలేదు ? తాళాలు చేతుల్లోకి తీసుకుని మెట్లు దిగింది, తాను క్లినిక్‌గా వుపయోగించే పక్కవాటా తలుపులు తియ్యటానికని :

చేతులో తాళంగుత్తి .... ఆ గుత్తిలో ఏతాళంచెవితో క్లినిక్ తాళం తీస్తారో .... ఒక్కసారి గుత్తి అరిచేతుల్లో పట్టుకు పరీక్షగా చూస్తున్నది. అంతా ఏదో కొత్తగా వుంది. క్లినిక్ సుందు - నిశ్శబ్దంగా వుంది.

క్రితంరోజు సంఘటనలని ఒక్కొక్కటే నెమరువేసుకుంది. ఏమీ జరగలేదు. మామూలుగా జబ్బులూ, మందులూ, రోగులూ, పురుళ్ళూ, బాలింతలూ, చూలింతలూ. ఇంతకిమించి ప్రత్యేకం ఏమీ జరగలేదు. పైగా ప్రెసిడెంట్‌గారి కోడలికి పదేళ్ళకి కాన్పు వచ్చింది - తొలిచూలు మగపిల్లవాడు కలిగాడని ఇంట్లో అంతా ఒకటే సంబరపడ్డారు. రాత్రి పదింటిదాకా తనని వదల్లేదు. భోంచేసి కాని వెళ్ళటానికి వీల్లేదని, తరిమి తరిమి విందుభోజనం పెట్టి, కాళ్లో పళ్ళుబుట్ట పెట్టి, యింటికి వచ్చి దింపారు. అంత హాయిగా, సంతృప్తిగా నిన్నటిరోజు గడిచింది. తెల్లవారేప్పటికి వాతావరణం ఎందుకిలా స్తంభించిపోయింది? ప్రెసిడెంట్‌గారి మనుమడు ఏమన్నా అయ్యాడా? ఛీ ఛీ అలాంటివి జరిగివుండదు. ఇంతవరకూ - తను చేసిన కేసులో ఫెయిల్ అవటమంటూ జరగలేదు. అసలు అల్లాంటిది ఏదన్నా అయితే రాత్రికి రాత్రే మనిషి వచ్చి వుండేవాడు. మరి? ఏం జరిగింది?

తాళపుగుత్తిని యిటూ అటూ తిప్పి పెద్దసైజులోవున్న తాళంచెవి తీసి, యిది కాకపోతుందా? అని తాళం తియ్యబోయింది. రాలేదు. క్లినిక్ తాళంచెవ్వి యిదికాదా? అచెమ్మని కేకేసి తాళంతియ్యి అని అడుగుదామని అనుకుంది. కాని మరుక్షణంలో ఆ ఆలోచనని తొక్కిపెట్టింది. ఏం? తను అంత చేతగాని ఆడదా? ఈయిల్లు - యీక్లినిక్ ఇవన్నీ తను కష్టపడి, ఏర్పాటు చేసుకున్నది. పదేళ్ళపాటు శ్రమించి, సమకూర్చుకున్నది. ఈచెవ్వి కాకపోతే - మరోచెవ్వి. అచెమ్మనుమటుకు పిలవదు. గేటువైపుకి చూసింది. మరియమ్మగాని, ఎలిజబెత్‌గాని వస్తున్నారేమోనని. ఊహూ, వాళ్ళిద్దరూ కూడబలుక్కుని - పనికి రానట్లుగా వుంది. వాళ్ళిద్దరేగాదు, అసలు పేషంట్లు ఏరి? ఒక్కపేషంటుకూడా ఎందుకు రాలేదు?

తాళం తియ్యబోతున్న చేతులు అలానే ఆగిపోయాయి. చెట్టుమీద పక్షులు కిలకిలమంటంతప్ప మనుషుల మాటలు వినిపించటంలేదు. పక్షులు యింత మధురంగా కిలకిలారవాలు చేస్తాయన్నది, తాను మర్చిపోయింది. అసలు ఆ కిలకిలారవాలు వినేపాటి తీరిక తనకేది? ఈనాడు చాలా తీరిగ్గా - ఏదో హాయిగా వుంది. ఉహూ, హాయిగాలేదు : ఏదో గాబరాగా వుంది. ఏరి, తన పేషెంట్లు ఏరి? వాళ్ళు లేకపోతే తాను బతకలేదు - నాగమణికి నవ్వొచ్చింది యీ ఆలోచనకి : పేషంట్లు లేకపోతే తాను బతకలేదా? తను లేకపోతే పేషంట్లు బతకలేరు. తను లేకుండా యీవూరు వాళ్ళకి ఒక్కరోజు గడవదు.

గడవదా? ఈవూరు పుట్టినప్పటినుంచీ తను యిక్కడ వుండి వైద్యం చేసిందా? తన వైద్యంవల్ల మృత్యువుని ఆపగలిగిందా? నాగమణి తాళంగుత్తి చేతులో పట్టుకుని అలా క్లినిక్ముందు నిల్చుని వుంది. తనని ఎవరో తీక్షణంగా పరిశీలిస్తున్నారు. ఎవరికళ్ళో తనవైపు గుచ్చి గుచ్చి చూస్తున్నాయి - అన్న అంతర్దృష్టితో చివాలున వెనక్కి తిరిగింది. అవతలవాటాలోనుంచి ఆవెమ్మ, నాగమణి దృష్టిలో పడటం యిష్టంలేనట్లు ఖంగారుగా తప్పుకుంది గుమ్మంలోంచి.

ఒక్కొక్క తాళంచెవ్వితో ప్రయత్నంచేసి, ఆఖరికి ఆరోచెవ్వితో తాళం తియ్యగలిగింది నాగమణి. క్లినిక్ లోపలకి సూర్యకిరణాలు ఏటవాలుగా దొంగతనంగా చొరబడుతున్నాయి కిటికీలోనుంచి. కిటికీ తెరలన్నీ పక్కలకి లాగి, మధ్యలో సిల్కుదారాలతో ముళ్ళువేసి వున్నాయి, రిబ్బన్ముడిలాగా. ఆ ముడి చూసేప్పటికి మళ్ళీ మరియమ్మ ఎందుకు రాలేదు? - అన్న ఆలోచన వేధించసాగింది.

క్లినిక్ శుభ్రంగా అద్దంలా తుడిచివుంది - ఎక్కడా దుమ్ములేదు. టేబుల్మీదవున్న గాజుపలకమీద చూపుడువేల్తో రాసి చూసింది. దుమ్ము లేదు. వేలుకి దుమ్ము అంటుకోలేదు. గాజుపలకకింద ఆనాటి తారీకు. ఇరవై ఎనిమిదో తేదీ - అన్న అంకెలు పెద్దగా ఎర్రరంగులో తొంగి చూస్తున్నాయి. అయితే మరియమ్మ వుదయం వచ్చి - రూము తుడిచి -

డేటు మార్చి వెళ్ళిందన్నమాట. మరి ఆపెమ్మని అడిగినపుడు–యీవిషయం ఎందుకు చెప్పలేదు ? గాజుపలకకింద ఆరోజు తాను చూడవలసి పేషంట్ల పేర్లూ, ఇళ్ళకి వెళ్ళాల్సిన పన్నెండు విజిట్స్ – ఆ పేషంట్ల పేర్లూ, రాసి వున్నాయి. ఎలిజబెత్ క్రితం సాయంత్రమే మరునాటి లిస్టు తయారుచేసి, మరియమ్మకి యిచ్చి వెళ్ళిపోతుంది రాత్రి క్లినిక్ మూస్తున్నపుడు, గుండ్రంగా, ముత్యాలు పేర్చినట్లు, స్పష్టంగా రాసిన పేర్లు. ఆ పేర్ల ప్రకారం తాను పేషంట్లని చూస్తుంది. అయితే ఆ పేర్ల ప్రకారం – రోగులు కాచుకుని కూచోలేదే ? తలఎత్తి చూసింది నాగమణి. నల్చునే యిటూ అటూ చూసింది. అంతా నిశ్శబ్దం. ఆవరణలోని వేపచెట్టుకింద తిన్నె ఖాళీగావుంది. ఎక్కడా మనుషుల అలికిడిలేదు.

నాగమణికి – కాలం స్తంభించిపోయినట్టువుంది. తన కళ్ళముందు, పనీపాటులేని విశ్రాంతి. నిర్వ్యాపారం, నోరు తెరుచుకుని కూచున్నట్లుంది – వాచీ చూసుకుంది అలవాటు ప్రకారం. ఏడున్నర. ఈపాటికి తను నాలుగైదు కేసులు చూసేసి వుండేది. ఈరోజు ఎందుకిలా అయింది ? ఏరి పేషట్లు ? ఈవూరువాళ్ళు తన క్లినిక్కి రారా ? పేషంట్లూ రాక, నర్సూ, ఆయా ఎవ్వరూ రాక, తాను ఎట్లా బ్రతుకుతుంది ?

నాగమణి – రెండు అడుగులు వేసి మధ్యగుమ్మానికివున్న కర్టెన్ తప్పించి చూసింది. అక్కడ పొడుగాటిబల్ల – ఆ వుదయాన్నే మార్చినట్లున్న తెల్లని మడత నలగని గలేబుతో దిండు. పక్కనే వాష్‌బేసిన్, దాని పక్కన స్టాండ్‌మీద, తెల్లమడత టవల్లు. అయితే మరియమ్మ అన్ని ఏర్పాట్లూ చేసి వెళ్ళిపోయిందన్నమాట ఎక్కడికెళ్ళింది ? ఎందుకు రాలేదు ? కర్టెన్‌వేసేసి – వెనక్కి తిరిగింది నాగమణి. గుమ్మంలో మనుషుల అలికిడిలేదు. ఎక్కడా కదలికలేదు. అంతా నిశ్శబ్దం – ఏమయింది ? తెల్లవారేసరికి కిటకిటలాడుతూ వుండే ఈ ఆవరణ నిర్మానుష్యంగా ఎందుకుంది ? తన పేషంట్లంతా ఏమయ్యారు ?

నాగమణి అలవాటుప్రకారం టేబుల్ వెనకనున్న రివాల్వింగ్ ఛైర్లో చతికిలబడింది. టేబుల్మీద ఒకపక్కగా — బాక్స్లో స్టెతస్కోప్ — దానిపక్కన బి. పి. చూసే పరికరం - పెట్టెమూతకూడా తీసి రెడీగావుంది. ఆపక్కనే థర్మామీటరు బాక్సు, వాటిపక్కన స్ప్రిరిట్ లింగ్ పాడ్స్.

ఈ టేబులూ, దీనిపైన పరికరాలు, ఈ గది యివన్నీ నోరు ఆవలించుకుని — తనవైపు చూస్తున్నట్లుగావుంది నాగమణికి. ఎవరూ రారేం ? మందుకోసమని ఒక్కడంటే ఒక్కరోగికూడా రారా ? ఎలా ? 'అదెమ్మా - ఏంజరిగింది ? మీరంతా కలిసి ఎందుకిట్లా చేస్తున్నారు ? నేనేం పొరబాటు చేశాను ? పేషంట్లు ఎందుకు రాలేదు - ఎలిజబెత్ ఏది ? మరియమ్మ ఎక్కడ ? గట్టిగా అరిచి ప్రశ్నించాలనుకుంది. కేకలువేసి అడగాలని అనిపిస్తున్నది నాగమణికి. తనలోని ఉద్రేకాన్ని బలవంతాన అణుచుకుని మళ్ళీ చుట్టూ చూసింది. ఏదన్నా మార్పు - తనకి అర్థం అయే మార్పు యీ క్లినిక్లోగాని, పరిసరాల్లోగాని వుండేమోనని. అంతా మామూలుగానే వుంది. గోడమీద కేలండరు ఆనాటి తేదీని, శుక్రవారం అని, వారపు పేరుని స్పష్టంగా చూపిస్తూ వుంది. నవ్వుతున్న పిల్లవాడు చూపుడువేలు కొసనుంచి - చూపుతున్నాడు ఆరోజు శుక్రవారం అని. గోడగడియారం టంగ్-టంగ్మని గంటలు కొడుతోంది. తనకి తెలియకుండానే గంటలు లెక్కపెట్టింది. ఎనిమిదిసార్లు కొట్టింది. అంటే ఎనిమిదయిందా ? తను క్లినిక్లోకి వచ్చి - యిల్లా తీరికగా ఏపనీ లేకుండా కూచోటం ఏనాడన్నా సంభవించిందా ? అసలు ఆ గడియారపుగంటలు తను ఏనాడన్నా లెక్కపెట్టిందా ? ఆగంటలు వినపడాలని ఆ గంటల శబ్దం మనిషిలాగా సాయంగా వుంటాయని తన తండ్రి అంటూండేవాడు.

నాగమణికి తండ్రి జ్ఞాపకం వచ్చాడు. ఈ గోడగడియారం తన తండ్రిది. ఆయన వుద్యోగం చేస్తున్నరోజులల్లో కొన్నదిట. తనతోపాటు యీగడియారం వెంటతెచ్చుకున్నాడు తండ్రి. నాగమణి ఆలోచనలు

గతంలోకి వెళ్తున్నాయి. వర్తమానంలో బ్రతకటంతప్ప గతాన్ని మర్చిపోవాలి - అని ప్రయత్నించి ఆ గతాన్ని నేలమాళిగలో లోతుగా, పాతాళంలో పాతిపెట్టగలిగిన తను, గతంలోకి వెళ్ళిపోతున్నది. చేతిలో పని లేదు ; మనసుని లగ్నం చెయ్యగలిగిన సమస్యాలేదు - అలా కుర్చీలో కూర్చుండిపోయింది నాగమణి.

ఇరవై ఎనిమిదోతారీకు - ఎనిమిదీ - రెండూ కలిపితే పది. ఆ పది సంఖ్యలోని పదులస్థానంలోని ఒకటిని కొట్టేస్తే మిగిలేది శూన్యం. పూర్ణానుస్వారం. అటువంటి శూన్యవాటికతో - పెద్ద పూర్ణానుస్వారమైన జీవితంతో, తాను ఈవూరు కొచ్చింది. ఎప్పుడు, ఎప్పుడు పది - పదేళ్ళయిందా ? తాను యీవూరు కొచ్చి పదేళ్ళా ? చిన్నపిల్లలాగా, అప్పుడే పదులస్థానాన్ని లెక్కించే పసిపిల్లలాగా, వేళ్ళుమడుచుకుని లెక్క పెడుతున్నది. తను యీవూరొచ్చి ఎన్నాళ్ళయిందో నిర్ణయించుకోటానికి. పది...పదేళ్ళయింది. ఒక దశ గడిచిందా ? కాలం యింతవేగంగా పరుగెడుతుందా ? పరుగుపెట్టింది. కాని, కాని_యీక్షణం_ఇలా ఘనీభవించినట్లుగా, తనకి చేసే పనిలేనట్లుగా, శిలాప్రతిమలాగా వుండిపోయింది. ఏం జరిగింది ? పేషంట్లు ఎవరూ ఎందుకురాలేదు ? నర్స్, ఆయా ఎవరూ ఎందుకు రాలేదు? ఇక తనదగ్గరకు రోగులు రారా ?

పోనీ, విజిట్స్‌కి బయలుదేరుతేనో ? కుర్చీలోంచి లేచి గుమ్మందాకా వచ్చింది - గేటుముందు రిక్షాలేదు. వాడూ రాలేదా ? ఎందుకని. పక్కభాగం లోకి దృష్టి మరల్చింది. ఆదెమ్మ ముందుగుమ్మంలో నిల్చొని, తనవంక పరిశీలనగా చూస్తున్నది - లక్ష్యంలేనట్లు, ఎగతాళిగా చూస్తున్నది.

ఏనాడూ తాను రిక్షా పిల్చుకుని ఎరగదు. వాడుక రిక్షావాడు, తల గుడ్డ భుజంమీద వేసుకుని, మెడికల్‌బాగ్‌కోసం వినయంగా నుంచునేవాడు. వాడికి మరియమ్మ బాగ్ అందించేది. తను వెళ్ళి రిక్షాలో కూచునేది. ఈరోజు రిక్షాలేదు, బాగ్ అందించే మరియమ్మా రాలేదు.

'ఏంకావాలమా ?' అని ఆచెమ్మ అడగచ్చుగా. అలా హేళనగా తనవంక ఎందుకు చూస్తున్నది ? తన ముఖంమీద కోతులు ఆడుతున్నాయా? గబగబ క్లినిక్‌లోపలికి వచ్చి, లోపల రూమ్‌లోవున్న అద్దంలో ముఖం చూసుకుంది. తన ప్రతిబింబం మామూలుగానే వుంది. అక్కడా అక్కడా వున్న వెండిపెంట్రుకలు. నున్నగా దువ్విన తల. కళ్ళజోడు. సన్నని బొట్టు. తనముఖం వికృతంగాలేదు. మామూలుకి భిన్నంగాలేదు. మరి, ఆచెమ్మ ఎందుకల్లా హేళనగా చూస్తున్నది.

'ఆచెమ్మా రిక్షా పిలుచుకురా – విజిట్స్‌కి వెళ్ళాలి' – అని బిగ్గరగా చెప్పాలని అనిపించింది. కాని, కాని చెప్పలేకపోతున్నది.

'పేషంట్లు ఎవరూ రాలేదు. పేషంట్లు మీదగ్గరకు రాలేదుకాబట్టి, డాక్టరుగారు పేషంట్లని వెతుక్కుంటూ వెళ్తున్నారు-' అని లోలోపల నవ్వుకుంటుందేమోనన్న సంకోచం. తనకి ఎందుకిల్లా మొహమాటంగా, భయంగా వుంది ? తనలో ధైర్యం ఏమైపోయింది ? ఎందుకిల్లా పిరికి పడిపోతున్నాను ? పేషంట్లు రానంతమాత్రాన నేను డాక్టరుని కానా ? తనకి తాను ధైర్యం చెప్పుకుని గేటువైపు చూసింది. అంతా నిర్మానుష్యంగా వుంది. ఎండ తీవ్రత హెచ్చుతూవుందికాబోలు, పక్షుల కిలకిల శబ్దంకూడా మాయమైపోయింది. అంతా నిశ్శబ్దం.

ఈయిల్లు – యీపరిసరాలు ఎప్పుడూ యింత నిశ్శబ్దంగా లేవు. ఆఖరికి తాము కొత్తగా ఈవూరు చేరుకున్నరోజునకూడా యిలాలేదు. కొత్తవూరు, కొత్తపరిసరాలు. అయినాకూడా తండ్రి తనకి ధైర్యం చెపుతున్నట్లు గలగల మాట్లాడుతూనే వున్నాడు. రైల్లో వాంతుల్తో తారస పడ్డ ఆచెమ్మ – ముక్కుతూ మూలుగుతూ అలానే సామానుసర్దింది. ఆరోజున తండ్రి

'నువ్వు పడుకోమ్మా – కదలకు....' అని తండ్రి. ఆచెమ్మని వారించటం, తన చెవుల్లో నిన్న మొన్నటిలాగా ప్రతిధ్వనిస్తూ వుంది.

'ఫరవాలేదండి, అమ్మాయిగారు మందిచ్చారుగా. నాకిప్పుడు బాగానే వుంది - కాస్త మజ్జిగా అన్నంతింటే అన్నీ సర్దుకుంటాయి--' అన్న ఆదెమ్మ జవాబు.

తండ్రి స్టీలు డబ్బా తీసుకుని హోటల్ వుందేమోనని వెతుక్కుంటూ వెళ్ళాడు - పెరుగు కొనుక్కునిరావటానికి. తను - తను ఏంచెయ్యాలి? అన్నం ఎలా వండాలి? అని ఆలోచిస్తూ నుల్చుండిపోయింది.

'ఇదిగో అమ్మాయ్' తలఎత్తి చూసింది నాగమణి.

'పుల్లమాత్రలు రెండివ్వు - అవి నోట్లో వేసుకుంటే బాగుంటుంది. బియ్యం పెట్లోవున్నాయిలు. కాసిని తీసివ్వు. దంపటి బంటిస్తాను...' ఆదెమ్మ ఆజ్ఞలు జారీచేస్తున్నట్లు అడిగింది.

అంతక్రితం రాత్రివాకా యీ ఆదెమ్మ ఎవరో తమకు తెలియదు. మద్రాసులో రైలెక్కిన - తనకి నాన్న - నాన్నకి తనూ తప్ప మరోతోడు తెలియదు. నెల్లూరు దాటాక యీ మధ్యవయస్కురాలు - ఆగి ఆగి బాత్‌రూమ్‌కి వెళ్తూవుంటే-తాను పట్టించుకోలేదు.

అసలు తన మనసూ, మెదడూ అన్నీ మొద్దుబారిపోయాయి. తనకి స్పర్శాజ్ఞానంకూడా పోయినంత మొద్దుబారిపోయాయి.

'మనం ఈవూరునుంచి వెళ్ళిపోతున్నాం' అన్నాడు తండ్రి.

నాగమణి మాట్లాడటం మర్చిపోయినట్లు, తండ్రిమాటలని గ్రహించే శక్తి కోల్పోయినట్లు గోడకి ఆనుకుని కూర్చుండిపోయింది.

తను ఎక్కడ పుట్టింది? ఎక్కడి కొచ్చింది? తనకీ యీ చిన్న వూరుకీ ఎక్కడైనా సంబంధం వుందా? అసలు అంతకి పూర్వం యీ వూరు పేరు కూడా తను విని వుండలేదు.

ఎంతకి పూర్వం? తన జీవితంలో కారుచీకట్లు ప్రవేశించపూర్వం. కారుచీకట్లు? అవును, తన ప్రమేయం లేకుండా, తనకి తెలియకుండా సుడిగాలిలో చిక్కుకుపోయింది తన జీవితం. ఎక్కడ? ఎక్కడ? ఎలా

మొదలయింది? నాగమణి ఆలోచనలు పదిహేడేళ్ళ వెనక్కి జరిగి పోతున్నాయి. ఇన్నాళ్ళనుంచీ తన స్వాధీనంలో వున్న యీమనసు - పైలట్ లేని జెట్ లాగా భూమిమీదకి అతివేగంతో దిగిపోతున్నది.

ఆరోజుల్లో మెడికల్ కాలేజీసీట్లకి ఇంత గిరాకీ, యింత పోటీలూ వుండేవికావు. అందులోనూ ఆడపిల్లలు అంటే ఫస్టుక్లాస్ వస్తే చాలు - తప్పకుండా సీటువచ్చేది. పి.యు.సి. పాసయిన నాగమణికి, ఎటువంటి ప్రయాసాలేకుండా మెడిసిన్‌లో సీటు వచ్చింది. ఒక్కగాని ఒక్క కూతురు. చేసేది చిన్నవుద్యోగం అయినా - నాగమణి తండ్రి గోవింద మొదలియార్ పెద్ద పెద్ద ఆశల్తోనే కూతురిని మెడిసిన్‌లో జేరిపించాడు. నాగమణిని ఇలా పెళ్ళి చెయ్యకుండా పెద్దచదువులు చదివించటం ఆయన భార్య ముత్తులక్ష్మికి యిష్టంలేదు. అందంగా తీర్చిదిద్దిన బొమ్మలావున్న నాగమణిని చేసుకుంటామని - అప్పటికే చాలామంది మగపెళ్ళివారు అడుగుతూ వచ్చారు. పెద్ద సంబంధాలు, బాగా చదువుకుని మంచి వుద్యోగాలు చేస్తున్న ఒకరిద్దరు పెళ్ళి కొడుకులు-అన్ని ఖర్చులూ తామే పెట్టుకు పెళ్ళి చేసుకుంటామని అడిగారు.

'మన నాగుకి పెళ్ళి చేద్దాం - చదువు ఎందుకు? మంచి లక్షణమైన సంబంధం' అంటూ పట్టుపట్టింది ముత్తులక్ష్మి.

'ఊహూ. దానికి పెళ్ళిచెయ్యను.'

'అసలు పెళ్ళేచెయ్యరా? ఆడపిల్లకి పెళ్ళి చెయ్యకుండా వుంచుతారటండీ?' గయ్యిమని లేచింది ముత్తులక్ష్మి.

'అసలు చెయ్యననలేదు - దానికి యిష్టమైనవాడిని, మన మణిలాగా డాక్టరు చదువుకున్నవాడిని చేస్తాను. ఇద్దరూ కలిసి - ప్రాక్టీసుపెట్టుకుని మనకళ్ళెదుట వుంటారు.'

'అంతదాకా దాన్ని యిలా శిఖండిలా వుంచుతారా?'

'ఉంచుతాను. పెళ్ళిగురించి మణికి లేని తొందర నీకెందుకే?' అడిగాడు మొదలియార్, గూడకట్టు సర్దుకుంటూ. ఆయన పాతికేళ్ళుగా

మౌంట్ రోడ్‌లోని వాచీకంపెనీలో సేల్సుమన్‌గా పనిచేస్తున్నాడు. నుదిటి మీద తిరుమూర్ణంతో నామం, తలమీద టోపి యీ రెండూ ఆయన ప్రత్యేకతలు. షాపుకెళ్ళినపుడు పంచె గోచీపోసి కట్టుకున్నా - ఇంట్లో ఎప్పుడూ అడ్డకట్టే కట్టుకుంటాడు ఆయన.

'అమ్మా నాగూ, ఈ మగాళ్ళకి కష్టం సుఖం తెలియవమ్మా. ఆడపిల్లవి, పెళ్ళి చేసుకుని పిల్లా పాపాతో కళకళ్ళాడుతూ వుండాలమ్మా - నీకెందుకే యీ రోగాలూ రొప్పులూనూ. నామాట విని పెళ్ళిచేసుకో...' అంది పుత్తులక్ష్మి, నాగమణిని బుజ్జగిస్తూ. ఈ భార్యాభర్తలిద్దరూ కూతురి విషయంలో ఉత్తర దక్షిణ ధృవాలు. పుత్తులక్ష్మి నాగపూజ చెయ్యగా చెయ్యగా - పిల్ల గలిగింది కాబట్టి, నాగమణి అని పేరుపెట్టుకుని, 'నాగు, నాగు' అని పిలుస్తూ వుంటుంది కూతుర్ని. మొదలియార్‌కి 'నాగు' అని భార్య కూతుర్ని పిలవటం నచ్చదు. నాగేమిటి - 'కాగు'లాగా అని ఏడిపిస్తూ వుంటాడు భార్యని. ఆయన కూతుర్ని 'మణి' అని పిల్చుకుంటూ వుంటాడు నాజూగ్గా వుందని.

నాగలక్ష్మి తల్లి మాటలకి బదులు చెప్పలేదు. నిజానికి పదిహారుఏళ్ళు నిండని నాగలక్ష్మికి స్థిరమైన అభిప్రాయాలు ఏమీ ఏర్పడలేదు అప్పటిదాకా. మడత నలక్కుండా చీరెకట్టుకోవాలి. చీరెరంగుకి మాచ్ అయే గాజులు వేసుకోవాలి - అదేరంగు రింగులు పెట్టుకోవాలి. ఐ-బ్రోస్ సినిమాస్టార్సు లాగా ట్రిమ్‌చేసుకోవాలి. యిలా ఎంతకీ లేటెస్ట్ ఫాషన్సుపట్లతప్ప, ఆమె మనసు యిటు చదువుమీదగాని, అటు పెళ్ళిమీదగాని తీవ్రంగా లగ్నమైలేదు.

'ఆ పెళ్ళికొడుక్కి కారుంది. రెండు బంగళాలు వున్నాయి. అత్త పోరులేదు - హాయిగా పెళ్ళి చేసుకుని మహారాణిలాగా బతకొచ్చునే. కాలేజీకి వెళుతుంటే నిన్ను చూశాడట.' కూతురిని పక్కన కూచోపెట్టుకు బోధిస్తున్నది పుత్తులక్ష్మి.

'ఇదిగో అమ్మాయ్, ఒక ఆరేళ్ళు ఆగితే - నువ్వే స్వంతంగా కారు కొనుక్కోవచ్చు. నర్సింగ్‌హోమ్ పెట్టుకోవచ్చు, ఫారెన్ వెళ్ళొచ్చు'

స్వతంత్ర జీవనంలోని తళుకు బెళుకులు, స్వయంశక్తిలోని అవకాశాలు చెప్తూవున్నాడు మొదలియార్.

'పెళ్ళి కాకుండా ఆడది వంటరిగా బతకలేదండీ ఎన్ని దేశాలు ఏడితే ఏంలాభం ?' అంది ముత్తులక్ష్మి.

'అవన్నీ పూర్వపురోజులు. పెళ్ళిచేసుకుంటే ఆడదానికి కష్టాలు తప్ప—సుఖం వుండదు. ఎంత డబ్బున్నవాడైనా మొగుడూ అంటే, వాడి కాళ్ళు నొక్కాలి. మణీ! బాగా ఆలోచించుకో. నీకు మెడికల్ కాలేజీలో సీటు తప్పకుండా వస్తుంది. ఆరేళ్ళలో గొప్ప డాక్టరవవుతావు.'

'మీనాన్న మాటలు నమ్మకు. ఏం ఆయన పెళ్ళి చేసుకోలేదా ? తనకేమో పెళ్ళాం, పిల్లలూ - సంసారసుఖం అన్నీ కావాలి. నీకేమో వద్దు అంటున్నారు. మీరు పెళ్ళి చేసుకుని ఏం కష్టబడుతున్నారు ?'

'నేను మగవాడిని....కష్టపడటం అన్నది నాగురించికాదు. ఆడవాళ్ళ దృష్టితో చెపుతున్నాను.'

'అయితే ఆడవాళ్ళంతా యిలా అనుకుంటే పెళ్ళిళ్ళు వుండవు - సృష్టి ఆగిపోతుంది.'

'అందరి ఆడవాళ్ళ గురించీ నాకెందుకు. నాకూతురు తెలివయినది. ప్రత్యేకతగల అమ్మాయి. అది అందరివంటిది కాదు కాబట్టి చదువుకుని - దానికి యిష్టం అయినవాడిని, మనసులు కలిసినవాడిని పెళ్ళి చేసుకో మంటున్నాను. అంతేగాని, అసలు పెళ్ళివద్దని అనలేదే !'

'ఏమే నాగూ, ఆ అబ్బాయిని వచ్చి చూసుకోమంటావా ? ఎల్లుండి మంచిది.'

నాగమణి తండ్రివంక చూసింది ప్రశ్నార్థకంగా.

'మీనాన్నకేం, అల్లాగే చెపుతారు. చూడమ్మా, ఎంత పెద్దచదువులు చదివినా – ఎంత గొప్పవుద్యోగం చేసినా ఆడది పెళ్ళంటూ చేసుకోవా లమ్మా. ఆడదానికి సంసారం, పిల్లలూ యివి ఆభరణాలవంటివి. ఆ అబ్బాయివాళ్ళని రమ్మంటాను.'

'అది చిన్నపిల్ల. నువ్వు ఆడదానివి. నేను చెప్తున్నాను విను. అదిప్పుడు పెళ్ళిచేసుకోదు' అన్నాడు మొదలియార్‌-ఇంక మాట్లాడేది ఏమీలే దన్నట్లు!

నాగమణికి ఒకరకంగా హాయిగా వుంది. నిర్ణయం తీసుకునే బాధ్యత తండ్రి వహించాడు. డాక్టరుకోర్సు చదివితే - గొప్పగా, అందరిలో గౌరవంగా వుంటుంది. తను రోజూ బస్‌లో చూస్తూ వుంటుంది - తెల్లకోటు వేసుకుని, కనీ కనిపించనట్లు స్టెతస్కోప్‌ కాయితంలో పొట్లంకట్టుకుని వెళ్ళే ఒక స్టూడెంటుని! ఆ అమ్మాయివంక ప్రత్యేక గౌరవంతో బస్‌లో వాళ్ళు చూడటం తాను గమనించింది. తనుకూడా డాక్టరయితే! - అన్న ఆలోచనలు వస్తూండేవి అప్పుడప్పుడు. అయితే అంత పెద్ద చదువులు తమలాంటివారికి సాధ్యమా? అన్న నిరాశ కలుగుతూండేది. ఇప్పుడు ఆ అవకాశం వచ్చింది. మెడిసిన్‌లో సీటు వచ్చింది. తండ్రి చేరమంటున్నాడు. అయితే నాగమణికి ఒక విషయంలో కాస్త బాధగా వుంది. మెడిసిన్‌లో చేరితే పువ్వులు పెట్టుకోనివ్వరు. చేతినిండా గాజులు వేసుకోనివ్వరు. రంగు రంగుల చీరెలు కట్టుకోనివ్వరు. ఈ అలంకారాలు లేకుండా తాను వుండగలదా! పువ్వులంటే తనకి ప్రాణం! కొత్త కొత్త డిజైన్సు - బజారులో కొత్తరకం చీరె వచ్చిందంటే తాను కొనుక్కోవాలి, ఫాషన్సు మీద, అలంకారాలమీద అంత మోజున్న తనని తెల్లబట్టలు కట్టుకుని, నగలూ పువ్వులూ లేకుండా వార్డులో తిరగమంటారా? మూడోసంవత్సరం దాకా యీ రిస్ట్రిక్షన్సు వుంటవంటారు. మనసుని సర్దుబాటు చేసుకుంది నాగమణి.

సన్నగా పొడవుగా, చామంచాయరంగులోవున్న నాగమణిని చూడ గానే అందగత్తె అనిపిస్తుంది. పెద్ద పెద్ద కళ్ళు, బాగా పొడవుగా మోకాళ్ళ దాకా వేళ్ళాడే నిడుపాటి జడ. నుదిటిమీద గుండ్రని తిలకం, దానికి పైగా సన్నని విభూతిరేఖ; గుండ్రని తిలకం కిందుగా చిన్న మరో కుంకుమచుక్క.

కళ్ళకు వత్తుగా కాటుక. కళ్ళచివర్న పొడవుగా గీతల్లాగా తీర్చిదిద్దుకున్న కాటుకరేఖలు. నాగమణి కనుబొమ్మలు ట్రిమ్ చేసుకోక్కర్లేదు. సహజంగానే హరివిల్లులాగా వంగివుంటాయి. కంటిరెప్పలకొసలకున్న వెంట్రుకలు—నల్లగా, పొడవుగా—రెప్పలువాల్చినపుడు వింజామరల్లాగా, దించిన తెరల్లాగా ప్రత్యేకంగా వుంటాయి. ఆ కనురెప్పలు నాగమణి ముఖానికి ప్రత్యేకమైన ఆకర్షణ. మోచేతులదాకా పూసుకున్న పసుపు, పొడవాటి జెడలో మూపొందలఅరవై అయిద రోజులూ – ఆయా కాలాల్నిబట్టి – మల్లెపువ్వులు, కదంబం, డిశంబరు, కనకాంబరాలు తలనిండా పువ్వులు పెట్టుకుని, బస్‌లో రోజూ కాలేజీకి వెళుతున్న నాగమణి వయసులోని యువకులని బాలాసార్లు ఆకర్షిస్తూ వుండేది. ఆ ఆకర్షణలో చపలబారు దృక్పథంకాక – యీయువతి తనకు గృహిణి అయితే, జీవితభాగస్వామి అయితే బాగుండును – అన్న ఆశాభావం తళుక్కుమంటూండేది. అందుచేతనే నాగమణిని యువకులు ఏడిపించేవారు కాదు. సినిమాస్టార్ అనీ—బ్యూటీ అని పేర్లు పెట్టి పిల్చేవారు కాదు – వెంటబడేవారు కాదు. ఇలా బస్సుల్లోనూ, కాలేజీలోనూ చూసే – పిల్ల బుద్ధిమంతురాలు, చక్కగా వుంటుంది – అన్న అభిప్రాయంతో మగపిల్లలవైపునుంచే పెళ్ళి రాయబారాలు సాగుతూ వచ్చాయి.

కాని మొదలియార్‌కి – కూతురుకి యింత త్వరగా పెళ్ళి చెయ్యటం యిష్టంలేదు. తన కూతురు అందగత్తె, బుద్ధిమంతురాలు అని నలుగురు అనుకుంటున్నకొద్దీ ఆయన మనసు పితృగర్వంతో పొంగిపోతూండేది. 'మా.... అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని ఆరుగురు అడిగారు – ఏడుగురు అడిగారు' అని సంబంధాల సంఖ్యని మనసులోనే లెక్కపెట్టుకుని గర్వపడిపోతున్నాడు. నాగమణికి ఇటు పెళ్ళి చేసుకోవాలనిగాని, అటు మెడిసిన్ చదువుకోవాలనిగాని దేనిపైనా స్థిరమైన అభిప్రాయంలేదు. నాన్న ఎలా చెపితే అల్లా – అన్న పసిపిల్ల మనస్తత్వంతో మెడిసిన్‌లో జాయిన్ అయింది.

# 2

మెడిసిన్ రెండో సంవత్సరందాకా నాగమణి చదువు వొడుదుడుకులు లేకుండా చాలా సాఫీగా జరిగిపోయింది. రెండోసంవత్సరం పూర్తి కాబోతున్న ఆ వేసంగిలో తల్లి ముత్తులక్ష్మి రెండురోజులు-నీరసంగావుంది, కళ్ళు తిరుగుతోంది-అంటూ పక్కమీంచి లేవలేదు. నాగమణి మెడికల్ స్టూడెంటు కాబట్టి త్వరగానే హాస్పిటల్లో ఎడ్మిషన్ దొరికింది ముత్తులక్ష్మికి. ఒక వారంరోజులు రకరకాల టెస్టులన్నీ చేసి - జనరల్‌డీక్‌నెస్ తప్ప జబ్బు ఏమీలేదని యింటికి పంపించేశారు. హాస్పటల్లో ఆ వారం రోజులూ, కూతురు పరపతీ, కూతురినిబట్టి పెద్దడాక్టర్లూ, నర్సులూ తనని ఎంత శ్రద్ధగా చూసుకుంది గమనించిన ముత్తులక్ష్మి తన కూతురి తెలివి తేటలకీ - ప్రయోజకత్వానికీ మురిసిపోయింది. ఆమె సంతోషం మూణ్ణాళ్ళ ముచ్చటే అయింది. ఇంటికొచ్చిన నాలుగోరోజున - మామూలుగా నిద్ర పోయిన ముత్తులక్ష్మి - తెల్లగా తెల్లవారినా లేవలేదు - కళ్ళుతెరవలేదు. మొదలియార్ కాఫీ పెట్టుకుని తాగి, భార్యని ముఖం కడుక్కోమని లేపుదామని మంచందగ్గర కెళ్ళి పిలిచేసరికి ఎంతకీ లేవలేదు. కుదిపి లేపుదామనుకునేప్పటికి, ఆమె శరీరం చల్లగా, గట్టిగా తాకింది ఆయన చేతికి. ఖంగారుగా కూతురిని పిలుచుకొచ్చాడు. నిద్రకళ్ళతో - బెదురుతో తల్లి శరీరం ముట్టుకుచూసింది నాగమణి. అప్పటికే ఆమె శరీరం బిగుసుకు పోయింది. గుండెలకు ఎక్సర్‌సైజూ యిత్యాది ప్రయత్నాల స్థితి దాటి పోయింది. చల్లగా మంచుముద్దలావున్న శరీరం, బిగుసుకుపోయిన కాళ్ళూ చేతులూ పరీక్షించి ఏ అర్ధరాత్రో నిద్దట్లో ప్రాణం పోయివుంటుందన్న నిర్ణయానికి వచ్చింది నాగమణి. ఆ తరువాత - హాస్పటల్‌నుంచి తన బాస్ వచ్చి చూశారు. కార్డియాక్ అరెస్ట్ - అన్నారు. నాగమణి ఈ రెండేళ్ళుగా- రోగాలూ, బాధలూ, మరణాలు అతి దగ్గరలోంచి చూస్తూ వచ్చింది. కాని

తల్లి అంత నిశ్శబ్దంగా - నిద్దర్లోంచి మృత్యువులోకి జారుకోటం - ఆమె వైద్యవిజ్ఞానానికి, మేధస్సుకీ అందని మిస్టరీ అయింది. మృత్యువు భయంకరంగా వుంటం ఆమె అనేకసార్లు చూసింది. మరణయాతనకూడా చాలాసార్లు చూసింది. కాని, మృత్యువు - తన సన్నిహితులని, తనకి జన్మ యిచ్చిన తల్లిని యింత నిశ్శబ్దంగా, యింత అకస్మాత్తుగా లాక్కుపోతుందా ? తల్లిని కోల్పోయిన నాగమణి తండ్రిని చుట్టుకుని బావురుమని ఏడ్చింది. ఎందుకు యిల్లా అయింది ? తన తల్లి బాధపడిందా ? రాత్రి నిద్రలో తనని పిల్చిందా ? పిల్చినా తను నిద్రమత్తులో వినిపించుకోలేదా ? పక్కమంచంమీద పడుకున్న తండ్రికి - తల్లి పిలుపు వినిపించలేదా ? ఆఖరి క్షణాల్లో వూపిరిఆడక కొట్టుకుందా ? ఆయాసంతో, గుండెనెప్పితో గిలగిల్లాడిందా ? మంచినీళ్ళు కావాలని పిల్చిందేమో ! తామిద్దరికీ మెళుకువ లాలేదేమో ! తల్చుకు తల్చుకు బాధపడింది నాగమణి ... తాను పక్కన వుండికూడా - తల్లి ఆఖరిక్షణాలలో మెళుకువగా వుండలేకపోయానని ! ఆమె చివరిసారి వూపిరి పీల్చినపుడు తాను పక్కనే వుండివుంటే - మెళుకువుగా వుండివుంటే - గుండెలు రాచి, ఇంజక్షను యిప్పించి మళ్ళీ కొట్టుకునేటట్లు చేసి వుండగలిగేదాన్నేమో ! - అని కుమిలిపోయింది లోలోన. తాను రెండోసంవత్సరంలోవున్న, మెడికల్ స్టూడెంటని, తనకి థియరీతప్ప - ప్రాక్టికల్ ఎక్స్పీరియన్స్లేదు - అన్న విషయం తెలిసికూడా మృత్యువు ఎదుట వైద్యవిజ్ఞానం ఎంత నిరుపయోగమో అన్నది, మాట మాటికీ తలుచుకుని బాధపడింది.

ఆఖరిక్షణాల్లో తను పక్కన వుండివుంటే - తల్లి ఏంచెప్పేదో ? అసలు మెళుకువ వచ్చిందా ? అతి ప్రశాంతంగావున్న ఆమె ముఖం, పక్కమీద దుప్పటికూడా ముడతలుపడని ఆ తీరూ చూస్తే - నిద్రలోనే గుండెఆగిపోయి వుంటుంది. మెళుకువ వచ్చివుండదు, - అన్నవిషయం

ఆమె రెండేళ్ళ వైద్యవిజ్ఞానమూ చెప్తూవున్నాయి. అలాంటప్పుడు ఆమె ఆఖరిసారిగా మాట్లాడాలని అనుకోటం, పక్కన ఎవరూ లేరన్న మృత్యు భయం, యివేమీ మనసుకి తోచివుండవు – అనికూడా సరిపెట్టుకుంది నాగమణి. రక్తస్పర్శా – వైద్యవిజ్ఞానం యీ రెండూ ఆమెని ఆటుపోట్ల వలె బాధించాయి. గోడకి ఆనుకుని ముఖంమీద పైకండువా కప్పుకుని ఏడుస్తున్న తండ్రిని ఎలా వోదార్చాలి? ఆయన మనసులో యిటువంటి సందేహాలూ, రిగ్రెట్సూ లేవా అన్నట్లు చూసి, తండ్రిని కావిలించుకుని పసిపిల్లలాగా పెద్దపెట్టున ఏడ్చింది నాగమణి.

ఆ తరువాత చుట్టుపక్కలవారూ, బంధువులూ, స్నేహితులూ రావటం – మిగతా కార్యక్రమాలూ – ఆదినుంచీ ఎలా జరిగిపోతున్నాయో అలానె జరిగిపోయాయి మొదలియార్‌గారింట. ముత్తులక్ష్మి పుణ్యాత్మురాలు, అదృష్టవంతురాలు అంటూనే – మొదలియార్ మళ్ళీ పెళ్ళి చేసుకున్నా తప్పులేదు, – అన్న అమూల్య అభిప్రాయాన్ని వెలిబుచ్చారు కొందరు బంధువులు. మరికొందరేమో నాగమణికి పెళ్ళిచేస్తే – మనుమలూ, మనుమరాళ్ళతో మొదలియార్ ఆడుకుంటూ కాలం గడిపెయ్యవచ్చు అంటూ సలహాలు యిచ్చారు. తమమధ్య సన్నిహితంగా బ్రతికి, అంత్రక్రితం రోజుదాకా తమలో ఒకరిగా మసిలిన వ్యక్తి చలనం కోల్పోయి, ప్రాణ రహితమైన మరుక్షణంలో చుట్టూవ్యక్తులు భవిష్యత్ గురించి, ఆ చనిపోయినవ్యక్తి స్థానం భర్తీచెయ్యటానికి 'యింత నిర్దాక్షిణ్యంగాలా ఎలా మాట్లాడుతారు? తల్లిలేని లోటు, నాగమణికి రోజులు గడిచినకొద్దీ ప్రతి చిన్నవిషయంలో, కొట్టవచ్చినట్లు కనపడసాగింది.

అప్పటిదాకా పద్దెనిమిదేళ్ళు దాటుతున్న నాగమణికి యిస్త్రీచీరె తీసి కట్టుకోటంతప్ప – మడతపెట్టుకోటం తెలియదు. చెక్కబీరువాలోంచి – దొంతరగా పేర్చిన చీరెల్లోంచి – ఆరోజున ఏంకట్టుకోవాలో అని, రెండు

అరల్లోని చీరెను యిటూ అటూ చిందరవందరగా లాగేసి – ఆఖరికి ఎటూ తేల్చుకోలేక వంటింట్లోవున్న తల్లిని, 'అమ్మా' అంటూ బిగ్గరగా పిల్చేది.

'ఏంచీరె కట్టుకోను?' అని అదొక తీవ్రమైన సమస్యలాగా అడిగేది.

తన సలహా కూతురికి నచ్చదని ముత్తులక్ష్మికి తెలుసు. అయినా చెప్పకండా వూరుకోలేక 'ఆ చుక్కలచీరె కట్టుకోవే' అంటూ బీరువాలోంచి లాగి యిస్తూ – 'ఏంచీరె కావాలో నన్ను అడక్కూడదూ ? యిలా మడతలన్నీ లాగిపారెయ్యకపోతే? నీకు ఎన్నిసార్లు చెప్పాను – ఏచీరె కావాలో అడుగు, తీసిస్తానని! నేను రోజూ సర్దటం – నువ్వు పీక్కి పారెయ్యటమూను' అంటూ కేకలేస్తూ, చుక్కలచీరె బయటపెట్టేది. కాని, నాగమణికి ఆ చీరె నచ్చేదికాదు. తనకి తాను నిర్ణంచుకోలేక, తల్లిని ఏచీరె కట్టుకోను అని అడిగి, ఆ తీసిచ్చిన చీరె నచ్చక, మరోచీరె తీసుకుని కట్టుకునేది. తను చెప్పిన చీరెకాక మరోచీరె కూతురు తీసి కట్టుకున్నప్పుడు ముత్తులక్ష్మికి ఒక్కోరోజు కోపంవచ్చి గయ్ మనేది.

'నీకు కావాల్సిన చీరె నువ్వు తీసి కట్టుకోక – మధ్య నన్నెందుకు అడుగుతావే ? నేను చెప్పింది నీకు ఎల్లాగూ నచ్చదు. అక్కడ నాపనంతా పాడుచేసుకుని వస్తాను. పెద్ద, నామాట జవదాటనిదానిలాగా అడగటం, నేను చెప్పిన చీరె కట్టుకోకపోటం – నీకిదో పాడుఅలవాటు – మరీ మొండిదానివయిపోతున్నావు. ఇదంతా మీనాన్నే నేర్పారు' అంటూ దండకం ప్రారంభించేది –

తల్లి వాక్ప్రవాహం ఆపటానికి 'అమ్మా, పూలు కట్టావుటే ?' అడిగేది గారాలుపోతూ.

బాత్‌రూమ్‌లో టవలూ సోపూ నించి అన్నీ సిద్ధంగా వుంచే తల్లి, తను విడిచిపడేసిన చీరెలు వుతికి, గంజిపెట్టి, యిస్త్రీచేసి వుంచే తల్లి, తన చేతికి కాఫీగ్లాసు అందించే తల్లి, పేస్టుకూడా వేసిన బ్రష్, లేచేవేళకి సిద్ధంగావుంచే తల్లి, ఏది ? ఎక్కడి వెళ్ళిపోయింది ? తనని యిలా

నిరాధారంగా, చేతగానిదానిలా చేసి వెళ్ళిపోయింది. నాగమణికి తల్లిలేని లోటు ప్రతిక్షణం ప్రతి చిన్నవిషయంలో కనిపిస్తూ వున్నది.

పాలు ఎన్ని పోయించుకునేది ? కూరలు యింటికొచ్చినవి కానేదా ? బజార్లోంచి తీసుకొచ్చేదా ? బట్టలు ఎలా వుతుకుతారు ? రోజూ వంటింట్లోని కిటికీలు మూసేదా ? అసలు యింట్లో సామాన్లు ఎలా సర్దేది ? బియ్యం ఎన్ని పోసేది ? దొగ్గుల కుంపటి ఎలా అంటించేది ? పాలు పొంగ కుండా ఎలా కాచేది ? కాఫీఫిల్టరులో కాఫీపొడి ఎంత వెయ్యాలి ? ఇలా ఇంటి నిర్వహణ అనే కార్యక్రమం – నాగమణికి పెద్ద సమస్యలాగా కనిపిస్తోంది. చిన్నప్పటినుంచీ – తల్లి చనిపోయేదాకా నాగమణి వంటింటి పరిసరాలవైపు ఏనాడు వెళ్ళలేదు. నెలకి మూడురోజులూ – తండ్రి వండి పెట్టేవాడు ఆ అవసరంలో. ఆ మూడురోజులూ కాఫీగ్లాసులనుంచి, విడిచిన చీరెలదాకా అన్నీ ఒకపక్క పోసుపెట్టేది. తల్లి దూరాన సుల్బుని పనిమనిషికి పురమాయించి, చేయించుకునేది. ఈనాడు తనకి ఆ పురమాయింపు తెలియదు. అంతా కొత్తగా – భయంగా వుంది. ఇల్లంతా బోసిగా, భయంగా వుంది.

'నాన్నా, నాకు భయంగా వుంది. ఒక్కపనికూడా ఎలా చెయ్యాలో తెలియటంలేదు' అంటూ తండ్రిని పట్టుకు ఏడ్చింది నాగమణి. ఆరోజు మూడుసార్లు కుంపటి అంటించింది – మూడుసార్లూ అంటుకోలేదు. ఒక పక్క కాలేజీకి టైము అయిపోతున్నది – అన్నం అయినా వుడకలేదు. ఎలా ఎలా ?

రోజుకో యిస్త్రీచీరె కట్టుకుని కాలేజీకి వెళ్తుంటే, యిదివరలో తెల్లవారేసరికి ఆ విడిచిన చీరె మాజిక్‌లాగా వుతికి, యిస్త్రీ అయి, మళ్ళీ బీరువాలోకి వచ్చేసేది ముఫ్ఫైఆరుగంటల్లో. ఇప్పుడు విడిచిన చీరెలకుప్ప రోజురోజుకీ పెరుగుతోంది. బీరువాలో చీరెల వొంతట్లు తగ్గిపోతున్నాయి. ఏరోజూ అన్నం చిమిడిపోతున్నది – లేకపోతే బియ్యం ఎయ్యంగా వుంటున్నది.

ఎలా – ఎలా ? ... 'నాన్నా, నేను కాలేజీ మానేస్తాను' అంది నాగమణి తండ్రితో. ఆరోజు నెయ్యం నానిపోయి – తిందామని పళ్ళెంలో పెట్టుకుంటే ముద్దలా అయిపోయింది.

'అదేమిటమ్మా, వంటకి ఎవరినన్నా పెట్టుకుందా. నువ్వు చదువు మానెయ్యడం ఏమిటి ?' అన్నాడు మొదలియార్.

'నాన్నా, నాకు ఒక్కపనికూడా రాదు. అమ్మ నన్ను ఆడపిల్లలా పెంచలేదుకదూ ...' కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ అడిగింది నాగమణి.

'ఇంటిపనులు చేసుకోటం అందరికీ వస్తుంది. వైద్యం చెయ్యటం అందరికీ రాదు. 'వైద్యో నారాయణోః' అన్నారు పెద్దలు. అంటే ఏమిటో తెలుసా ?. వైద్యుడు దేవునితో సమానం. నువ్వు అటువంటి పనిచెయ్యాలి గాని, యీ వంటావార్పూ కాదమ్మా...' అన్నాడు మొదలియార్.

తండ్రి ఎన్నిచెప్పినా నాగమణికి ఆడపిల్లలకి సహజమైన పనిపాట్లు తనకి రావని – 'గిల్టీ'గా వుండేది. బీరువాలోంచి యిస్త్రీచీరె తీసినప్పుడల్లా – ఏదోబెంగ. దీన్ని ఉతకాలి, గంజిపెట్టాలి, మళ్ళీ యిస్త్రీచెయ్యాలి. ఇంత తతంగం అయితేతప్ప మళ్ళీ కట్టుకునేందుకు పనికిరాదు. కాని, రోజులు గడుస్తున్నకొద్దీ, వంటవండటం, యిల్లు సర్దుకోటం, తన చీరెలు యిస్త్రీ మడతల్తో బీరువాలో వుంటం యిత్యాది పనులు అదృశ్యంగా జరిగి పోతున్నాయి. ఇవి ఎవరు చేస్తున్నారు ? పనిమనిషా ? తండ్రా ? ఈ ఆలోచనలు నాగమణికి వస్తూ వుండేవి.

'నాన్నా' అని చాలాసార్లు ఏదో అడగాలి అన్నట్లు పిల్చేది. కాని ఎలా అడగాలి ? నువ్వు నాచీరె ఉతుకుతున్నావా ? నాచీరెకి యిస్త్రీ పెడుతున్నావా ?' అని ఎలా అడగటం నాగమణి అడగలేకపోయేది. రోజులు, వారాలు, నెలలూ గడిచిపోతున్నాయి. తల్లీ-తండ్రీ అంతా తనే అయి – మొదలియార్ కూతురికి ఎటువంటి లోటూ రాకుండా చూస్తున్నాడు. తల్లిలేని వెలితి క్రమక్రమంగా పూడుకుపోతున్నది. కొత్తలో వున్నంత

తీవ్రంగా తల్లి లేకపోవటం నాగమణిని బాధించటంలేదు. తండ్రీ కూతుళ్ళు యింకా దగ్గరై పోతున్నారు. తను యింటికొచ్చేదాకా తండ్రి వీధిగుమ్మంలో నిల్చునేవాడు కాదు – బస్‌స్టాండ్‌లోనే ఎదురుచూస్తూ వుండేవాడు. వర్షం వస్తే – తప్పకుండా గొడుగుతోసహా తండ్రి బస్‌స్టాప్‌లో ఎదురుచూస్తూ వుండేవాడు....తండ్రికి తనపైగల శ్రద్ధా, ప్రేమా చూస్తుంటే నాగమణికి కళ్ళనీళ్ళు వస్తూండేవి.

నాగమణి నాలుగో సంవత్సరంలో వుండగా తండ్రికి కూతురుపై గల ప్రేమకి విషమపరీక్ష ఏర్పడింది. మరో ఆరునెలల్లో చదువు అయిపోతుంది – ఆపైన ఒక ఏడాది కళ్ళు మూసుకుంటే తన కూతురు పెద్ద డాక్టరయిపోతుంది – అని గర్వంగా చెప్పుకుంటూ వుండేవాడు మొదలియార్. ఈమధ్యన ఆయన షాపుకి పదకొండుగంటలకి వెళ్ళి – నాలుగు అయేప్పటికి తిరిగివచ్చేస్తున్నాడు. ఆయన ఎనిమిదిగంటలు పని చేయక్కర్లేదని – స్పెషల్‌పర్మిషన్ యిచ్చారు గడియారం కంపెనీవారు. ముప్పైఏళ్ళ సర్వీసు – నెమ్మదస్తుడు, నిజాయితీపరుడు. ఆయన రోజూ షాపుకొచ్చి, మిగతా సేల్స్‌మెన్‌మీద కన్నువేసి వుంటే చాలు–అని!

ఇంట్లో తండ్రి ఏంచేస్తూంటాడు? ఆయనకి ఎలా తోస్తుంది? ఇత్యాది ఆలోచనలు వచ్చినా – నాగమణి వాటిని వెనక్కి తోసివేసేది. ఎంతకీ మెడికల్‌కాలేజి – తన డ్యూటీస్, వార్డులు ఇలా తన గొడవల్లోపడి వుండేది. ఇంటికొచ్చేప్పటికి వేడివేడిగా భోజనం, ఏనాటి కానాడు యిస్త్రీ బట్టలు, తన బస్‌కీ పై ఖర్చుకీ కావాల్సిన డబ్బు–ఇవన్నీ అమ్మ వున్నప్పటి లాగానే అమరుతున్నాయి...ఒకసారి తలనెప్పిగా వుండి నాగమణి త్వరగా వచ్చేసింది హాస్పటల్‌నుంచి. ఆరోజు ఆమె వచ్చేప్పటికి – నేలమీద చాప పరచుకుని, ఆ చాపమీద తన చీరెలు మడతపెట్టి వేసి, బొగ్గుల యిస్త్రీ పెట్టెతో యిస్త్రీ చేస్తున్నాడు, తండ్రి.

'అదేమిటి, నాన్నా - నువ్వు చేస్తున్నావ్, లాండ్రీకి యిచ్చెయ్యి. నువ్వు నాచీరెలు యిస్త్రీచెయ్యద్దు' అంది నాగమణి - తండ్రి చేతిలోంచి యిస్త్రీపెట్టె లాక్కుని-తనే చెయ్యాలనే ఖంగారులో, చెయ్యి కాల్చుకుంది.

మొదలియార్ ఖంగారుపడుతూ, 'చెయ్యి బొబ్బ ఎక్కిందమ్మా - ముందు సిరా రాస్తానుండు. నీకెందుకమ్మా యివన్నీ ? నీకిల్లాంటి పనులు రావు. చెయ్యనూ కూడదు. నేను వున్నానుగదమ్మా....' అంటూ ఖంగారు పడుతూ యింత సిరా రాశాడు అరిచేతికి. ఆ సిరా చుక్కలు చీరెమీద చిందిపడి-మంచిచీరెకాస్తా ఖరాబు అయిపోయింది.

'నాన్నా నాచీరెలు నువ్వు యిస్త్రీ చెయ్యటం బాగాలేదు. లాండ్రీకి వేసెయ్యి'

మొదలియార్ మాట్లాడలేదు. నవ్వి వూరుకున్నాడు.

'ఎందుకు నాన్నా నవ్వుతున్నావ్ ?' అడిగింది నాగమణి రెట్టించి.

'చీరెకి ముప్పైపైసలు పుచ్చుకుని, ముడతలు ముడతలుగా చేస్తున్నాడు. రోజుకి అన్ని డబ్బు లెందుకని...' ఆగిపోయాడు తండ్రి వాక్యం పూర్తిచెయ్యకుండా.

తల్లి ఇలాగే మాట్లాడేది. ప్రతిదానికి ఇంత వృధా, ఇంత దండుగ అంటూ లెక్కలు చెప్పేది. నాన్నకూడా....అల్లాగే లెక్కలు పెడ్తున్నాడు.

నాగమణి మొదటిసారి తమ యింటిపరిస్థితి గురించి ఆలోచించింది. డబ్బు ఎంత పొదుపుగా వాడి తనకి డాక్టరు చెప్పిస్తున్నారో, నాన్న ఎంత జాగ్రత్తగా డబ్బు వాడుకుంటున్నారో అన్న ఆలోచన వచ్చింది. క్షణకాలం తనమీద తనకే సిగ్గువేసింది.

'నాన్నా - రోజూ యిస్త్రీచీరె వద్దు. ఇవ్వాళ విడిచింది మళ్ళీ పై వారం కట్టుకుంటాను. లోపావడా వుంటుందిగా, అందుకని నలిగినా ఫరవాలేదు' అంది ముప్పైపైసలు తనూ ఆదా చేద్దామన్నట్లు.

'ఇలాంటి పిచ్చి ఆదాలు చెయ్యకు. అనవసరంగా డబ్బు వృధా చెయ్యటం ఎందుకన్నానుగాని, రోజుకి ముప్పైపైసలు లేకకాదు. మణీ!

నువ్వు దేనికీ యిబ్బందిపడకూడదు .... నాదేముంది, పెద్దవాడిని, అసలు రిటైర్ అయి యింట్లో కూచోవాల్సినవాడిని....'

'అయితే వుద్యోగం మానెయ్యండి' అంది నాగమణి గభాలున.

మొదలియార్ పకపక నవ్వాడు. భార్యపోయాక యింతసేపు నవ్వటం ఆయన మర్చిపోయాడు. 'మణీ, నువ్వు మెడిసిన్‌లో ఒక్క ఏడుకూడా తప్పకుండా పాసవుతున్నావంటే నాకే ఆశ్చర్యంగా వుంది.'

'ఎందుకని – నాకు బుర్రలేదనుకున్నావా ?'

'చదువులోతప్ప మిగతావిషయాల్లో నువ్వు చిన్నపిల్లతో సమానం. మన ఆర్థికపరిస్థితి – నాజీతం వీటిగురించి నీకెప్పుడయినా ఆలోచనలు వచ్చాయా ?'

'రాలేదు.'

'అందుకే అంటున్నాను. చిన్నపిల్లవని. నీకీ గొడవలన్నీ దేనికిగాని హాయిగా చదువుకో. నీకు తల్లినీ తండ్రినీ అన్నీ నేనే.'

'అందుకని ఆడవాళ్ళు చేసేపని నువ్వు చేస్తావా ? నా చీరెలు నువ్వు యిస్త్రీ చేస్తావా ?'

'మీ అమ్మ పోయినప్పటినుంచీ నేనే చేస్తున్నాను. చీరెలేమిటి ? వంట చెయ్యటంలేదా. మణీ, నీ చదువు ముఖ్యం. నువ్వు డాక్టరవ్వాలి. అంతేగాని ఆడపనీ మొగపనీ అని విడదియ్యకు.'

'అదికాదు నాన్నా ! నువ్వు యిల్లా యిస్త్రీ చేస్తుంటే'

'ఇవ్వాళ కళ్ళతో చూశావు కాబట్టి హడావుడి చేస్తున్నావే ! ఇదేం కొత్తగాదు. నువ్వు ఎప్పుడూ యిల్లాగే అమాయకంగా వుండాలి. నీచదువు– నీవైద్యం – యివితప్ప నువ్వు మిగతా విషయాల్లో కలిపించుకోకు. అందరూ పడే ప్రలోభాలకి దూరంగా వుండు–'

'అంటే ?' అడిగింది నాగమణి. తండ్రి జవాబు చెప్పలేదు. ఆ అమ్మాయి మరోసారి అడగనూలేదు. కాని ఆ సంవత్సరంలోనే తండ్రి

సూచించిన ప్రలోభాలు నాగమణి హృదయాన్ని మెల్లిమెల్లిగా స్పృశించటం ఆరంభించాయి.

ఆరోజు స్త్రీల సర్జికల్‌వార్డ్‌నుండి - గైనకాలజీ వార్డుకి వెళ్తోంది నాగమణి. మెన్స్ సర్జికల్‌వార్డు దాటుకుని - స్త్రీల సర్జికల్‌వార్డు, ఆపైనా గైనిక్‌వార్డూను. మెన్స్‌వార్డులో అది స్పెషల్‌వార్డు కాదుగాని - జనరల్ వార్డుకూడా కాదు. పెద్దహాల్లో ఇటోనాలుగూ అటోనాలుగూ మొత్తం ఎదురుబదురుగా పదహారు మంచాలు. ఈ ర్డులో డబ్బు పుచ్చుకుంటారు. ఫ్రీవార్డు కాదు. సాధారణంగా రూమ్స్, స్పెషల్‌వార్డూ దొరకని ఒకమాదిరి పేషంట్లు - కాస్త వున్నవాళ్ళు జేరుతూంటారు. ముఖ్యంగా యాక్సిడెంట్లూ వగైరా - కాజుయాలిటీ పేషంట్లకి ప్రథమ చికిత్స అయాక ఈ వార్డులో పడేస్తూ వుంటారు. ఈ వార్డులో రైలుస్టేషనులోని ప్రయాణీకుల్లాగా - రోగులు వస్తూ పోతూ వుంటారు. అక్కడక్కడతప్ప - నెలకిపైగా ఎవరూ వుండరు.

క్రితంరోజు వుదయం పదిగంటలకి ఒక పేషంటుని, యాక్సిడెంట్ పేషంటుని కార్లో వేసుకుని ట్రాఫిక్‌పోలీసులు తీసుకురావటం చూసింది నాగమణి. కాజుయాలిటీలో యిటువంటి కేసులూ - హడావుడీ మామూలే కాబట్టి అటువైపుకి వెళ్ళలేదు. అయితే ఆ పేషంటు క్రితంరోజంతా అపస్మారకస్థితిలో వున్నాడని, తలకి బలమైన గాయం తగిలిందనీ తన కొలీగ్ జుబేదా అంటం వింది. మొదట్లో ఇటువంటి కేసులు ఎడ్మిట్ అవగానే, 'ఎవరూ, ఏమిటి? ఎలా దెబ్బతగిలింది?' ఇలా విపరీతమైన కుతూహలంతో ప్రశ్నలు వేస్తూండేది ఈ ప్రశ్నలు విని, మిగతా మెడికల్ స్టూడెంట్సు ఆటలు పట్టిస్తూండేవారు. 'ఏమిటోయ్, కథలు రాస్తావా? పత్రికలకి రిపోర్టు రాస్తావా?' అని! రాను రాను కుతూహలంవున్నా దానిని కంట్రోల్ చేసుకోటం నేర్చుకుంది.

మెన్సువార్డులోంచి సన్నగా మూలుగు వినిపిస్తోంది. నాగమణి అడుగు ముందుకు పడలేదు. గుమ్మం దగ్గిరే ఆగిపోయింది. ఎక్కడినుంచి ఆ మూలుగు అని, వార్డులోకి తొంగిచూస్తూ, అన్ని మంచాల్లోనూ - కాళ్ళు విరిగినవాళ్ళు, చేతుల కట్లవాళ్ళు, ఆపరేషన్ అయ్యాక కోలుకొంటున్న వాళ్ళూ. మళ్ళీ మూలుగు .... ఆరో నెంబర్ బెడ్‌లో - మంచానికిచుట్టూ, చక్రాలస్టాండ్ : మూడువైపులా మరుగుగా వుండేందుకు స్టాండ్. పేషంటు కండీషన్ ఆందోళనకరంగా వుందా? లేక తోటీగాని, ఆయాగాని పక్కన వున్నారా? సాధారణంగా స్క్రీన్ పెట్టేరంటే - ఏ బాత్‌రూమ్‌కో అయి వుండాలి. మళ్ళీ మూలుగు. చుట్టూచూసింది - మిగతావాళ్ళు పట్టనట్లు వూరుకున్నారు.

నాగమణి ఆరోనెంబర్ బెడ్‌వైపుకి వెళ్ళి, స్క్రీన్ లోపలి కెళ్ళి తొంగిచూసింది. తెల్లగా బామపండురంగు ఛాయలోవున్న యువకుడు. ఒక కాలు ప్లాస్టర్‌లో పైకి కట్టబడి వేలాడుతూ వుంది. తలకి కట్టు. కళ్ళు మూసుకునే మూలుగుతున్నాడు.

వెళ్ళి పక్కన నుల్చుంది. మంచందగ్గిర ఎవరూలేరు. అతను మూలుగుతున్నాడు. నాగమణి అతని మణికట్టు చేతులోకి తీసుకుంది - పల్స్ చూడటానికి. ఆ స్పర్శకి కళ్ళుతెరిచి చూసి - మళ్ళీ కళ్ళుమూసుకుని మూలుగుతున్నాడు.

'ఏమిటి, ఏంగావాలి? నెప్పా? ఎక్కడ?' అడిగింది నాగమణి.

అతను తల తిప్పుకుని, కళ్ళుమూసుకునే మూలుగుతున్నాడు. నాగమణి పైన కప్పిన బ్లాంకట్ తొలగించి నెప్పి ఎక్కడ అని చొక్కా తొలగించి పొట్ట చూడబోయింది. చేతికిందుగా రేకులాగా ఏదో తగిలింది. చొక్కా వత్తిగించి చూసింది. అతని నడుంకింద బెడ్‌పాన్.

ఎంతసేపయింది? బెడ్‌పాన్ పెట్టినవాళ్ళకి తియ్యాలన్న బుద్ధి వుండొద్దా? అది వత్తుకుని కదల్లేక బాధపడుతున్నాడు. తనకి చెప్పలేక కళ్ళుమూసుకున్నాడు కాబోలు!

'కొంచం నడుం ఎత్తండి, నేను తీస్తాను' అంది నాగమణి. ఆక్షణంలో ఆమె మెడికల్‌స్టూడెంట్ కాదు. సాటిమనిషి బాధని – అర్థం చేసుకున్న మరోప్రాణి – అంతే !

అతను వద్దు అన్నట్లు నీరసంగా తల వూపాడు. అతను పడుతున్న యిబ్బందిని గ్రహించుకుని, ఆయాగాని, తోటీగాని వుంటారేమోనని వరండాలోకి వచ్చి చూసింది. ఇటు ఫర్లాంగు అటు ఫర్లాంగూ మారంలో ఎక్కడా అటువంటివాళ్ళు కంటబడలేదు. మంచంమీద పేషంటు సన్నగా మూలుగుతున్నాడు. నాగమణి మళ్ళీ ఆ బెడ్‌దగ్గర కెళ్ళింది. 'ఫరవాలేదు – ముందు మీ 'సఫరింగ్' తగ్గాలి – నేను పాన్‌ని తీస్తాను–' అంటూ బలవంతాన కాస్త నడుం ఎత్తింపచేసి – పాన్ లాగేసి మంచంకింద పెట్టేసింది.

అతను 'అమ్మయ్యా' అని డస్సిపోయినట్లు కళ్ళురెండూ మూసుకున్నాడు.

ఈలోగా తోటీవాడు వచ్చాడు.

'ఎక్కడికెళ్ళావ్ – పేషంటుకి బెడ్‌పాన్ పెట్టాక పక్కనుండాలని తెలియదా ?'

'ఓయబ్బో, ఏవిటమ్మోవ్ – అప్పుడే డాక్టరయినట్లు అథార్టీ చేస్తున్నావే... అవతల మరోపని.'

'ఏంపని ? పేషంటు కదలలేడని తెలుసు. ఆ రేకుడబ్బా అలాపెట్టి వెళ్ళిపోతే, ఏమైపోతాడనుకున్నావ్–'

'ఏవయ్యాడు – బాగానే వున్నాడుగా – ఇప్పుడు బాగానే మూలుగుతారు. పావలాడబ్బు లిమ్మనండి – మొహాలు చూసుసంటాటు. పెద్ద ఏవిటమ్మా నీగొడవ ...'

'స్టాఫ్‌కి రిపోర్ట్ చేస్తానుండు.'

'చేసుకోవమ్మా, తెల్లవాళ్లూ పాన్ పెడ్తూనే వున్నాను. అప్పుడు నువ్వొచ్చావా .... రిపోర్ట్ చేస్తుందట – నాకేం భయం అనుకున్నావా ?' గట్టిగా అరుస్తున్నాడు.

వార్డులో పేషంట్లు వినోదం చూస్తున్నారు. ఈ వివాదంలో తోటీ నెగ్గుతాడో, యీ మెడికల్‌స్టూడెంటు నెగ్గుతుందో అన్నట్లు. ఈలోపల ఆ పేషంటు కళ్ళు తెరిచాడు. దిండుకింద చెయ్యిపెట్టి యిటూ అటూ తడిమి- ఒక అర్ధరూపాయిబిళ్ళ వుంటే, తీసి చాపిన తోటీ అరిచేతులో పెట్టాడు. వాడు ఆ బిళ్ళవంక నిర్లక్ష్యంగా చూస్తూ 'ఓయబ్బ – మాగొప్పగా యిచ్చాడయ్యా, అర్ధరూపాయి. ఇప్పటికి వందసార్లు పాన్ పెట్టాను.'

'ఈ పేషంటు నిన్న వుదయంకదా వచ్చింది. నాలుగ్గంట్లదాకా యీ వార్డుకే రాలేదు. నీ ఆగడం స్టాఫ్‌కి రిపోర్టు చేస్తాను' అంటూ లేచింది నాగమణి.

ఈలోపల స్టాఫ్‌నర్స్ రావటం – తోటీవాడిని కేకలెయ్యటం జరిగాయి. వాడు ఆ బెడ్‌పాన్‌ని కావాలన్నట్లు అందరికీ చూపిస్తూ, హారతి పళ్ళెంలాగా పట్టుకుని నిష్క్రమించాడు వార్డులోంచి.

'వీడు చాలా పొగరుగా వున్నాడు, స్టాఫ్' అంది నాగమణి.

'మామీదా అల్లాగే అరుస్తాడు. ఏం చెయ్యమన్నారు ? మేట్రన్‌కి రిపోర్ట్ చేస్తాం. ఆమె మెమోపంపుతారు. వీడు ఆ కసి కడుపులో పెట్టుకుని పేషంట్లు కడుపు వుబ్బుతోంది అన్నా, పాన్ పట్టుకురాడు.'

'ఎల్లా ?'

'ఎల్లా ఏముంది – ఆమధ్య ఒక పేషంటు కడుపునెప్పి ఆపుకోలేక- బెడ్‌మీదనే పొడ్డి కెళ్ళాడు. తోటీవాడేమో నన్ను పిలవలేదంటాడు, పేషంటు 'పిల్చాను, వాడు కావాలనే వినిపించుకోలేదు-మొర్రో' అంటాడు.'

'దీనికేం దారిలేదా ?'

'ఉంది. ప్రయివేట్ నర్సింగ్‌హోమ్‌లో జేరితే సరి.'

'అక్కడ ఛార్జీలు యిచ్చుకోలేనివాళ్లు'

'తోటీవాడికి, అరగారగా రూపాయలు పంచిపెడుతుంటే సరి – పరుగు పరుగున వచ్చి సేవలు చేస్తారు. అంతా డబ్బులోనే వుంది.'

'నేను మెట్రన్‌కి రిపోర్ట్ చేస్తాను'

'చెయ్యండి – అందువల్ల నష్టంతప్ప లాభం ఏమీవుండదు.'

'ఎందుకుండదు ?

'మీకే తెలుస్తుంది – ప్రయత్నించి చూడండి' అంది స్టాఫ్ నవ్వుతూ.

ఆ సాయంత్రం యింటికి వెళ్ళబోతున్నపుడు నాగమణికి మెన్స్‌వార్డు లోని ఆ పేషంటు జ్ఞాపకం వచ్చాడు. ఒకసారి వెళ్ళి చూసి రావాలనిపించింది. స్టాఫ్ చెప్పినట్లుగా – యీ తోటీవాడు కావాలని ఆ రోగిని యిబ్బంది పెడ్తున్నాడేమో ! అసలు వాడు సరిగా ఎటెండ్ అవుతున్నాడో లేదో – అని ఆ వార్డువైపుగా వెళ్ళింది. అనవసరంగా తోటీవాడిని తాను రెచ్చగొట్టింది. గవర్నమెంటుహాస్పటల్స్‌లో గేటువాడికి, తోటీవాడికివున్న అధికారం, నోరూ, ఆఖరికి హాస్పటల్ సూపర్నెంటుకుకూడా వుండదు. ఆ విషయం తమ ప్రొఫెసరు చాలాసార్లు చెప్పారు. అయినా ఆ క్షణంలో తను కోపం పట్టలేకపోయింది. తను వెళ్ళి తోటీవాడు సరిగా ఎటెండ్ అవుతున్నాడో లేదో కనుక్కుంటుంది.

నాగమణి అవుట్‌పేషంట్సు వార్డునుంచి వెనక్కు తిరిగి, పిల్లలవార్డూ, గైనిక్‌వార్డూ అన్నీ దాటుకుని మెన్స్ సర్జికల్‌వార్డు కొచ్చింది. సాయంత్రం అయిదు దాటడంతో వరండాలూ, వార్డులు విజిటర్స్‌తో కిటకిటలాడుతూ వున్నాయి. ఎవరు రోగులో, ఎవరు విజిటర్సోకూడా చెప్పలేకుండా వున్నారు. ఒక్కొసారి రోగే దృఢంగా వుంటాడు, చూడటానికివచ్చే విజిటర్‌కంటే. వరండాలో కారియర్స్, కాయితంపొట్లాలు, ఆకులపొట్లాలు. వాటికోసం వరండా 'ఫెన్సు'మీద వాలిన కాకులు. వరండాని డైమెండ్–యినుపవలతో ఇంచుమించు పైకప్పుదాకా బిగించారు. ఆ వలలోంచి – పొడవాటి ముక్కు లోపలికి దూర్చి, తినే పదార్థాలు అందక – కావుకావుమని అరుస్తున్నదో కాకి. వరండాల్లో చేతులు కడుక్కోటం, పిల్లలు అవుటికి పోయటం సర్వసహజం అని – యిటు పేషంట్సూ, అటు హాస్పటల్‌స్టాఫూ అందరూ

అంగీకరించినట్లు, ఎవరికివారు కాళ్ళు ఎత్తివేస్తూ ఆ మడుగులమధ్యనుంచి, దాటుకు వెళ్ళిపోతూంటారు. ఇలా దాటుకుంటూ వెళ్ళిపోటం నాగమణికి అలవాటయిపోయింది.

ఇలా చికాగ్గావున్న, యీ రొచ్చూ, రోగాలూ చూసినపుడల్లా నాగమణికి - తను డాక్టరుకోర్సు - ఎందుకు ఎన్నుకున్నాను? ఎందుకు చదువుతున్నాను? - అన్న ప్రశ్నలు వస్తూంటాయి. తన చిన్నతనంలో బస్‌లో పెత్తున్న ఆ స్టెసోత్కోప్ అమ్మాయి, జ్ఞాపకాల అడుగున పడిపోయింది. తనని బస్‌లో ఎవరూ ప్రత్యేకంగా చూడరు. డాక్టరన్న గౌరవంతోకూడా ఎవరూ చూడరు. ఈ వృత్తికి గౌరవం తగ్గుతోందా? లేక, తను డాక్టరులాగా ఎవరికీ కనిపించదా? — అసలు తనెందుకు చదువుతోంది? ఈ వృత్తి ఎందుకు ఎన్నుకుంది? నాన్న చదవమన్నాడు కాబట్టి! వద్దు పెళ్ళి చేసుకో అంటే - తనూ పెళ్ళిచేసేసుకునేది.

ఛీ, పెళ్ళా? అమ్మ అంటూండేది. 'పెళ్ళి చేసేవుంటే యీపాటికి యిద్దర్ని కని వుండేదానివి' అని. తను యీకోర్సు అయిపోయాక, పెళ్ళి చేసుకుంటుంది. నలుగురు పిల్లలని కంటుంది. ఇద్దరు మగపిల్లలు, యిద్దరు ఆడపిల్లలు. తనలాగా ఒకేఒక్క - సంతానం అయినపుడు ఆడుకునేందుకు, కబుర్లు చెప్పుకునేందుకు అన్నదమ్ములుండరు. తనకి అమ్మాయిలూ - అబ్బాయిలూ యిద్దరూ కావాలి. ఇద్దరమ్మాయిలు - యిద్దరబ్బాయిలు. ఈమూలనుంచి ఆమూలదాకా వున్నవరండాలో - బెడ్‌లేక - ఆ వరండాలోనే పడుకునివున్న జనరల్‌వార్డు పేషంట్లని తప్పించుకుంటూ, నేలమీద పారుతున్న వైతరణీ ప్రవాహాలని దాటుకుంటూ, సర్జికల్‌వార్డుకి చేరుకుంది నాగమణి.

పదహారు బెడ్స్. ఎదురుబదుర్లుగా నాలుగేసి మంచాలు - తలుపుకి యీవైపున ఎనిమిది - ఆవైపున ఎనిమిది! మొత్తం పదహారు. ఒకొక్క బెడ్‌చుట్టూ నలుగురైదుగురు విజిటర్స్.

ఆరో నెంబర్ బెడ్ చుట్టూ స్క్రీన్ లేదు. స్క్రీన్ కి బదులుగా మనుషులు. నాగమణి కాస్త మొహమాటంగా - ఆ బెడ్ కి కొంచెం దూరంలో నుల్చుంది.

'డాక్టరమ్మ వచ్చారు' అన్నాడు అందులో పదహారేళ్ళ అబ్బాయి.

'ఉహూ. నేను డాక్టరుని కాను. మెడికల్ స్టూడెంటుని' అంది నాగమణి.

'నాన్నా, యిందాక చెప్పానే, ఆ వార్డ్ బాయ్ ని కేకలేశారని, ఆవిడే. పాపం - అన్నయ్య బెడ్ పాన్ తీసేవాళ్ళు లేక మూలుగుతుంటే, యీవిడ తీశారట' చెప్పుకుపోతున్నాడు ఆ పదహారేళ్ళ అబ్బాయి.

'రండమ్మా-' అని పక్కకి జరిగాడు ఒక పెద్దాయన. ముఖాన పంగనామాలు. ఎర్రంచు కండువా రెండు బుజాలమీద కప్పుకున్నాడు. మోకాళ్ళకి కాస్త కిందుగా కట్టుకున్న బిళ్ళగోచీపంచె. చేతిలో యల్. జి. యింగువసంచి. ముందు వసాలో కనిపించే బోడితల ఎగదువ్విన జుట్టు - వెనక లూజుగా ముడి. ఆయన పక్కగా - తొమ్మిదిగజాల కొరనాడు చీరె కట్టుకుని, కాస్త స్థూలంగావున్న పచ్చనిఛాయ స్త్రీ. రెండు చెవులకీ, ముక్కులకీ ధగధగ మెరుస్తున్న రాళ్ళఆభరణాలు. నుదిటిమీద గుండ్రంగా దిద్దుకున్న కుంకం. చిన్నముడి - దానిచుట్టూ కదంబమాల. తెల్లనిజాకెట్టుని కనీకనపడకుండా - పమిటచెంగుతో కప్పుకుని, పక్కకి వత్తిగిలి నుల్చుంది ఆమె. ఈ ముగ్గురూగాక, పరికిణీ వోణీ వేసుకున్న పదహారేళ్ళ అమ్మాయి.

'ఎలావుంది ?' పల్సుచూస్తూ అడిగింది నాగమణి.

'ఫరవాలేదు. నిన్నటికంటే నయం' అన్నాడతను నెమ్మదిగా.

మంచానికి వేలాడదీసిన టెంపరేచరు ఛార్టూ - కేసుషీటూ చేతులోకి తీసుకుని చూసింది.

పేరు సుందరరాజన్ అన్నమాట. మూడురోజులై ఎడ్మిట్ అయినట్లుగా వుంది.

'మీరు నిన్నటి పేషంటుకాదా ?' అడిగింది గబుక్కున నాగమణి.

'ఉహూ. మూడురోజులక్రితం వచ్చాను'

'మరి నిన్న సీరియస్ కేసు వచ్చిందన్నారు ?' అనాలోచితంగా, మిగతా ఫ్రెండ్సుని అడిగినట్లే అడిగేస్తున్నది ఈ పేషంటుని.

'అతనా... ఈవుదయం తీసుకెళ్ళిపోయారు' అన్నా డతను.

అయితే ఆ యాక్సిడెంటు పేషంటు పోయాడన్నమాట. ఇతను వేరూ, తను విన్నకేసు వేరూ అన్నమాట.

నాగమణికి యింక ఏంమాట్లాడాలో తెలియటంలేదు. పల్సురేటూ, టెంపరేచరూ నార్మల్‌గానే వున్నాయి. అక్కడినుంచి కదలిపోయింది, మరి విషయాలేం లేవన్నట్లు.

'అమ్మా, అబ్బాయికేం ప్రమాదం లేదుగదా ? ఇంకా ఎన్నాళ్ళుండాలి ?' ప్రశ్నించింది ఆ పెద్దావిడ.

'ప్రమాదం ఏంలేదండి – ఇంకొ నాలుగైదు వారా లుండాలనుకుంటా'

'బిడ్డ కాలేజీకని బయలుదేరాడు. పాపిష్టిదాన్ని అన్నంకూడా పెట్టలేదమ్మా – లైటయిపోయిందని ... గబగబా వెళ్ళాడు, నా తండ్రి' ఆవిడ కళ్ళుతుడుచుకుంటూ చెప్తోంది.

'ఉండవే, ఇప్పుడేమయింది. అబ్బాయికి ప్రమాదం లేదన్నారు గదా....నువ్వేడవకు. మూడురోజులనుంచీ యిదే వరసమ్మా. ఆరోజు అన్నం పెట్టకండా పంపిందిట. అందుకని యాక్సిడెంట్ అయిందని గోల'

'అబ్బే, అన్నానికి, యాక్సిడెంటుకీ సంబంధం వుండదండీ. ఈరోజుల్లో....ఎక్కడబడితే అక్కడ యాక్సిడెంట్స్...'

'తల్లీ ....నువ్వు చెప్పు. నాతండ్రి నడుస్తాడా? వాడికి కాలొస్తుందా... పాపిష్టిదాన్ని తిండి పెట్టకుండా పంపాను.'

'వొస్తుంది. ఒక్క ఆరువారాలు పోనివ్వండి, మామూలుగా నడుస్తారు....కాంపౌండు ఫ్రాక్చరు కాబట్టి ఆరువారాలు. అదే చిన్నదయితే యింకా త్వరగా నయమవుతుంది' అంది నాగమణి.

'అమ్మా....పుత్తూరు తీసుకెడితే వారంరోజుల్లో...'

'అల్లాంటి పిచ్చిపనులు చెయ్యకండి. అసలు బొమికె అతుక్కుంటే తప్ప – యిక్కడినుంచి డిశ్చార్జి చెయ్యరు. పెద్దడాక్టరుగారిదగ్గర యీ పుత్తూరు విషయం ఎత్తారంటే ఆయనకి కోపం వస్తుంది.'

'ఒసేయ్ మంగా, నోరుమూసుకుంటావా లేదా ? ఇల్లా అవకతవకగా మాట్లాడావంటే ఆస్పత్రికి తీసుకురాను' అన్నాడు పెద్దాయన భార్యని గదమాయిస్తూ.

'అయ్యో, మీకేం ఎన్నయినా చెపుతారు. వాడు నాకొడుకండి. పెద్దవాడికి పెళ్ళాంతప్ప నేను కనిపించను. వీడు అమ్మా-అమ్మా అంటూ నా కొంగుపట్టుకు తిరిగే అమాయకుడండి - వాడు యిల్లా పక్కమీద - యీ ఆస్పత్రిలో-'

'నోరు మూస్తావా లేదా ?' ఆయన గట్టిగానే కేకపెట్టాడు. ఇది ఆస్పత్రి అని మర్చిపోయినట్లున్నాడు. ఆవిడ కళ్ళు తుడుచుకుంటూ – వాక్ప్రవాహాన్ని కట్టేసింది.

కుడిచేతిలోని సంచీని ఎడంచేతులోకి మార్చుకుని, బొడ్లో దోపుకున్న పొడుండబ్బా తీసి, అందులోంచి చిటికెడు పొడుంతీసి - ఒకపట్టుపట్టి - వేళ్ళను పంచెకు రాసుకుని 'అమ్మా డాక్టరమ్మా-యిలా ఒకసారి వస్తారా?' అని పిల్చాడు నాగమణిని.

'నేను డాక్టరుని కానండి. మెడికల్‌స్టూడెంటుని' అంది నాగమణి మళ్ళా.

'ఫరవాలేదమ్మా. ఆస్పత్రిలో యీమాత్రం మాగురించి కనుక్కున్న దానివి నువ్వొక్కర్తెవే అమ్మా. నీలాగా, దయగా మాట్లాడే మనిషి కరువయిపోయారు తల్లీ. పెద్దడాక్టరుగారు మాటే మాట్లాడరు. ఆ చిన్న డాక్టరు కస్టమంటాడు ఏవడిగినా. ఆ నర్సమ్మేమో, అసలు జవాబే చెప్పదు.

నాయింటిది వెర్రిబాగుల్ది. నిన్నే నమ్ముకున్నాం' అన్నాడు ఆ పెద్దాయన రెండుచేతులూ జోడిస్తూ.

'నన్నా - దేనికి ?'

'నిజం చెప్పు, తల్లీ - పెద్దవాడిని - నీ తండ్రిలాంటివాడిని. మావాడి కాలు వస్తుందంటావా ? మామూలుగా నడుస్తాడంటావా ?'

'ఎందుకు రాదండి ? తప్పకుండా వస్తుంది. రేపు ఎక్సెరేఫొటోలు అవీ చూసి వివరంగా చెపుతాను. మీరేం ఖంగారు పడకండి.'

'వెయ్యేళ్ళు దీర్ఘ సుమంగళివై వర్ధిల్లు, తల్లీ. బీదబ్రాహ్మడిని - నా దీవన వృథాపోదు. పిల్లాపాపాతో సుఖంగా కలకాలం వర్ధిల్లుతావు.'

'నాకింకా పెళ్ళికాలేదండి.'

'అవుతుంది - మహాలక్ష్మిలాగా వున్నావు. చదువుల సరస్వతివి. నిన్ను చేసుకునేవాడు పుణ్యం చేసుకుని వుంటాడమ్మా - తల్లీ, రేపు ఎన్నింటికి రమ్మన్నావు ?'

'దేనికండి ?'

'అదే మావాడి ఫొటోలు చూసి చెపుతానన్నావే_'

'సాయంత్రంవేళ రండి.'

'తల్లీ, రేపు సాయంకాలం నాకు అర్చనవంతు వుందమ్మా. నాలుగింటికల్లా కోవెల్లో వుండాలి. మధ్యాహ్నం రానా ?'

'మిమ్మల్ని రానిస్తారా ?'

'అబ్బాయికి అన్నం పట్టుకొస్తాను, తల్లీ - పెద్దడాక్టరుకి చెప్పి, గేటుపాసు తెప్పించిపెట్టమ్మా....'

'మీకు గేటుపాసు యివ్వలేదా ?'

'ఒక్కటే యిచ్చారు. ఇందాక రూపాయిన్నర చేతులో పెడితేగాని మమ్మల్ని లోపలికి వెళ్ళనివ్వలేదు.'

'విజిటింగ్ అవర్సులోకూడానా ? అప్పుడు డబ్బు లివ్వక్కర్లేదే ?'

'ఇద్దరికంటే వదలను అని కూచున్నాడు. మేము నలుగురంగదా - పై యిద్దరికీ మనిషికి రూపాయి యిస్తేగాని వదలనన్నాడు. తల్లీ, యింకో పాసు తెప్పించిపెట్టవా?'

'చూస్తాలెండి' అంది నాగమణి. కాని తనకి తెలుసు. యాభై ఆరు పాసులున్నా - ఆ గేటువాడు రూపాయికీ, అర్ధకీ చేతులు జాపుతాడని! ఒకసారి సూపర్నెంటుగారి భార్యని రూపాయి యిస్తేగాని లోపలికి వదల లేదు. ఆరోజు వాళ్ళకారు రిపేర్లో వుండి, ఆవిడ టాక్సీలోంచి దిగి, లోపలికి రాబోయిందిట - ఫ్రెండుకి డెలివరీ అయితే చూడటానికవచ్చి! వీడు రెండురూపాయి లిస్తేగాని వదలనని - ఆఖరికి రూపాయి పుచ్చుకుని దయాధర్మంగా వదిలాడుట లోపలికి. ఆవిడ ఇంటికెళ్ళి భర్తమీద గయ్‌మని లేచిందట 'మీరేం సూపర్నెంట్' అని. 'వాడికి నా మొహం గుర్తుంది కాబట్టి సరిపోతున్నది - లేకపోతే నాదగ్గరా వసూలు చేస్తాడు' అని భార్యకి సంజాయిషీ యిచ్చుకున్నాడుట ఆయనగారు.

ఈయన తనకేదో పెద్ద పరపతి వుంది అనుకుంటున్నాడు. స్టాఫ్‌కీ, వార్డుబాయ్‌కీ వున్నదాంట్లో పదోవంతు అధికారంకూడా లేదు. ఏం అడిగినా విదిలించికొట్టే స్టాఫూ - అసలు తమ వునికినే గుర్తించనట్లు ప్రవర్తించే వార్డుబాయిస్సూ, తమని కిండర్ గార్టెన్ పిల్లల్లాగా చూసి - తిట్టి హేళనగా మాట్లాడే ప్రొఫెసర్సూ, ఆడస్టూడెంట్స్‌కి - ఒకరిమీద మరొకరికి అసూయా, ఏ ప్రొఫెసర్‌ని ఏ స్టూడెంటు వల్లో వేసుకోపోతున్నదో అన్న వూహాగానాలు. మొగస్టూడెంట్స్‌కి సందుదొరికితే చాలు చిన్న చిన్న సరసాలాడాలనే సరదా ... ఇవన్నీ కలిపితే తమ స్టూడెంట్ జీవితం. ఈ పెర్రిబ్రాహ్మణుడు తనకేదో పెద్ద పరపతి వుంది, తన చేతిలో గొప్ప అధికారం వుంది - అని ఆశపడుతున్నాడు.

'తల్లీ - డాక్టరమ్మా, మావాడిని ఒక్కసారి పరీక్షచేసి మరీ వెళ్ళు. నిన్నరాత్రంతా తలపోటుతో బాధపడ్డాడు. మా చిన్నవాడికి ఏమీ తెలియదు.

ఈయనఏమో – ఆ కోవెల విడిచి బయటకి రారు. ఆ చిన్నవెధవ నిద్ర కాగనేడు...' అంటూ ఆవిడ గునగున నడుస్తూ వరండాలోకి వచ్చింది.

వీళ్ళకి తను డాక్టరు కాదు, నాలుగో సంవత్సరం స్టూడెంటు అని చెప్పినా లాభంలేదు. వినిపించుకోరు. అనుకుని, యీసారి ఆవిషయం జ్ఞాపకం చెయ్యటం మానేసింది.

మంచందగ్గిర కొచ్చింది. పక్కన నుల్చుని 'తలనెప్పా ?' అంటూ కట్టుదగ్గర యిటు అటూ చేతులు వేసిచూసింది,

'ఎలా తగిలింది ?' అడిగింది.

'అంత సీరియస్‌కాదు. లారీ గుద్దుకోటంలో పేవ్‌మెంటుమీద విసురుగా పడ్డానుట. తలకి కొద్దిగా నెప్పి' అన్నా డతను.

'ఎక్సరే తీశారా ?'

'తీశారుట. ఏమీ దెబ్బతగ ల్లేదన్నారు.'

'మరి తలనెప్పి, నిద్రపట్టలే దంటున్నారు – మీ అమ్మగారు.'

'నిన్నరాత్రి ఆ పేషంటుకి సీరియస్‌గా వుండి, డాక్టర్లూ – నర్సులూ వచ్చిపోతూ వున్నారు.'

'కాంపోజ్ వేసుకోలేదా ?'

'నర్సు యివ్వలేదు' అన్నా డతను.

మళ్ళీ ఛార్టుతీసి చూసింది.

డ్యూటీనర్సు టేబుల్‌దగ్గరకెళ్ళి – అతని కేస్‌షీట్ చూసింది. అందులో 'కాంపోజ్' యిమ్మని రాసేవుంది. అయినా నర్సు యివ్వలేదు. ఇది యింతే, పెద్దడాక్టరు రాసినా – పేషంటుకి చొరవా, పరపతీ వుంటేగాని, అతి చిన్నమందులుకూడా సరిగ్గా పడవు. సిస్టర్ నడిగి రెండు కాంపోజులు తీసుకొచ్చింది.

'రాత్రికి మీకు కాంపోజ్ యివ్వకపోతే, ఇది వేసుకోండి. ఒక్కటే వేసుకోండి. రేపు పొద్దుట వచ్చి – రెండోది వుందో లేదో చూస్తాను' అంది.

అతను చిన్నగా నవ్వి, 'అల్లాగే - ఒక్కటే వేసుకుంటాను' అన్నాడు.

ఆరోజు నాగమణికి తృప్తిగా - కొంచెం గర్వంగాకూడా అనిపించింది. తన దయాధర్మంమీద ఈ కుటుంబమంతా ఆధారపడి వుంది. ఏమీ తెలియని అమాయకులు. వారికి తనకి చేతనయినంత సహాయం చెయ్యాలి-అని నిశ్చయించుకుంది. బస్ దిగేసరికి తండ్రి బస్‌స్టాప్‌లో నుల్చుని వున్నాడు. చుట్టూ చీకట్లు అలుముకుంటున్నాయి. నాగమణి వైపు చూసుకుంది - ఏడుకావొస్తున్నది.

'ఇంత ఆలశ్యం అయిందేమ్మా?' అడిగాడు తండ్రి.

'డ్యూటీ అవలేదు నాన్నా' అంది నాగమణి - తనకి తెలియకుండానే చిన్న అబద్ధం ఆడుతూ. నిజానికి అది డ్యూటీ కాదు. తను కావాలని ఆ పేషంటుదగ్గరకి తిరిగివెళ్ళింది - సరాసరి బస్‌స్టాపుకిరాక.

నాగమణికి అంతదాకా రాత్రిళ్ళు నిద్దరపట్టకపోవటం, అనవసరమైన ఆలోచనలు రావటం యిలాంటి గొడవలు వుండేవికాదు. ఎగ్జామ్స్ వుంటే పుస్తకాలు ముందేసుకుని టేబుల్‌ముందు కుర్చీలో కూచుని చదివేది. చదవవలసింది పూర్తిఅయాక పక్కమీదకొచ్చి పడుకునేది. మెడికల్ కాలేజీలో చేరాక - తండ్రి తనకోసం టేబుల్‌లాంప్ కొన్నాడు. అది గదిలో ఒకమూల టేబుల్‌మీద వుండేది. పక్కమీద పడుకున్నాక చదువుకోటం అనేది నాగమణికి అలవాటులేదు. పడుకోగానే హాయిగా నిద్రపట్టటం ఆమె నిత్యకృత్యం. కాని, ఈరోజు రాత్రి పడుకోగానే నిద్రపట్టలేదు. ఆరో నెంబర్ బెడ్‌మీదవున్న, ఆ పేషంటుచుట్టూ ఆమె ఆలోచనలు పరిభ్రమిస్తున్నాయి. తెల్లగా జామపండులా వున్న అతనిముఖం,

మొహమాటంగా. యిబ్బందిగా నవ్వే ఆ కళ్ళు, పదేపదే జ్ఞాపకం వస్తున్నాయి. అతనితో మాట్లాడాలని, పరిచయం పెంచుకోవాలని మనసు యువ్విళ్ళూరుతున్నది. తనకి ఎందుకిలా ఆలోచన లొస్తున్నాయి ? తనని తాను ప్రశ్నించుకోటానికి ప్రయత్నించలేదుగాని, తండ్రి ఏమంటాడో ? ఆయనకి యిలాంటి పరిచయాలంటే యిష్టం వుండదు. చదువుతప్ప ఎవరితోనూ పరిచయాలు పెట్టుకోవద్దంటాడు. ఆఖరికి తన కాలేజీ ఫ్రెండ్సుతో కూడా అవసరానికిమించి స్నేహంవద్దు - అంటాడు. అంతదాకా తండ్రికి తెలియని ఏ వొక్క పరిచయమూ తనకిలేదు. కాలేజీలోని ప్రొఫెసర్సు పేర్లుకూడా తండ్రికి తెలుసు. అలా పూసగుచ్చినట్లు ప్రతిదీ - ఏరోజున ఏంజరిగిందో తండ్రితో చెప్పే తను - యీనాడు యీపేషంటుని గురించి చెప్పలేకపోతోంది. చెపుతే నాన్న 'నీకెందుకమ్మా - ఇవన్నీ, డాక్టర్లూ, నర్సులూ వున్నారు. నీ చదువేమో - నువ్వేమో - అలా వుండాలిగాని' అంటాడు నెమ్మదిగా. కాని, తనకి అతనితో మాట్లాడాలని వుంది. అతన్ని చూడాలని వుంది. పక్కన మంచంమీద కూచోవాలని వుంది.

ఆమరునాడు అవుట్ పేషంట్సువార్డులో నాగమణికి పదిన్నరదాకా వూపిరిఆడని పని. పదకొండు దాటాకగాని బయటపడటానికి వీలవలేదు. పని అయాక చేతులు శుభ్రంగా కడుక్కుని, తెల్లకోటు విప్పి పడేసి, మెన్స్ వార్డువైపుకి వచ్చింది. అక్కడ స్టాఫ్‌ని అడిగి, సుందర్ రాజన్ కేసుషీటు తీసుకుని, రిపోర్ట్ డిటైల్డుగా చదివింది. ఎక్సరేలు చూసింది. కుడికాలు - మోకాలు కిందగా ఎముక ఏటవాలుగా విరిగింది. సరిగ్గా విరిగితే త్వరగా అతుక్కుంటుంది. ఏటవాలు అంటే కాస్త శ్రమపడుతుంది. ఆరువారాలు ఖచ్చితం.

అతని బెడ్‌దగ్గర కెళ్ళేప్పటికి - మంచందగ్గర ఎవరూలేరు. అక్కడ దాకా వెళ్ళిన నాగమణికి ఏదో సంకోచం, మాట్లాడాలన్న వుత్సాహం. కాని ఏంమాట్లాడాలో తెలియని సందిగ్ధం.

'మీనాన్నగారు రాలేదా ?' అడిగింది, పేషంటు పల్స్ చూస్తూ. అతనికి జ్వరంలేదని తెలుసు. బి. పి. కూడా లేదు. కాని డాక్టరు అయినపుడు ఏదో పరీక్ష చేసినట్లు వుండాలిగా !

'ఇంకా రాలేదు' అన్నా డతను నెమ్మదిగా.

'నీరసంగా వున్నట్లున్నారు. పొద్దుట ఏంతీసుకున్నా'రని అడిగింది నాగమణి.

అతను జవాబు చెప్పలేదు.

ఆమె వెనకాతలే వచ్చిన వార్డ్ బాయ్ 'ఈ అయ్యగారు ఏం తీసుకోరు. మన ఆస్పత్రిబ్రెడ్ ఆయన అహారానికి సరిపోదుట' అన్నాడు కాస్త హేళనగా.

'ఏమిటి ?' ఉలిక్కిపడి ప్రశ్నించింది నాగమణి మళ్ళీ.

'డైట్ షీట్ లో యిచ్చినవి – ఈ పేషంటు ముట్టుకోడమ్మా – అన్నీ యింటినుంచి రావాలంటారు. ఆఖరికి పాలుకూడా ముట్టుకోడు.'

పేషంటు ఎడ్మిట్ అవగానే – యిచ్చే డైట్ షీటులో గుడ్లూ, పాలూ, బ్రెడ్, పళ్ళు తప్పకుండా వుంటాయి ఆ షీట్ లో. రాసిన ప్రకారం యివ్వటం లేదు అని కంప్లయింట్ చేసే పేషంట్లని చూసిందిగాని, యిచ్చినవి వద్దు అనేవారిని యింతవరకూ చూడలేదు నాగమణి. కొంతమంది ముందుగానే డైట్ వద్దు అంటారు. అంచేత డైట్ షీట్ అలాంటివాళ్ళకు రాయటం అనే ప్రశక్తి వుండదు.

'మరి డైట్ షీట్ ఎందుకు రాయించుకున్నారు ?' అడిగింది నాగమణి.

'అంటే ఏమిటి ? మాకు ఆ గొడవలేం తెలియవు–' అన్నా డతను నిదానంగా.

'మరి – పాలూ, గుడ్లూ...'

'ఛీ, ఛీ – గుడ్లా....' అసహ్యంతో అన్నాడు.

'పోనీ, బ్రెడ్ తీసుకోవచ్చుగా'

'నాకు అలవాటులేదు. మాతమ్ముడు రోజూ కాఫీ తీసుకొస్తూంటాడు'

'అంటే యివ్వాళ తేలేదా ?'

అతను జవాబు చెప్పలేదు.

'లేదమ్మా. పొద్దుట నర్సు మొహం కడిగించి వెళ్ళిపోయింది – ఆ తరవాత యీ బాబు నోరు తెరవలేదు.'

నాగమణి షాక్ తగిలినట్లు నిలబడిపోయింది. 'పరగడుపున మందులు వేసుకోకూడదని మీకు తెలియదా ? పాలుకాకపోతే కాఫీతో వేసుకోవచ్చుగా.'

మళ్ళీ నిశ్శబ్దమే జవాబు.

'హోటల్‌నుంచి కాఫీ తెప్పించుకోలేకపోయారా ? బాయ్‌ని పిలుస్తే తెచ్చిపెట్టేవాడుగా.'

అతను కళ్ళుమూసుకున్నాడు జవాబుగా.

'మీతమ్ముడు కాఫీ తేలేదా ?'

'తేలేదు.'

'పోనీ యిక్కడెవరిచేతనయినా తెప్పించుకోలేకపోయారా ?' మళ్ళీ రెట్టించింది – 'యీపక్కనే బ్రాహ్మణహోటలుంది – మీ అచారానికి పనికి రాకపోతే...'

'రాత్రి నాన్నదగ్గర డబ్బులు పుచ్చుకోటం మర్చిపోయాను' అన్నా డతను కాస్త సిగ్గుపడుతూ.

నాగమణికి ఆ యువకుని చూస్తే యీసారి చాలా జాలేసింది. అసలు కారణం తెలుసుకోకుండా – రకరకాల ప్రశ్నలువేసి అతన్ని విసిగించింది. పాపం చేతిలో డబ్బుల్లేవుకాబోలు.

'ఉండండి–' అంటూ వార్డ్‌బాయ్‌ని పిలిచి, ఫ్లాస్కు చేతికిచ్చి, పర్సులోంచి రూపాయి తీసియిచ్చింది.

'వద్దండి – భోజనం వస్తుందిగా. ఇప్పుడు కాఫీ తాగితే ఆకలి పోతుంది' అన్నాడతను మొహమాటంగా. నాగమణి వినిపించుకోలేదు. మంచంపక్కనున్న స్టూలు లాక్కుని కూచుంది.... పేషంట్లపక్కన, ఇలా మెడికల్‌స్టూడెంట్సు, అందులోనూ నాలుగో సంవత్సరంలోకి వచ్చిన తను యిలా కూచోటం మంచిదికాదు. బాస్ చూస్తే పీకలు పట్టుకుంటారు. ఫరవాలేదు. మాబంధువని చెపుతాను. అంతేగాని యీ యువకుని యిలా ఆకలితో వదిలి వెళ్ళిపోను – అని మనసులో నిశ్చయించుకుంది.

'మీతమ్ము డెందుకు రాలేదు ?' అడిగింది అలా నిశ్శబ్దంగా కూచుంటే బాగుండదని.

'వాడికి కుదురులేదు. ఇంట్లోంచి బయటుదేదే వుంటాడు....'

'మీయిల్లెక్కడ ?'

'నిన్నవచ్చింది ?'

'మా అమ్మానాన్న – చెల్లాయి, తమ్ముడూ.'

'యాక్సిడెంట్ ఎలా జరిగింది ?'

'కాలేజీకి వెళ్తున్నాను – వెనకనుంచి లారీవచ్చి గుద్దేసింది. ముందు భాగం అయితే మీకు కనిపించివుండేవాడిని కాదు – వెనకభాగం. కర్రలు పట్టుకెడుతున్నారు. కర్ర బుర్రకి తగిలి పక్కకి పేవ్‌మెంటుమీద పడ్డాను.

'వొక్కరేవున్నారా ?'

'ఒక్కణ్ణే – చుట్టూవాళ్ళు చూసి ఆస్పత్రిలో తీసుకొచ్చి పడేశారు.'

'కాన్‌షస్‌గా లేరా ?'

'ఉందిగాని, ఏదోభయం, మాట్లాడలేకపోయాను. మధ్యాహ్నం మూడింటికిగాని, తెలివిరాలేదు. కళ్ళు తెరిచేప్పటికి – ఖూవార్డులో వున్నాను.'

'మీవాళ్ళకి ఎలా తెలిసింది ?'

'నాచేతిలో పుస్తకాలనిబట్టి, ట్రాఫిక్‌పోలీసులు - కాలేజీకి తెలియ బరిచారు. కాలేజీవాళ్ళు నాన్నకి చెప్పారుట...'

ఈలోగా కాఫీ వచ్చింది. అతను వద్దంటున్నా వినకండా, బలవంతాన కాఫీ తాగించింది. కాఫీతాగాక అతను నిస్త్రాణగా కళ్ళు మూసుకున్నాడు. అప్పుడుగాని నాగమణికి అతనిచేత మాట్లాడించటం తప్పు అన్నది తట్టలేదు. పొద్దుటనుంచీ నోరుతెరవకుండా వున్నతనికి ఎంత నీరసంగా వుండి వుంటుందో? కళ్ళుమూసుకు పడుకోనివ్వక తాను క్రాస్‌ఎగ్జామినేషన్ చేసింది. అతనివంక పరిశీలనగా చూస్తున్నది. ముగ్గిన జామపండులా, పసుపూ తెలుపూ కలిసిన రంగు. విశాలంగావున్న నుదురు, గడ్డం నల్లగా, నిగనిగలాడుతూ వుంది. నాలుగురోజులు పెరిగిన గడ్డం - వత్తుగాలేదుగాని, నలుపువర్ణానికి తిరుగుతూవుంది. కళ్ళు చిన్నవిగా వున్నాయి. ముక్కు పెద్దసైజులోనే వుంది. పొడవుగా మంచానికి, యించుమించు సరిపోయి నట్లుగా వున్నాడు. ఒకకాలు ఎత్తిపెట్టి - పైనించి వేలాడుతూ వుంది ప్లాస్టర్ మధ్యనుంచి. రెండోకాలు మంచం అవతలివైపుకి తగిలేట్లుగా, జారుగా జారివుంది. అతను నెమ్మదిగా కళ్ళుతెరిచాడు. పరిశీలనగా చూస్తున్న - ఆమె కళ్ళలోకి సూటిగా రెప్పవాల్చకుండా చూశాడు. నాగమణికి ఎలాగో వుంది, గుండెలు గబగబా కొట్టుకుంటున్నట్లుగా వుంది - అక్కడినుంచి వెళ్ళిపోవాలని వుంది - మరుక్షణంలో అతను అలా సూటిగా చూస్తుంటే, తనుకూడా అతని కళ్ళలోకి చూడాలని వుంది.

'చాలా థాంక్సు' అన్నాడతను.

'దేనికి? మీరు వేషంటు. ఏమీ తినకండా, తాగకుండా వుండ కూడదు. ఆ సంగతి తెలుసా?'

'తెలుసు. నాకు పాలు సయించవు. అలా పింగాణీమగ్గుతో పట్టుకొస్తుంటే....'

'మీరు బ్రాహ్మణులా?'

అవును అన్నట్లు తలవూపాడు. ఆపైన ఏమి అడగాలో తట్టటం లేదు నాగమణికి. ఇతనితో మాట్లాడాలి. మాటల్లోకి దించాలి. ఇలా మాట్లాడుతూ కూచుంటే కొత్తగా, సంతోషంగా వుంది.

'ఏం చదువుతున్నారు?'

'ఎం. ఎ. ప్రివీస్'

నాగమణి మళ్ళీ అతనివంక చూసింది. అతనిముఖం – ముదురుగా వుంది. గడ్డాలూ, మీసాలూ బాగానే వచ్చాయి. తన మెడికల్ నాలెడ్జి ప్రకారం యీతని వయసు పాతికగా వుండి వుంటుంది అనిపిస్తోంది. పాతికేళ్ళదాకా ఎమ్. ఎ. చదువుతున్నాడా?

'కొన్నాళ్ళు డిస్కంటిన్యూ చేశాను. ఆరేళ్ళయింది. బి. ఏ కంప్లీట్ చేసి, మళ్ళీ యిప్పుడు చేరాను' అన్నాడతను.

'డిస్కంటిన్యూ ఎందు చేశారు?'

'ఇంట్లో గొడవలవల్ల. మా అన్నయ్యా - నాన్నా పేచీలుబడ్డారు. కోర్టుదాకా వెళ్ళారు....'

'ఆస్తివ్యవహారాలా?'

'కాదు-గుళ్ళో అర్చనవిషయంలో.'

'దానికి కోర్టులా!'

'ఆ అర్చనలో తనకీ వంతుకావాలని అన్నయ్య తగాదా. నాన్నగారి ఆరోవాటాలో - తనకి సగం కావాలని కోర్టు కెక్కాడు... ఆరోజుల్లో చదవటానికి వీల్లేకపోయింది' అన్నాడతను.

నాగమణికి ఇదంతా గందరగోళంగా వుంది. గుళ్ళో అర్చకులేమిటి? దానిలో వంతులేమిటి - ఆ వంతులో భాగాలూ, దానికి కోర్టులు యివేమీ అర్థంకాలేదు. ఈలోగా కారియర్ తీసుకుని, అతని తండ్రి వచ్చాడు.

'మీపేరు సుందర్‌రాజనా?'

'మీకెవరు చెప్పారు?' అడిగా డతను.

'కేసుషీట్‌లో వుంది' అంది నాగమణి.

'ఆలశ్యం అయిపోయింది, తల్లీ....ఏరా ఎలావుంది - కాలునెప్పి తగ్గిందా?' మెడమీద చెమటని పై వుత్తరీయంతో తుడుచుకుంటూ, కారియర్ బల్లమీద పెట్టాడు సుందరరాజన్ తండ్రి. పై వుత్తరీయంలోంచి జంధ్యం ఆచ్ఛాదనలేని వొళ్లూ కనిపిస్తోంది.

'పొద్దుటనుంచీ మీ అబ్బాయి కాఫీ తాగలేదు. కాఫీ పంపలేదా?' అడిగింది నాగమణి.

'అదేమిటి? తమ్ముడికిచ్చి అమ్మ పంపిందే - పొద్దున్నే బస్‌కి కావాలని అరపైసలు తీసుకున్నాడు. కాఫీ ఫ్లాస్కులో పోసిచ్చిందే మీఅమ్మ.'

'ఏమో, ఎవరూ రాలేదు. ఈయనదగ్గర చిల్లరకూడా లేదుట. కాఫీ కూడా లేకుండా అలా వున్నారు' అంది నాగమణి కుండ బద్దలుకొట్టినట్లు.

'ఓరి భ్రష్టుడా, ఆ డబ్బులు వుచ్చుకుని ఎక్కడో తిరుగు తూంటాడు. వెధవని యింటికి రానియ్, వీపు చీరేస్తాను' అంటూ చిందులు తొక్కుతున్నాడు సుందరరాజన్ తండ్రి. ఆయన పేరు కృష్ణమాచార్యులుట. తరువాత సుందరరాజన్ చెప్పగా వింది. కొడుకు కాఫీ తాగలేదన్న బాధ కంటే, చిన్నకొడుకు డబ్బులు ఏంచేశాడో అన్నబాధ ఆయన కెక్కువగా వున్నట్లుంది.

'చూడండి. మీ అబ్బాయికి త్వరగా బొమిక అతుక్కోవాలంటే యింతకంటే క్రమంగా, బలమైన ఆహారం యివ్వాలి. ఇక్కడ యిచ్చేవి ఆయన తిననంటున్నారు.'

'అంతేనమ్మా, నాపిల్లలకి బయటతిండం అలవాటులేదు. అన్నీ యింట్లో మాఆవిడ చెయ్యాల్సిందే' అంటూ బొట్లోంచి ముక్కుపొడుండబ్బా తీశాడు.

'ముందు పేషంటుకి అన్నంపెట్టండి' అంది నాగమణి చికాగ్గా. పొద్దుటనించి నిరాహారంగావున్న పేషంటుని చూస్తే, ఆతండ్రికి బాధగా

లేదా ? నాగమణి యీ ఏడాదికాలంలో వార్డులలో చాలామంది పేషంట్లని చూసింది. పైపుకు భోజనం తేలేదనో, తెచ్చింది బాగాలేదనో, కారియర్ తెచ్చినవాళ్ళమీద విసుక్కోటం, అవతలివాళ్ళు బ్రతిమాలుకోటం చూసింది గాని, ఇలా కడుపులో ఆకలిగావున్నా, పైకి శాంతంగా వుండేవాళ్ళని చూడలేదు. 'అసలు పేషంటు అంటే మంకుతనం చేసేవాడు – వున్నబాధని పదిరెట్లు గుణించి హడావుడి చేసేవాడు' అనుకుంటూండేది యిన్నాళ్ళు. ఈరోజు ఈ యువకుని చూశాక 'అందరూ అలా వుండరేమో' అన్న సందేహం తొలిసారి కలిగింది నాగమణికి.

లియోకాఫీపొడి ఎడ్వర్టైజుమెంటుగల గుడ్డసంచీలోంచి కారియరూ, నీళ్ళసీసా బయటికి తీశాడాయన. సంచీలోనే గొట్టంలాగా చుట్టచుట్టిన అరిటాకు. ఈ పేషంటు అరిటాకులో ఎలా తింటాడు ? ఈ తల్లితండ్రులకి యీమాత్రం జ్ఞానంలేదేం ? ఇదేం విందుభోజనమా, సావకాశంగా ఆకు పరుచుకు తింటానికి.

'ఆకులో ఎలా పెడ్తారు ? వుండండి, నేను పట్టుకుకూచోపెడ్తాను' అంటూ మంచాన్ని తలవైపున కొద్దిగా ఏటవాలుగా ఎత్తింది – అవైపున వున్న కడ్డీతో. అతని వొళ్ళో దిండుపెట్టి, దానిపై తువ్వాలుపరిచి కారియర్ గిన్నెలు, తువ్వాలుమీద పేర్చి, కారియర్ పై చెమ్చా చేతికి యిచ్చి 'దీంతో తీసుకుతినండి – చేత్తోవద్దు. ఇక్కడ పరిసరాలు క్లీన్‌గా వుండవు – మీరు తినేదాకా వరండాలో వుంటాను' అంటూ బయటకి నడిచింది _ అతను ఫరవాలేదు అంటున్నా వినిపించుకోకుండా.

నాగమణి వరండాలోకి వచ్చి నిల్చుంది. ఈవైపున ఇసుపమెష్ లేదు. కాకులు ధారాళంగా వరండాల్లో స్వేచ్ఛావిహారం చేస్తున్నాయి. భోజనాలు తింటున్న పేషంట్లూ, కారియర్లు పట్టుకొస్తున్న విజిటర్సూ. వీరిని అదమాయిస్తూ మధ్యమధ్య తమ అధికారాన్ని ప్రదర్శిస్తున్న వార్డ్‌బాయ్. చేతిలో యింజక్షన్ ట్రేతో పక్కవార్డులోకి వెళుతున్న నర్సు

ట్రయినీ, నాగమణిని చూసి భయభక్తుల్తో విష్ చేసింది. ఈ హాస్పటల్ ఆవరణలో మమ్మల్ని చూసి భయపడేజాతి యీ ట్రయినీలొక్కరే - అనుకుంది తనలో తాను.

నేను యిక్కడెందుకున్నాను ? నాగమణికి ఆకలిగా వుంది. ఈపాటికి తను లంచ్‌బాక్స్ విప్పేసి తిని, కోస్టూడెంట్సుతో కబుర్లు చెప్పుకుంటూ వుంటుంది. ఇంటరన్స్ రెస్టరూమ్‌లో తమని లంచ్‌బాక్స్‌లు పెట్టుకోనిస్తున్నారు. అన్నం తిన్నాక కాసేపు కూచున్నా ఎవరూ ఏమీ అంటంలేదు. ఈరోజు ఆరుబాక్సుల్లో అయిదే ఖాళీ అయివుంటాయి. తన బాక్స్ తనకోసం ఎదురుచూస్తూ వుంటుంది. పొద్దుట ఆమ్లెట్టూ, పాలూ తీసుకొచ్చిన తనకే యింత ఆకలిగా వుందే - పాపం, పచ్చిమంచినీళ్ళు కూడా తాగని అతనికి ఎంత ఆకలి వేసిందో ?

ముక్కుపొడుం ఘాటుగా పీల్చేసి, రెండువేళ్ళూ పంచకు తుడుచు కుంటూ, సుందరరాజన్ తండ్రి తనవైపుగా వస్తున్నాడు.

'అప్పుడే వొచ్చారేం, అన్నం దగ్గరుండి పెట్టకపోయారా ?'

'నేను తినగలను, వెళ్ళమన్నాడు.'

'మంచినీళ్ళిచ్చారా ?'

'సీసా పక్కన పెట్టాను. అమ్మా డాక్టరమ్మా....'

మళ్ళీ పాతపాటే. తను డాక్టరు కాదు - స్టూడెంటు అని ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోరేం ?

'ఫోటోలు చూశారా ?'

'చూశానండి. ఒక నెలపైనే వుండాల్సివస్తుంది. బొమికె కోసుగా విరిగింది.'

'నెల్లాళ్ళే ! పోనీ పుత్తూరు తీసుకెళ్ళి కట్టు కట్టిస్తే ! మూడురోజుల్లో నయమైపోతుందిట' అన్నాడాయన.

'అలాంటి పిచ్చి పిచ్చి పనులు చెయ్యకండి. మీరు అనవసరంగా తొందరపడుతున్నారు. మీ అబ్బాయికి జ్వరంలేదు. బి. పి. లేదు. తలమీద

గాయంకూడా చాలా చిన్నది. కదలకుండా ఒక్క నాలుగువారాలు పడుకుంటే, బొమిక దానంతట అదే అతుక్కుంటుంది' అంది గదమాయిస్తున్నట్లు నాగమణి.

'మీరు చెప్పింది నిజమే అనుకోండి. కాని మా కుటుంబపరిస్థితులు బాగాలేవమ్మా-'

'ఏం?'

'మా మంగ, అంటే నాభార్య; పెర్రిబాగుల్ది' అన్నాడాయన.

నాగమణికి యీమాట అబద్ధంగా అనిపించింది. ఆవిడ అఖండమైన తెలివితేటలుకలది కాకపోవచ్చుగాని పెర్రిబాగుల్దిమటుకు కాదు. మామూలు సగటు గృహిణిలాగానే వుంది.

'ఆడపిల్లని వంటరిగా పంపలేనుకదా, ఈ చిన్నవాడేమో ఇవ్వాళలాగా యిష్టం అయితే వస్తాడు; లేకపోతే ఏ సినిమాకో పారిపోతాడు. నాకేమో పై వారం వరస అర్చన' అన్నాడాయన.

ఈ అర్చనభాష నాగమణికి బోధపడటంలేదు.

'ఉదయం పాలూ, రొట్టె యిస్తున్నారుగా. అవి ఎందుకు తివకూడదు?'

'ఛ ఛ ... అరొట్టె మాకెవ్వరికీ పనికిరాదమ్మా'

'మరి?'

'అదే నేను మొరబెట్టుకునేది. నెల్లాళ్ళపాటు ఉదయం కాఫీ, మధ్యాహ్నం రాత్రీ భోజనం యివన్నీ తెచ్చిపెట్టేవాళ్ళు లేరమ్మా...'

'పనివాడిని పెట్టండి.'

ఆయన జవాబు చెప్పలేదు.

'పెద్దడాక్టరుగారితో చెప్పి, ఒక వారంరోజుల్లో యింటికి పంపే ఏర్పాటు చెయ్యండి - చచ్చి మీకడుపున పుడతాను.'

నాగమణికి చికాకు వేస్తోంది. యాక్సిడెంట్ అయి వారంఅవలేదు. మొదటి ప్లాస్టర్ విప్పలేదు. అప్పుడే డిశ్చార్జి చెయ్యాల్ట. 'నాకా విషయాలు

తెలియవండి. పెద్దడాక్టరుగారు మీరుకాదు, బ్రహ్మదేముడు దిగివచ్చి చెప్పినా వినరు. ఆయిన పంపదల్చుకున్నపుడు, కాలు పూర్తిగా అతుక్కుందన్న నమ్మకం కుదిరాక, ఎక్సరేలో అతుక్కున విషయం స్పష్టంగా కనిపిస్తే తప్ప యింటికి పంపరు. మీరు అడిగి, అవమానపడతారేమోనని చెపుతున్నాను, ముందుగానే' అంది నిష్కర్షగా నాగమణి.

ఆయన నిరాశగా చూశాడు. 'తల్లీ, మేము బీదవాళ్ళం - యీ ఆస్పత్రిచుట్టూ తిరగడానికి రోజుకి అయిదురూపాయలు అవుతోంది.'

'అల్లా అనుకుంటే ఎల్లాగండి ? మనిషి అన్నతరువాత రోగాలూ, జబ్బులూ రాకుండా వుంటాయా' అంది నిష్ఠూరంగా.

'నిజమే తల్లీ. కాని దాన్ని భరించేశక్తి మాకేది ? మాపెద్దవాడేమో నానోట మన్నుపోసి, వాడిదారిన వాడు పోయాడు. వీడేమో వుద్యోగంచేసి వుద్ధరిస్తాడనుకుంటే, యిల్లా కళ్ళుమూసుకు నడిచి, దెబ్బ తగిలించుకున్నాడు. చివరివాడేమో వుత్త అల్లరివెధవ. నాగోడు ఎవరికి చెప్పుకోను?'

'మీరు చెప్పేమాటలు విచిత్రంగా వున్నాయి. ఎవరైనా కావాలని లారీకింద పడతారా ? మద్రాసులో రోజుకి ఎన్ని రోడ్డు ప్రమాదాలు జరుగుతాయో మీకు తెలుసా ?'

'తెలుసుకుంటే నాకేం లాభం ? ముందు వీడికి తిండీ తిప్పలూ ఎలా అమర్చాలో తెలీక....'

'వార్డ్‌బాయ్‌కి కాసిని డబ్బులిస్తే, రోజూ కాఫీ తెచ్చిపెడతాడు.'

'హోటల్‌నుంచా ?'

'మరి-'

'రోజుకి రూపాయి అవుతుంది-కాఫీకి, ఆ తెచ్చేవాడికి. ఎందుకమ్మా దండగ.'

'అయితే పక్కమీద పడున్న మనిషి - కాఫీ యివ్వక మాడుస్తారా? మీరు చెప్పేదేమిటో నాకు అర్థం కావటంలేదు.'

'ఇంటికి తీసుకువెడితే - యీ తిప్పటా, ఖర్చూ రెండూ తగ్గుతాయి' అన్నాడాయన.

నాగమణి గిరుక్కున వెనక్కి తిరిగింది. ఆయనతో మారు మాట్లాడకుండా, ఆయన వెనకనుంచి పిలుస్తున్నాడు - 'అమ్మా - అమ్మా' అని. వినిపించుకోదలచుకోలేదు ఆమె.

డబ్బుతప్ప మరోవిలువలేని మనుషులు. పైసలూ, పావలాలు లెక్కపెట్టుకునే దరిద్రులు. కొడుకు కాలువిరిగి ఆస్పత్రిలో వున్నాడన్న విచారంకంటే, రోజుకి అయిదురూపాయలు అవుతాయన్న ఏడుపు. ఇల్లాంటివాళ్ళతో మాట్లాడటం తనదే తప్పు. ఎంతమంది పేషంట్లు అలా వరండాల్లో పడుకోటంలేదు ? ఎంతమందికి యీరొట్టెకూడా అందుబాటులో వుంటంలేదు ? అల్లాంటివారిలో ఇతను ఒకడు - నాకెందు కీపీడ, అనుకుని, ఆ సాయంత్రందాకా యీ ఆరోనెంబర్ పేషంటుగురించి ఆలోచించటం మానేసింది. అతనిగురించి మనసులో ఒక్కసారికూడా తలవకూడదు - అని గట్టిగా నిశ్చయించుకుంది. నిజంగానే ఆ మధ్యాహ్నం అతని గురించి జ్ఞాపకం రాలేదు. అయితే సాయంత్రం బస్‌కి నుల్చున్నపుడు, బస్‌లో కూచున్నాక మళ్ళీ ఆ ఆరోనెంబర్ పేషంటు గురించి జ్ఞాపకం రావటం ఆరంభించింది. క్రితంరోజు బెడ్‌పాన్ పెట్టేసి తోటి వెళ్ళిపోయినపుడు, అతని మూలుగు, నిస్సహాయంగా అతను సన్నగా మూలగటం - చెవుల్లో తిరిగి వినిపిస్తూవుంది. బస్ కదిలేశబ్దంలోంచి అతని మూలుగు చీల్చుకుని వచ్చి ఆమె చెవుల్లోకి దూరుతోంది.

ఆ తండ్రి ఏంచేసి వుంటాడు ? రాత్రికి భోజనం ఎవరు తెచ్చి వుంటారు ? తేకపోయినా, ఆకలితో కళ్ళుమూసుకు-పడుకునివుంటాడేతప్ప- ఆస్పత్రివాళ్ళు యిచ్చే పాలు తాగడుకాబోలు. ఇది ఎక్కడి మూర్ఖత్వం ? ఈ పంధొమ్మిదివందల అరవైల్లోకూడా యిలాంటి చాదస్తులు వుంటారా ?

ఆ సాయంత్రం తండ్రి యిచ్చిన కాఫీ నాగమణికి వెగటుగా అనిపించింది - రాత్రి అన్నంకూడా సరిగా తినలేకపోయింది.

'ఏంఅమ్మా - వంట్లో బాగాలేదా ?' అడిగాడు తండ్రి.

'లేదు నాన్నా, నా ఫ్రెండు బర్త్‌డేట - బాగా టిఫిన్ పెట్టించింది. పార్టీ యిచ్చింది' అంది అబద్ధం చెపుతూ.

అనుకోకుండా తన నోటివెంట అబద్ధం వచ్చింది. తండ్రికి యీ అరోనెంబరు పేషంటు గురించి చెప్పాలని అనిపించటంలేదు. చెపుతే ఆయన ఏదో అంటాడనికాదు. అతన్ని గురించి ఎవరికీ చెప్పకూడదు. తనొక్కర్తె ఆ జ్ఞాపకాన్ని దాచుకోవాలి.

'నాన్నా, నాకో పదిరూపాయలు ఎక్కువ కావాలి' అడిగింది మరునాడు తండ్రి బస్‌కి డబ్బులిస్తుంటే ; ఆయన ఎందుకు అని అడగలేదు. 'అల్లాగే తీసుకోమ్మా' అంటూ పదిరూపాయలు హేండ్‌బాగ్‌లో పెట్టాడు. నాగమణికి బస్‌కని తండ్రి రోజూ రూపాయిచొప్పున హేండ్‌బాగ్‌లో పెడ్తూంటాడు. బస్‌పాసు వున్నాకూడా అదిపోతుందేమో, పారేసుకుంటుం దేమోనని ఆయనకి భయం. తండ్రి పదిరూపాయలుదేనికి అని అడగలేదు. నాగమణికి మనసులో 'గిల్టీ'గా వుంది. ఆ డబ్బు దేనికి అడుగుతున్నదో ఆమెకే స్పష్టంగా అర్థం కావటంలేదు. కాని, ఒక పదిరూపాయలు కావాలి. ఒకవ్యక్తికోసం - ఆడబ్బు అవసరం అవచ్చు.

'నా ఫ్రెండుకి వంట్లో బాగాలేదు, నాన్నా' కారణం తనే చెప్పుకుంటోంది.

'ఇంకోపది అవసరం అవుతుందేమో, పళ్ళు తీసుకెళ్తావా?' అడిగాడు ఆయన.

'వొద్దు, ఇవి చాలు' అంది పైకి. కాని మనసు - అబద్ధాలు చెపుతున్నావ్ అంటూ హెచ్చరిస్తోంది. తండ్రి ఆడఫ్రెండు అనుకుంటు న్నాడు. ఈ డబ్బు నిజంగా స్నేహితురాలికోసమా ? అతను తనకి

స్నేహితుడు కాడు - ఒక పేషంటు. అతనితో తనకి మాట్లాడాలి అనిపిస్తున్నది - పక్కన కూచోవా లనిపిస్తున్నది. ఈరోజు వెళ్ళకూడదు - ఆకుటుంబంతో సంబంధం పెట్టుకోకూడదు, అని క్రితంరోజు మధ్యాహ్నం నిశ్చయించుకుంది. కాని, యీ పదిరూపాయలు ఎవరికోసం? అతన్ని తను చూడకుండా వుంటుందా?

తండ్రి యిస్త్రీచేసిపెట్టిన లేతరోజారంగు వాయిల్‌చీరె కట్టుకుంది. అదేరంగు జాకెట్. మెడిసన్‌లో చేరాక, నాగమణి ముదురురంగుచీరెలు, తలనిండా పువ్వులు, చేతికి రంగు రంగుల గాజులు యివన్నీ తగ్గించేసింది. చేతికి రిస్టువాచీ, మెళ్ళో సన్నని చైనూ, లేతరంగు వాయిల్‌చీరెలు. వార్డ్సులో తిరుగుతున్నపుడు తన పొడవాటిజడ గురించి, రెండుమూడుసార్లు కామెంట్స్ వింది. అప్పటినుంచీ-మూడో ఏటినుంచే-జడ అల్లుకుని, మెడ మీదకి పడకుండా చుట్టచుట్టుకోటం అలవాటు చేసుకుంది. స్వభావంలో మార్పులేకపోయినా వేషభాషల్లో - నాలుగేళ్ళక్రితం మణికీ - యీ ఫోర్త్ యియర్ స్టూడెంట్ మణికి మధ్య చాలా వ్యత్యాసం వుంది. మెడికల్ స్టూడెంట్సు రొమాన్సులోపడటం, తోటి స్టూడెంట్సుని పెళ్ళి చేసుకోటం, మామూలు కాలేజీల్లోకంటే ఎక్కువగా సంభవించే అవకాశం వుంది అంటూ వుంటారు చాలామంది. ఈమాదిరి కామెంట్సు నాగమణికూడా వినివుంది. తోటిస్టూడెంట్సూ, ఒకరిద్దరూ చిన్నడాక్టర్లూ తనతో చనువుగా ప్రవర్తించటానికి ప్రయత్నించినా, నాగమణి అటువంటి పరిచయాలకి ప్రోత్సాహం యివ్వలేదు - కాస్త దూరంగానే వుంటూ వచ్చింది. ఆమె మనసు ఏ డాక్టరిపట్లా, ఏ స్టూడెంటుపట్లా ఆకర్షింపబడలేదు.

ఇప్పుడు మెడిసిన్ ఆఖరిసంవత్సరంలోకివచ్చిన తను యీ పేషంటు గురించి ఎందుకిలా ఆకర్షితురా లవుతోంది? అతన్ని చూడాలని ఎందుకీ ఆతృత? ఇలా ప్రవర్తించటం, తప్పా రైటా - అన్న ఆలోచన కలుగలేదు. అతన్ని చూడాలి - అతను కాఫీ తాగాడో లేదో కనుక్కోవాలి?

అన్నం తిన్నాడో లేదో అడగాలి. ఈ ఆతృత ఆమెని నిలువనివ్వటంలేదు. పదకొండున్నర ప్రాంతాల - మెన్స్‌వార్డ్ కెళ్ళింది. అప్పటికి 'చీఫ్' రౌండ్స్ అయిపోతాయి. నర్సులూ వాళ్ళూకూడా వార్డులో వుండరు. వార్డు బాయ్ వున్నా ఫరవాలేదు. నాగమణి వార్డుగుమ్మందగ్గర నుల్చుంది. లోపలికి వెళ్ళాలా, వద్దా అని నిశ్చయించుకోలేక

అతని మంచందగ్గర ఎవరూ లేరు. మంచానికి కాళ్ళవైపునవున్న తాడు కొంచెం కిందకి దించినట్లుగా వుంది. డాక్టరు ప్లాస్టర్ మార్చారా ? మళ్ళీ ఎక్స్‌రే తీశారా ? వారం అయింది కాబట్టి ప్లాస్టర్ మార్చివుండచ్చు. నెమ్మదిగా మంచంపక్కకెళ్ళి ఛార్టుతీసి చూసింది. అంతా నార్మల్‌గానే వుంది. అతను కళ్ళుతెరిచి చూశాడు. ఇకళ్ళలో ఆశ్చర్యమూ లేదు, సంతోషమూలేదు.

'మీరు రారనుకున్నాను' అన్నాడతను నెమ్మదిగా.

నాగమణి వినిపించుకోనట్లు వూరుకుంది.

'పొద్దుట-కాలికి మళ్ళీ ప్లాస్టర్ వేశారు.'

'ఎక్స్‌రే తీశారా ?'

'ఎలావుందిట-'

'కాలు కదిపారా అని కేకలేశారు.'

'కదిపారా ?'

'ప్లాస్టర్ పైన ఎండిపోయి - డొలకలా అయిపోయింది. కాలంతా దురద.'

'అలా కదపకూడదు.'

'ఆవిషయం నాకెవరూ చెప్పలేదు' అన్నాడతను.

'బోన్ అతుక్కుంటున్నదా ?'

'ఆవిషయం చెప్పలేదు. పాతప్లాస్టర్ కోసేసి కొత్తది వేశాడు' అన్నాడతను ప్లాస్టర్ వేసిన కాలుచూపిస్తూ.

నాగమణి పక్కనున్న స్టూలు లాక్కుని కూచుంది.

అతను కళ్ళుమూసుకున్నాడు.

'నీరసంగా వుందా?'

'కాలు కాస్త లాగుతోంది. ఎక్స్‌రే డిపార్ట్‌మెంటుకి వెళ్ళొచ్చేప్పటికి...'

'స్ట్రెచర్‌మీద తీసుకెళ్ళలేదా?'

'దానిమీదనే తోసుకెళ్ళారు. ఆ వార్డులూ అవ్వీ చూసేప్పటికి కాస్త గాబరా పుట్టింది'

'కాఫీ వచ్చిందా?'

అతను మాట్లాడలేదు.

'ఇంటినుంచి కాఫీ రాలేదా?' మళ్ళీ రెట్టించింది. అతను తల తిప్పుకుని మరోవైపుకి చూస్తున్నాడు.

'పొద్దుటనుంచీ ఏంతినలేదా?' అడిగింది నాగమణి.

'బిస్కట్స్ తిన్నాను.'

'మీతమ్ముడు రాలేదా?'

'వాడు యింటికొచ్చి వుండడు.'

'మీకెల్లా తెలుసు?' అడిగింది నాగమణి.

'చెప్పినపని వాడు సరిగ్గా చెయ్యడు. మానాన్నకి పిచ్చికోపం. ఆయన కొట్టేస్తాడని వాడికి తెలుసు. ఓ రెండు మూడురోజులు యిక్కడా అక్కడా గడిపివస్తాడు.'

'ఇక్కడా, అక్కడా అంటే ఈవూళ్ళో మీకు చుట్టాలు చాలామంది వున్నారా?'

'చుట్టాలింటికి వెళ్ళడు. మా అన్నయ్యా వదినా వున్నారుగా - అక్కడే కెళ్ళివుంటాడు. మా నాన్నమీద కక్ష సాధించటానికి మా వదిన వాడికి అన్నంపెట్టి మేపుతుంది' అన్నాడతను.

వీళ్ళ కుటుంబగొడవలు తన కెందుకు ? పొద్దుటనుంచీ కాఫీ లేకుండా వున్నాడన్నమాట.

'మరి అన్నం వస్తుందా ?'

'వస్తుంది. మానాన్న తీసుకొస్తారు.'

'ఇంకా రాలేదేం ?'

'నాన్నకి యీరోజు ఏదోపని వుంది'

'మీ భోజనంకన్నా ఎక్కువా ? పొద్దుటనుంచీ ఏం తినలే దంటున్నారు.'

'మాకు అలవాటే.'

'ఆకలితో వుంటమా ?'

'అదికాదు. పొద్దుట ఏమీ తినకండా వుంటం.'

'రోజూ తీసుకోరా'

'పూజలూ-వ్రతాలూ అయితే నాన్న, తను తినరు ; మమ్మల్ని నిష్టగా వుండమంటారు.'

'ఈరోజు మీనాన్నగారు అల్లాంటిపనిమీదనే వెళ్ళారా ?'

'ఎవరింట్లోనో వ్రతం వుందిట. అది చేయించి అన్నం తీసుకొస్తారు' అన్నాడతను అదేదో మామూలు విషయంలాగా.

'టైము ఎంత వుతుంది ?'

'చెప్పలేం, అవతల కుటుంబాన్నిబట్టి వుంటుంది. పన్నెండు అవచ్చు-రెండూ కావచ్చు.'

'పోనీ మీచెల్లెలుగాని-అమ్మగారుగాని తీసుకురావచ్చుగా.'

'నాన్న ఆడపిల్లని ఒక్కడానిన్నీ పంపరు. అమ్మని వెళ్ళనివ్వరు' అన్నాడతను గానుగకి కట్టిన ఎద్దులాగా మళ్ళీ నాన్న యిష్టాయిష్టాల దగ్గరకే వస్తూ.

'హోటల్‌నుంచి యిడ్లెన్లు తెప్పిస్తాను. అది మీవాళ్ళ హోటలే - ఫరవాలేదు. తినచ్చు' అంటూ నాగమణి వార్డ్‌బాయ్‌ని వెతుక్కొచ్చి, వాడి చేతికి డబ్బులిచ్చి పంపింది. నాలుగు యిడ్లెన్లు పొట్లం కట్టించి తీసుకు రమ్మని.

అవి వచ్చాక అతన్ని యించు మించు బలవంతంచేసి తినిపించింది. అతను తిన్నాక చెప్పాడు 'మీకు చాలా శ్రమకలిగిస్తున్నాను' అని.

'మీకు పొద్దుట కాఫీ, రెండుపూట్లా భోజనంవస్తే నేను శ్రమ పడను. అల్లా తెప్పించుకోండి' అంది నాగమణి.

'అది సాధ్యపడదు.' అన్నాడతను.

'ఎందుకని?' సవాల్ చేస్తున్నట్లు అడిగింది.

'మాయింటి పరిస్థితులు మీకు చెప్పినా అర్థంకావు.'

'డబ్బు బాధలా ?'

'అంత డబ్బులేకపోవటంకాదు. మానాన్న పట్టుదలా, మాయింటి ఆచారం, చాలా గొడవలూ వున్నాయి.'

'చెప్పండి - చెపితేగాని అర్థం అవదుకదా ?'

'మీరు భోంచేశారా ?' అడిగాడు అతను.

'ఇంకాలేదు.'

'ముందు మీరెళ్ళి లంచ్ తీసుకునిరండి - ఆపైన చెపుతాను' అన్నాడు.

'ఫరవాలేదు. నాకు ఆకలిగాలేదు. పొద్దుట బ్రేక్‌ఫాస్ట్ తీసుకునే వస్తాను.'

'పొద్దుటనుంచీ కాళ్ళమీద నిలబడి వుంటారు. మాకుమల్లే మీకు ఉపవాసాలూ, ఒంటిపూటలూ అలవాటు వుండదు. వెళ్ళితినండి. శ్రమ అనుకోకపోతే సాయంత్రంలోగా ఒకసారి రండి.'

'సాయంత్రం మీవాళ్ళు రారా ?'

'ఉహూ. ఎవరూ రారు.'

'మరి రాత్రిభోజనం?'

'నాన్న రాత్రికికూడా యింకో కారియర్ యిప్పుడే తీసుకొస్తారు' అన్నాడతను.

నాగమణి అక్కడ నుల్చోలేకపోయింది. ఇంకా నుల్చుంటే ఏమి వినాల్సివస్తుందోనని అక్కడినుంచి కదిలి గబగబ అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రం నాగమణి వార్డుకి వెళ్ళేప్పటికి ఆరున్నర దాటిపోయింది. పేషంట్సుని చూడటానికి వచ్చిన విజిటర్స్‌ని నర్సులూ, వార్డు బాయ్‌లూ కలిసి హడలుకొట్టేస్తున్నారు టైము అయిపోయిందని. ఇంచు మించు తరుముతున్నారు విజిటర్స్‌ని.

ఆమె వెళ్ళేప్పటికి, ఆరోనెంబర్ బెడ్‌మీద పేషంటు కూచుని వున్నాడు. అతను సాధారణంగా పడుకుని వుంటమే చూసింది నాగమణి యిన్నిరోజులుగా. మంచం తలవైపున కాస్త ఎత్తుచేసి వుంది - వెనకాల దిండువేసుకుని - ఆనుకుని కూచున్నాడు.

'రండి, డాక్టర్ .. మీరు రారేమోనని భయపడిపోతున్నాను' అన్నాడతను.

'నేను డాక్టరునికాను. స్టూడెంట్‌ని'

'కొద్దిరోజుల్లో అయిపోతారుగా !'

'అప్పుడే ఎక్కడా ఒక ఏడాది హౌస్‌సర్జన్సీ వుంటుంది. అది అయితేగాని మాకష్టాలు గట్టెక్కవ్' అంది నాగమణి నవ్వుతూ.

'అన్నం తిన్నారా ?'

అతను కొంచెం సిగ్గుపడుతూ నవ్వి, 'తిన్నాను. మీరు నాభోజనం గురించి పడుతున్న ఆదుర్దా, ఆఖరికి మాఅమ్మకూడా పడదు' అన్నాడు.

'డాక్టర్లం మావిధి' అంది నాగమణి. ఆతరువాత మాటలు రానట్లు మూగవాళ్ళలా యిద్దరూ కూచుండిపోయారు. అతను ఎన్నో కబుర్లు చెపుతాడు, తమ కుటుంబపరిస్థితి చెబుతాడు, విందామని ఆదుర్దాగా వచ్చింది. అతనికి యీ డాక్టరుస్టూడెంట్‌తో ఏవో మాట్లాడాలని తన గొడవ చెప్పుకోవాలని వుంది. ఎలా చెప్పాలి – ఎక్కడినుంచి మొదలుపెట్టాలి? మాటలకి తడుముకుంటున్నట్లు-యిటూఅటూ చూస్తున్నాడు.

'నేను వెళ్తాను. ఆలశ్యం అయిపోతున్నది. ఇంటిదగ్గర నాన్న ఆదుర్దా పడుతూంటారు' అంది నాగమణి బెంచీమీంచి లేవకుండానే.

'అప్పుడేనా? యిప్పుడేగదా వచ్చింది' అన్నాడు ఆతను.

'మరీ పొద్దుపోతే నాన్న ఖంగారుపడతారు' అంది.

'మీకు బ్రదర్స్ సిస్టర్స్ ఎంతమంది?' అడిగాడు అతను.

'ఎవరూలేరు – నేను ఒక్కదాన్నే.'

'మీరు చాలా లక్కీ' అన్నాడు అతను.

'నేను అలా అనుకోటంలేదు. చాలా 'అన్‌లక్కీ' అనుకుంటున్నాను. ఇంట్లో మాట్లాడేందుకు కంపెనీ వుండదు. అక్కచెల్లెళ్ళూ - అన్నదమ్ములూ వుంటే దెబ్బలాడుకోవచ్చు. మళ్ళీ కలుసుకోవచ్చు - సరదాగా వుండచ్చు' అంది నాగమణి.

'మాయింట్లో సరదాకంటే దెబ్బలాటలే ఎక్కువ. అందులోనూ రెండోకొడుకై పుట్టకూడదు.'

'అదేమిటి – అల్లా అంటున్నారు?'

'భారతంలో కథలాగా, ఇటు నాన్నకీ అక్కర్లేదు – అటు అమ్మకీ అక్కర్లేదు. అందరూ కలిసి మధ్యవాడినెత్తిన బాధ్యత రుద్దుతారు' అన్నాడతను.

'మీ అమ్మగారికి మీరంటే చాలా ప్రేమే.'

'మాఅమ్మకి చిన్నవాడు, అంటే మాతమ్ముడంటే ముద్దు. నాన్నకి తెలియకుండా వాడికి డబ్బు లిస్తుంది. మాక్కూలు లాక తప్పినా, ఒక్కో క్లాసు రెండేసి ఏళ్ళు చదివినా వూరుకుంటుంది. మీరు ఒక్కఅమ్మాయి కాబట్టి మీవాళ్ళు డాక్టరు చెప్పిస్తున్నారు. నేను ఎమ్మేలో చేరటానికి ఎంత గొడవ చెయ్యాల్సివచ్చిందో తెలుసా....?'

'నాకు అటువంటి సమస్యలు లేవు. అమ్మ చదువువొద్దు, పెళ్ళి చెయ్యాలని పట్టుబట్టినా, నాన్న వొప్పుకోలేదు. మెడికల్ కాలేజీలో సీటు రావటమేగొప్ప, చదివించి తీరుతాను అని పట్టుబట్టి నన్ను జేరిపించారు - మొదట్లో చాలాభయం వేసింది.'

'ఇప్పుడులేదా ?'

'అలవాటయిపోయింది. జబ్బులూ, పేషంట్లూ....'

'నాలాంటివాళ్ళుకూడానా ?' అడిగాడు.

నాగమణి సిగ్గుపడింది. తడబడింది. ఎలా చెప్పాలి ? తను పేషంట్లతో యిలా ఎప్పుడూ మాట్లాడలేదని ఎట్లా చెప్పాలి ? 'రాత్రికికూడా కలిసే భోజనం వచ్చిందా ?' మాటమార్చటానికి అడిగింది.

'ఆ' అన్నాడు అతను.

'ఏంవేసుకు తిన్నారు ?' అడిగింది.

'చక్రపొంగలి-పెరుగూ అన్నం.'

'చక్కెరపొంగలా ? మీరు పేషంటుగదా....'

'డాక్టరుగారు అన్నీ తినమన్నారు. అదీకాక మాకు మూడొందల అరవైరోజులు చక్కెరపొంగలీ, దద్ధోజనం అలవాటే' అన్నాడతను.

'రోజూ మీయింట్లో అదే వొండుతారా ?'

'మేము వండుకోం. గుళ్ళోనించి తెచ్చుకుంటాం. మానాన్న పెరుమాళ్ కోవెల్లో అర్చకుడు' అన్నాడతను.

'మీరు గుళ్ళోకి వెళ్తూంటారా ?'

'ఎప్పుడైనా వుత్సవాలూ అదీ అయితే వెళ్తాను. పరీక్ష పాసయిన ప్రతిసారీ నాన్నా, నేను గుళ్ళోకి వెళ్ళి అర్చన చేయిస్తూంటాం.'

'ఆ అర్చన ఎవరు చేస్తారు ?'

'పూజారిగారు'

'మానాన్న చేసేపనికూడా అదే. పెరుమాళ్ సన్నిధిలో - పూజా, దీపారాధన యిత్యాదివి చేసేవారు చాలామంది వుంటారు. అందులో మా నాన్నకి ఆరోవంతు. నెలకి ఇంచుమించు వారంరోజులపాటు పూజాదికాలు చేస్తూంటాం.'

'మీరుకూడానా ?'

'మొన్న కాలేజీలు తెరిచేదాకా నేనూ చేశాను. మా నాన్నతో ఏడాది పాటు దెబ్బలాడి - ఎమ్. ఎ. లో జేరాను. నా దురదృష్టం - కాలువిరిగి యిల్లా ఆసుపత్రిలో పడ్డాను.' అన్నాడతను కసిగా.

అతని కంఠంలో అంతదాకా సౌమ్యత, కొంచెం భయం, మొహమాటం - యివే వినిపించాయి నాగమణికి. కాని, యివ్వాళ ఈ ఆఖరున అన్నమాటల్లో కోపం, తండ్రిమీద కసి ప్రతిధ్వనించాయి.

'మీ నాన్నగార్కి పై చదువులు యిష్టంలేదా ?'

'ఆయనకి - ఇంగ్లీషుచదువులంటే గిట్టదు. పౌరోహిత్యం చేసుకుంటే - కావలసినంత సంపాయించవచ్చు - ఇంకా కాలేజీచదువు దేనికి?- అని మా అన్నయ్యాని సంస్కృత పాఠశాలలో జేర్పించారు. వాడికి పౌరోహిత్యం తప్ప వేరుగతి లేదు. అందుకని - మా నాన్న వృత్తిలో వాటా - అడిగాడు.'

'ఇచ్చారా ?'

'అందుకేగదా కోర్టుకెళ్ళింది.'

నాగమణికి బుర్ర గిర్రున తిరుగుతోంది. ఏదో తనకి తెలియని కొత్త ప్రపంచంలోకి చొచ్చుకుపోతున్నట్లు. చుట్టూ బాగా చీకట్లు అలుముకున్నాయి. విజిటర్స్ అందరూ వెళ్ళిపోయారు. నాగమణి టైము చూసుకుంది. ఏడుంబావు. నేనింక లేస్తాను-ఇప్పటికే ఆలశ్యం అయి పోయింది' అని లేచింది.

'రేపు రారా?' అడిగాడు అతను, ఆ అడగటంలో – బ్రతిమాలు తున్నట్లు – వస్తారుగదా అన్నంత కొండంత ఆశతో వున్నట్లు ధ్వని.

'వస్తాను. పదకొండు దాటితేగాని వీలవదు. రేపుపొద్దుట వార్డ్ బాయ్ కాఫీ తెచ్చిస్తాడు – తాగండి.'

'మీకెందుకా శ్రమ ? వద్దండి.'

'అయితే వీళ్ళిచ్చేపాలు తాగండి'

'పాలు సయించవు.'

'కోకోడబ్బా పంపిస్తాను. అది కలుపుకు తాగండి. మార్పుగా వుంటుంది' అంది.

అతను తలవూపాడు ... నాగమణి పక్కనేవున్న మెడికల్ స్టోర్ కెళ్ళి, చిన్న కోకోడబ్బా కొని, వార్డుబాయ్ చేతికిచ్చి ఆరోనెంబర్ బెడ్ లోని పేషంటుకి అందచెయ్యమంది. మరునాటి వుదయం పాలలో కోకో కలుపుకు తాగిందీ, లేనిదీ చూసి తనకి చెప్పమంది. వాడి చేతులో రూపాయి పెట్టేప్పటికి – వార్డ్ బాయ్ అతి శ్రద్ధగా తలవూపాడు – చెప్పినవన్నీ తప్పక చేస్తాను అన్నట్లుగా.

బస్ దొరకటం, ఆలశ్యం అయి ; ఇంటికి చేరుకునేప్పటికి – ఎనిమిది ! బస్ స్టాప్ లో తండ్రి ఆదుర్దాగా ఎదురుచూస్తున్నాడు. నాగమణికి మొదటిసారి తండ్రిమీద చికాకువేసింది. అది పైకి కనపడకుండా దాచుకుని 'ఫ్రెండుని హాస్పటల్ లో జేర్చారు. ఎవరూలేరు – దగ్గిర కూర్చున్నాను' అంది తన ఆలశ్యానికి సంజాయిషీ యిచ్చుకుంటూ.

మరునాడు కాలేజీకి బయలుదేరుతూ - నాగమణి బాగ్‌లో డబ్బులు లెక్కపెట్టుకుంది. ఏడున్నర వుంది. రెండు మూడురోజులదాకా చాలు. కోకో కానిచ్చానుకాబట్టి - రోజూ, కాఫీ తెప్పించి యివ్వక్కర్లేదు. తండ్రి మామూలుగా రూపాయిపెడ్తూ 'ఇంకా ఏమన్నా యివ్వనామ్మా?' అడిగాడు.

'వద్దు నాన్న - నిన్న యిచ్చినవి అల్లానే వున్నాయి' అంది మళ్ళీ అబద్ధం ఆడుతూ. బస్‌పాస్ వుపయోగించటంచేత రోజూ నాన్న యిచ్చే రూపాయి ఆదా. అంచేత తండ్రియిచ్చిన పదీ ఖర్చు అవలేదు అని సర్ది చెప్పబోయింది. లంచ్‌బాక్సు తీసుకుని గబగబా అడుగులువేస్తూ బస్‌స్టాప్ చేరుకుంది. అతనిదగ్గర కెళ్ళాలి. కూచుని కబుర్లుచెప్పాలి. క్రితంరాత్రి చదువుకోవాలని పుస్తకం తెరిస్తే - ఒక్కపేజీకూడా చదవలేకపోయింది - ఎంతకీ ఆరోనెంబర్‌పేషంటు ముఖం కనిపించిందితప్ప, పుస్తకంలోని పంక్తులు తన కళ్ళకి కనపడలేదు. అతను చెప్పిన మాటలు మళ్ళీమళ్ళీ జ్ఞాపకంవస్తున్నాయి. జామపండులావున్న ఆ ముఖం, చిన్నచిన్నగావున్న ఆ కళ్ళు, నెమ్మదిగా అతిశాంతంగా మాట్లాడే ఆ మాటలు - ఆ కళ్ళవంక చూస్తూ - ఆ మాటలు వింటూ అలా ఉండిపోవాలి అనిపిస్తోంది. తనకి క్లాస్‌మేట్స్‌తో కబుర్లాడాలని అనిపించటంలేదు. ఆఖరికి జుబేదాతోకూడా మాట్లాడాలని అనిపించటంలేదు. క్రితంరోజు జుబేదా - ఓ. పి. డి. లో చాలా ప్రశ్నలు వేసింది. తను వినిపించుకోనట్లు వూరుకుంది. ఈరోజు జుబేదా ఓ. పి. డి. కి రాకుండా వుంటే బాగుండును.

ఓ. పి. డి. లో పని అయేలోపల ఒక పదిసార్లయినా టైము చూసుకుంది నాగమణి. ఎంతకీ పదకొండుకాదు - పేషంట్లగుంపూ తగ్గదు. నలుగురు పెద్దడాక్టర్ల మధ్యనా - తనో పనిపిల్లలాగా యిటూఅటూ తిరుగుతూ, అన్నీ అందిస్తూ వుంది. మధ్య మధ్య కేసుల గురించి 'ఛీఫ్' యిస్తున్న లెక్చర్సు వింటుంది. కాని మనసుమటుకు అక్కడలేదు. ఆరో నెంబరుబెడ్ చుట్టూ పరిభ్రమిస్తూ వుంది.

పదకొండున్నరకి - అతని వార్డుకి వెళ్ళింది. ఈరోజు అతను ఫ్రెష్‌గా వున్నాడు - కొత్తగా వున్నాడు. ఒక్కనిముషంపాటు కొత్తమనిషిని చూస్తున్నట్లుగా నిల్చొండిపోయింది. అతను దిండుకి ఆనుకుని గుమ్మంవైపు చూస్తూ వున్నాడు. బహుశా తనకోసం ఎదురుచూస్తున్నాడు కాబోలు.

'హల్లో, ఎలా వున్నారు?' మంచానికివున్న ఛార్టుని చేతిలోకి తీసుకుంటూ అడిగింది.

'అతను కొంచెం బిడియంగా 'గుడ్ మార్నింగ్' అన్నాడు.

'వంట్లో ఎలా వుంది?'

'నిన్నటికంటే చాలా తేలిగ్గా వుంది. పొద్దున కోకో తీసుకున్నాను' అన్నాడు.

'థాంక్స్'

'మీకు నేను థాంక్స్ చెప్పాలి - నాకు మీరు చెపుతున్నారేమిటి?'

'నామాట విన్నందుకు.'

'ఈమాత్రం నాగురించి కనుక్కున్నవాళ్ళు ఎవరూలేరు' అన్నాడతను.

అతని ముఖం పొడవుగా కనిపిస్తున్నది. ఆరోజు గడ్డం చేయించుకున్నాడు కాబోలు. లేత ఆకుపచ్చరంగులో వుంది గడ్డం. గడ్డం తీసెయ్యటంచేత కళ్ళు యింకా లోతుకుపోయినట్లు, ముక్కు పెద్దదిగా వున్నట్లు అనిపించింది నాగమణికి.

'ఈరోజు వార్డుబాయ్ చాలా హెల్ప్ చేశాడు. అద్దం పట్టుకున్నాడు షేవ్ చేసుకుంటుంటే' సంజాయిషీ చెపుతున్నాడు తను ఎలా గడ్డం గీసుకోగలిగిందీను.

'మీకు స్ట్రెయిన్‌కాదా?'

'ఊహూ. నిన్ననే డాక్టర్ చెప్పారు. షేవ్‌చేసుకోవచ్చునని. నా ఫ్రెండుని షేవింగ్‌సెట్ తెచ్చిపెట్టమని అడిగాను.'

'మీకు ఫ్రెండ్సు వున్నారా?' ఆశ్చర్యంగా అడిగింది.

'ఏం – అలా అడుగుతున్నారు?'

'మీబెడ్ దగ్గర ఎవ్వరినీ చూడలేదు.'

'ఒకళ్ళిద్దరు వున్నారు. సాయంత్రం కాలేజీనుంచి వస్తూ వుంటారు. వాళ్ళని పదిసార్లు రమ్మని శ్రమపెట్టటం యిష్టంలేదు' అన్నాడు.

ప్లాస్టర్ వేసిన కాలుని దిండుమీద పెట్టుకుని వుంటం గమనించి 'కాలు కదపనిచ్చారా?' అడిగింది.

'ఇందాక డాక్టర్ యిక్కడున్నపుడు నర్సుచేత పొజిషన్ మార్పించారు. ఇల్లాయితే కూచుని చదువుకోటానికి వీలుగా వుంటుందని...'

'ఏంచదువుతారు – పత్రికలా – పుస్తకాలా?'

'క్లాసుపుస్తకాలు. నిన్న మధ్యాహ్నం అవికూడా తెప్పించుకున్నాను' దిండుకిందనుంచి రెండు పుస్తకాలు తీసి చూపించాడు.

'ఫిలాసఫీ తీసుకున్నారా?' అడిగింది. అతను అవునన్నట్లు తల వూపాడు.

ఇక్కడికి రావాలని అతనితో ఏదో మాట్లాడాలని మహా ఆత్రతగా వుంటుంది. వచ్చేదాకా మనసు నిలవదు. తీరా వచ్చాక ఏంమాట్లాడాలి? ఎలా మాట్లాడాలి? అన్న సమస్య వస్తూవుంటుంది నాగమణికి. పుస్తకాలు చేతులో పుచ్చుకునే నాగమణి అడిగింది – 'ఆరేళ్ళు ఎందుకు డిస్కంటిన్యూ చేశారు?' అని.

'మీకు మైలాపూర్ ఏరియాతో బాగా పరిచయం వుందా?'

'అంత తెలియదుగాని అప్పుడప్పుడు వెళ్తూనే వుంటాను.'

'కపాలేశ్వర కోవెల తెలుసా? అక్కడ టాంకూ, గుడికి ఎదురుగావున్న కొలనూ అదీ చూశారా?'

'చూశాను, సాయంత్రంపూట చాలామంది బ్రాహ్మణులు ఆకొలను గట్టుమీద కూచుని వుంటారు.'

'అయితే, మీరు నన్నుకూడా చూసేవుంటారు.'

'మిమ్మల్నా? పంగనామాలూ, పుస్తా పెట్టుకున్న ఆ బ్రాహ్మల గుంపులో మిమ్మల్నా?' నాగమణి నవ్వుతూ వుంది .... ఆపుకోలేక నవ్వుతోంది. అతను జుట్టుముడి వేసుకున్న దృశ్యం తలుచుకుని.

'ఆరేళ్ళపాటు నేనూ అలా కొలనుగట్టుమీద కూచున్నాను.'

'మీరా! నమ్మలేకుండా వున్నాను.'

'మీరు నమ్మినా నమ్మకపోయినా, నేను ఆరేళ్ళపాటు ఆ వుద్యోగమే చేశాను.'

'ఏవుద్యోగం?'

'గుళ్లో అర్చకుడిపని.'

'ఎక్కడ? కపాలీ కోవెలలోనా?'

'ఉహు-ఆ చుట్టుపక్కల చాలా గుడులు వున్నాయి. మాది వైష్ణవుల ఆలయం.'

'బి. ఎ. చదివి, గుళ్లో పూజారిగా వున్నారా?'

'ఉన్నాను, లేకపోతే మానాన్న అన్నంపెట్టడు.'

'పిలకపెట్టుకుని పంగనామాలు పెట్టుకుని పూజార్లందరిలాగా - గర్భగుడిలో నుల్చునేవారా?'

'అవును' అన్నట్లు తలవూపాడు.

'బి. ఎ. చదివిన మీకు అవమానంగా వుండేదికాదా?'

'అప్పుడప్పుడు నాతో చదివిన స్టూడెంట్సు కనిపించినపుడు కాస్త భయంగా వుండేది - గుర్తిస్తారేమోనని! చాలామటుకు గుర్తుపట్టేవాళ్ళే కాదు.'

'గుళ్లో పూజారికి బాగా డబ్బులు దొరుకుతాయట?'

'అవన్నీ వుత్తమాటలు. ప్రతిదానికి టికట్లు వుంటాయి. విగ్రహాలకి హారతియిచ్చి - అది భక్తులదగ్గరకు తీసుకొచ్చినపుడు కొందరు చిల్లర వేస్తారు - కొందరు రూపాయలూ వేస్తారు.'

'అది అర్చకుడికే వెళుతుందిగదూ?'

'వెడుతుంది - పుష్టివాడు సీసారేకు డబ్బాలోని చిల్లర లెక్క పెట్టుకున్నట్లు, మానాన్న ఆడబ్బులు ముందు దొడ్లో దోపుకుని ఆ తరువాత మళ్ళీ సేవ మొదలుపెట్టు అంటాడు' అన్నాడతను కసిగా.

'మీకు యిష్టంలేదనుకుంటా యీ వృత్తి.'

'ఎవరి కుంటుంది? పదిపైసలూ అయిదుపైసలూ బిచ్చగాడిలా ఏరుకోమంటే? రోడ్డుమీద బట్టపరుచుకున్న బిచ్చగాడికీ - మాకూ తేడా లేదనిపిస్తుంది.'

'చదువుకున్నారు కాబట్టి అలా అనిపించేదేమో'

'ఏమో, పిలక పెట్టుకోమన్నా పెట్టుకున్నాను. తెల్లవారగట్ల నాలు గింటికి నూతిలోంచి నీళ్ళుతోడుకొని గజగజ వణుకుతూ స్నానం చెయ్య మన్నా చేశాను. రెండుపూట్లా గర్భగుడిలో ఆ విగ్రహాలకి పూజలు చెయ్యమన్నా చేశాను .... కాని కాని ... '

'మరి దేనికి మీకోపం?'

'హారతి పళ్ళెంలో భక్తులు డబ్బులు వేసేదాకా ఎదురుచూడటం నావల్ల కాదు. అపని నేను చెయ్యలేను. నేను అర్చన చేసినరోజుల్లో డబ్బులు బాగా రావని మానాన్నకి కోపం.'

'మీ అన్నయ్యో...'

'వాడికి మానాన్న టెక్నిక్ బాగా తెలుసు. ఎవరు డబ్బులు బాగా యిస్తారో, అర్చన త్వరగా చేయించుకోవాలని ఎవరు లంచాలు పెడతారో అవి ఎలా రాబట్టాలో...'

'లంచాలా గుళ్ళోకూడానా?'

'సహస్రనామం, అష్టోత్రం, కుంకుమపూజ అంటూ కొందరు దేవస్థానం టికట్టుతోపాటు, అయిదూ, పదీ - కొబ్బరికాయా, కర్పూరం వీటితో కలిపి పెడ్తూంటారు, ఈడబ్బు తీసుకుని అర్చకుడు త్వరగా పూజాదికాలు ముగించాలని.'

'మీరు వద్దు అనేవారా ? పుచ్చుకునేవారు కాదా ?'

'పుచ్చుకునేవాడిని. మానాన్న కొబ్బరికాయతోపాటు ఎంత లంచం పడిందో ముందు చూసి, అది బొడ్లో దోపుకుని తరువాత భగవంతుని పూజ మొదలుపెట్టాడు. నాకు అలా చెయ్యటం అవమానంగా వుండేది. అంతా అయాక తీస్తాను అంటే వొప్పుకోడు.'

'ఏం ?'

'మాకెంత వచ్చిందో యింకోపూజారికి తెలియకూడదు. భగవంతుని సన్నిధిలో ఎవరి సంపాదన వాళ్ళదే అంటాడు...'

'మీనాన్నగారిమీద మీకు చాలా కోపం అనుకుంటా.'

'కోపం అనికాదు. అప్పుడపుడు అయ్యోపాపం అని జాలి కలుగుతూ వుంటుంది. మాకు వచ్చేడబ్బు చాలదు...'

'మరి ?'

'గవర్నమెంటు, అన్ని పూజలకి టికట్లుపెట్టి అది దేవస్థానానికి అంటూ వసూలు చేస్తారు. హుండీలుకూడా పెట్టి ఎక్కడి కక్కడ డబ్బు పట్టుకుంటున్నారు. మనం బతకటం ఎట్లా ? అంటాడు నాన్న. అదీ కొంత న్యాయంగానే అనిపిస్తుంది. మాఅన్నయ్య అక్షరాలా నాన్నకి సరిపోయిన వాడు.'

'ఆయనా-మీనాన్న పేచీలు పడ్డారన్నారు ?'

'పెద్దకొడుకుని - సంస్కృతం చదువుకున్నాను. వైదిక నియమ నిష్టల్లో మానాన్నతో సరితూగగలవాడిని నాకు అర్చకత్వంలో సగపాలు కావాలని పేచీపడ్డాడు.'

'వచ్చిందా ?'

'అయిదేళ్ళు పోరాడిన వెనుక, అన్నయ్యకీ సగభాగం యిచ్చారు. మాకు దేవస్థానం యిచ్చిన యింట్లో సగంవాటా, అయివేజులో, అర్చక వృత్తిలో అంతా సగం యివ్వాలన్నారు.'

'అటువంటప్పుడు - మీ ఆదాయం తగ్గివుండాలే ?'

'తగ్గింది. అందుకనే నన్ను పౌరోహిత్యానికికూడా వెళ్ళమని నాన్న పోరు మొదలుపెట్టాడు '

'మీకిష్టంలేదా ?'

'నాకేకాదు, ఎవరికీ వుండదు. ఇప్పాళ పూజలూ, వ్రతాలూ చేయించటానికి వెళ్ళమంటాడు - రెండురోజులు పోయాక తిథులకీ, అపరకర్మలకీ వెళ్ళమంటాడు.'

'అవ్వేమిటి ?'

'చచ్చిపోయాక చేసే కర్మలు...'

'అంటే శవాలు మోస్తారు ఆపనా ?'

'ఉహూ, ఆరోజు పనికి మాలాటివాళ్ళం వెళ్ళం. దానికి ప్రత్యేకం మాజాతిలోనే కొందరు వుంటారు....'

'మరి'

'పదిరోజులు అయాక - మూడురోజులపాటుచేసే కర్మకాండని మేమూ జరిపించవచ్చు...'

'మీనాన్న వెడతారా ?'

'తను వెళ్ళడు - వెళితే, గుడిలో అర్చనకు పనికిరాడని ! నన్ను వెళ్ళు - అప్పుడిచ్చే దానాలు పుచ్చుకో తప్పులేదు-అంటాడు....'

'దానాలా ? అవేమిటి ?'

'మీరు ఆడవారు. చదువుకున్నవారు _ మీకు యిలాంటివి తెలియవు.'

'చెప్పండి. చెపితే తెలుసుకుంటాగా ?'

'ఇందువల్ల మీకు ఏంలాభం ? ఇదేం సైన్సా ? హిస్టరీయా ?'

'కాకపోవచ్చు. లోకం గురించి నాకేం తెలియదు _ పుత్తి అమాయకురాలిని, అంటాడు మానాన్న. నాకు కొత్తవిషయాల గురించి తెలుసుకోవాలని వుంది' అంది నాగమణి.

అతను ఆమెవంక తమాషాగా చూస్తున్నాడు. రెప్పపెయ్యకుండా చూస్తున్నాడు.

'ఎందుకలా చూస్తున్నారు ?' అడిగింది నాగమణి యిబ్బందిగా.

'మీవంక అలా చూస్తూ కూచోవాలని అనిపిస్తోంది.'

నాగమణి గుండెలు గబగబ కొట్టుకుంటున్నాయి. అతను అలా మాట్లాడుతూ వుంటే - యింకా యింకా అలాంటి కబుర్లు చెపుతూ వుంటే వినాలని వుంది.

'దానం అంటే ఏమిటి ?'

'మీకు తెలుగురాదా ? దానం అంటే ఎవరికైనా ఒక వస్తువు వూరికే యివ్వటం' అన్నాడతను.

'అందుకు మీరంత అవమానం ఎందుకు పడాలి ? ఎందుకంత న్యూనతగా భావిస్తున్నారు'

'నేను చెప్పేది వుత్తదానం కాదు. స్నేహభావంగా, యిష్టపడి యిచ్చినపుడు, మీరు కాఫీ తెప్పించి యిచ్చారు - అది దానంకాదు, ఫ్రెండ్లీగా, యిష్టంచేత యిచ్చారు.'

నాగమణి అవునూ - కాదూ అనలేకుండా వుంది. అతనిమీద తనకి యిష్టమా ? ఇది ఎటువంటి యిష్టం ?

'మీరు చెప్పేవి అలాంటివికాదా ?'

'కాదు. ఎవరో చనిపోతే వాళ్ళ జ్ఞాపకార్థం గోదానం, భూదానం, సువర్ణదానం యిలాంటివి యిస్తూంటారు. అవి పుచ్చుకోటం అందరు చెయ్యరు.'

'అంటే ? మీకులంవంటివాళ్ళ?'

'మా బ్రాహ్మల్లోకూడా యిలాంటివి అందరూ పుచ్చుకోరు. డబ్బు కక్కుర్తికి కొందరు చాటుమాటున దానం పడ్తూంటారు. మానాన్న తను తీసుకోడుగాని - నన్ను పుచ్చుకోవచ్చు, ఫరవాలేదు - అంటాడు. ఇలాంటి దానాలూ, దక్షిణలూ అంటే నాకు అసహ్యం'

'దక్షిణ అంటే? మాఅమ్మ శాస్త్రిగారికి బియ్యం, కూరలూ, డబ్బులూ యిచ్చేది....అదా?' అడిగింది నాగమణి ఈ విషయం తనకి తెలుసు అన్నట్లు.

అతను 'అవును' అన్నట్లు తలతిప్పి, దృష్టి మరోవైపుకి తిప్పి, వరండాలోకి చూస్తున్నారు.

అతనికి యీ సంభాషణ యిష్టం లేదన్నది నాగమణికి అర్థం అయింది. 'మీకు కోపంవచ్చిందా?' అడిగింది బ్రతిమాలుతున్నట్లుగా.

'వాస్తే - మీకేం నష్టం?' అన్నాడు అతను తీవ్రంగా.

దీనికి సూటిగా జవాబు చెప్పలేకపోయింది. ఇక మాట్లాడేవిషయాలు లేవు అన్నట్లు - బల్లమీంచి లేవబోయింది.

అతను గబుక్కున దృష్టి ఆమెవైపుకి మరల్చి, 'అయామ్ సారీ, వెళ్ళకండి. కాసేపు కూచోండి' అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

'మీకేం మాట్లాడినా కోపంవస్తోంది. తెలియని విషయాలు అడిగితే చిరాకుపడుతున్నారు. తెలిసిన విషయం పైకి అంటే కోపం తెచ్చుకుంటున్నారు. మీతో ఎలా మాట్లాడాలో అర్థం కావటంలేదు.'

'నాకూ అలాగే వుంది. మీరు యిక్కడ కూచుని కబుర్లు చెపితే సరదాగా వుంటుంది. కాని నాజీవితం గురించి గుచ్చిగుచ్చి ఎందుకు అడుగుతున్నారు? అట్లా అడిగి తెలుసుకున్నందువల్ల మీకేం లాభం? ఇక ఆవిషయాలు వదిలేసి కాలేజీ కబుర్లు చెప్పుకుందాం - మీకు ఫ్రెండ్సు ఎవరూలేరా?' అడిగాడు అతను.

'క్లోజ్‌గా వుండే ఫ్రెండ్సు లేరు'

'మీకు స్నేహం చేసుకోటంరాదా?' అడిగాడు మళ్ళీ...

'ఏమో - జుబేదా అని నాతోపాటు చదివే 'మెడికో' వుంది. తనుమటుకే కాస్త చనువుగా వుంటుంది. మిగతావాళ్ళు....'

'స్నేహంగా వుండరా?'

'ఉండరనికాదు. వాళ్ళు బాగా రిచ్ ఫామ్లీస్‌నుంచి వచ్చారు. కారుల్లో వస్తూంటారు కాలేజీకి.'

'మీరు బస్‌లో వస్తూంటారా ?'

అవునన్నట్లు తలవూపింది.

'మీకు సీటు ఎల్లా వచ్చింది ? డొనేషన్ కట్టారా ?'

'ఉహూ, కాలేజీలో డొనేషన్సు తీసుకోరు. మెరిట్ వల్ల....'

'మీరు మెరిట్‌వల్ల వచ్చి వుండచ్చు. మాలాంటివాళ్ళకి మెరిట్ వున్నా, ప్రయోజనంలేదు. గట్టి రికమెండేషన్ అన్నా వుండాలి, లేకపోతే డొనేషన్స్ యివ్వగలగాలి....'

'ఈ స్టేట్‌లో అవి లేవుట. మాకాలేజీలో అల్లాంటివిలేవు.'

'పైకి చెప్పుకోకపోవచ్చు. డబ్బూ, రికమెండేషన్ – యీ రెండే యీరోజుల్లో పనిచేసేది. నేను మూడేళ్ళుగా అందరికాళ్ళూ పట్టుకున్నాను. ఈఏటికి సీటు వచ్చింది.'

'ఎల్లా వచ్చింది ? డబ్బు కట్టారా ?'

'మానాన్న రికమెండేషన్ తెచ్చారు.'

'మీనాన్నగారా ? ఆయనకి వుద్యోగం లేదన్నారు.'

'ఆయన చేసేపనిమీద కొంచరికి గౌరవం గురీ వుంటుంది. అల్లాంటి చోదస్తులు, దైవభక్తికలవారూ వుండకపోతే మాలాంటివాళ్ళం శుభ్రంగా చెంబు తోముకుని యిళ్ళిళ్ళకూ వెళ్ళాల్సివచ్చేది....'

'చెంబు తోముకోటందేనికి ?'

'ఉపాదానం ఎత్తుకోటానికి'

'అదేమిటి ?'

'అదో తెలుగులేండి – మీకు అర్థం కాదు. మీరు సినిమాలు చూస్తూంటా ? హిందీగాని, ఇంగ్లీషుగాని ?'

'నేను సినిమాల కెళ్ళను.'

'ఏం ?'

'జతలేక !'

అతను వులిక్కిపడినట్లు చూశాడు. ఆశ్చర్యంగానూ, అప నమ్మకంగానూ చూశాడు. 'నిజంగా మీకు ఫ్రెండ్సులేరా ?' అడిగాడు.

'మా యిళ్ళదగ్గర ఆడపిల్లలు నాతో కలవరు. నేనేదో పెద్దడాక్టరునని దూరంగా వుంటారు. నాన్నకి సినిమాలంటే యిష్టంలేదు. నాకు అమ్మలేదు. ఎవరు తోడొస్తారు ?'

'అయామ్ సారీ. మీ అమ్మగారు పోయారని – తెలియక అన్నాను. ఎన్నాళ్ళయింది ?'

'మూడేళ్ళు. నేను మెడిసిన్‌లో చేరాకనే పోయారు.'

'ఏంజబ్బు చేసింది ?'

'హార్ట్ఎటాక్ – నిద్రట్లో పోయింది. మా అమ్మ పోయినప్పుడు నాకు చాలా భయంవేసింది.'

''మీకు 'డెడ్‌బాడీ' చూస్తే భయమా ? మరి బాడీస్ కొయ్యటం అదీ ఎలా చేస్తారు ?''

''డెడ్‌బాడీ' అంటే భయం అనికాదు. మాఅమ్మే అన్నిపనులు చేసి పెట్టేది. ఆఖరికి నాకు జడ అల్లుకోటంకూడా సరిగా తెలియదు. ఏమీరాని నన్ను అలా వంటరిగా వదిలి అమ్మ వెళ్ళిపోతే....'' ఇక మాట్లాడలేనట్లు ఆగిపోయింది. గొంతులో ఏదో ఉండలు చుట్టుకున్న బాధ. నీటితో నిండుతున్న కళ్ళు.

'నాకీ విషయాలన్నీ తెలియక మిమ్మల్ని అనవసరంగా బాధించాను. ఇన్నిరోజులు నాగురించి నాకు జాలిగా వుండేది. ఈరోజు మిమ్మల్ని చూస్తుంటే ఎలాగో వుంది. నాకంటే వంటరివారు మీరు....' కొంచెంసేపు నిశ్శబ్దం. 'మీనాన్నగారు మానాన్నకిమల్లే కస్సుబుస్సుమంటారా ?'

'ఉహూ – నన్ను అసలెప్పుడూ కోప్పడడు. ఇంకా మాఅమ్మనాన్న చివాట్లువేసేదిగాని – నాన్న నన్ను ఒక్కమాట అనలేదు ఇంతవరకు. నేను అడిగింది 'లేదు' అనలేను.'

'అదృష్టవంతులు. మాయింట్లో నేను అన్నది 'కాదు' అనటమే అలవాటు. చదువుకునేందుకుకూడా స్వతంత్రంలేని కొంప మాది'

'కొంపా ? అదేమిటి ?'

'మీరు తెలుగువాళ్ళేనా ?'

'తెలుగువాళ్ళమే. మావాళ్ళు చాలాఏళ్ళక్రితం మద్రాసొచ్చేశారుట – చిత్తూరునుంచి....మాతెలుగులో తమిళంపాలు జాస్తి.'

'మాశారా....మేము స్వతస్సిద్ధంగా తమిళులం – వైష్ణవులం. మా అమ్మ తొమ్మిదిగజాల చీరెకట్టుకుంటుంది. ధనుర్మాసం నెల్లాళ్ళూ తిరుప్పావై పాడుతుంది. వైష్ణవసంప్రదాయాన్ని పాటిస్తుంది. అయితే మాయింట్లో తెలుగు మాట్లాడుకుంటాం, తెలుగు రాస్తాం, చదువుతాం. అందుకనే నాతెలుగుమాటలు మీకు అర్థం కావటంలేదు.'

'ఏమో....' అంటూ టైము చూసుకుంది. పన్నెండుముప్పావు. ఇంకా భోజనం రాలేదే....ఒంటిగంట కావస్తున్నది. ఆకలెయ్యటంలేదా ?' అడిగింది ఆదుర్దాగా.

'ఒద్దు, నాకు ఆకలిగా లేదండి. మీకు భోజనం టైము అయింది – వెళ్ళండి, మానాన్న దార్లో వుంటారు – ఈపాటికి ఏబస్‌లోనో వుండి వుంటారు. మీకు ఆలశ్యం అయిపోతోంది. వెళ్ళండి' అన్నాడతను.

నాగమణికి ఒకవైపు ఆకలిగా వుంది. ఆ కృష్ణమాచార్యులుగారొచ్చి మళ్ళీ పుత్తూరు అంటాడేమో – ఆయన కళ్ళపడకుండా వెళ్ళిపోవాలని వుంది. పాపం – యీతను అన్నం తినలేదని జాలిగానూ వుంది. స్టూలు మీంచి లేచింది – అయిష్టంగానే.

'రేపు వస్తారా ?' అడిగాడు అతను.

'మీకు వంట్లో బాగానేవుందిగా....నా హెల్ప్ ఏమీ అక్కరలేదుగా' ఆగిపోయింది.

'మీరు శ్రమ అనుకోకపోతే రండి...'

'చూస్తాను' అంది బింకంగా.

'ప్లీజ్. మీరు ఎప్పుడొస్తారా అని ఎదురుచూస్తూ వుంటాను. రేపు మళ్ళీ మీరు కనిపించేదాకా సెకండ్స్ - మినిట్స్ లెక్కపెట్టుకుంటూ వుంటాను...'

'వస్తాలెండి' అంది అతనివంక చూస్తూ: అతను కృతజ్ఞతతో 'థాంక్యూ' అంటూ ఆమె చేతిని పట్టుకున్నాడు. మరుక్షణంలోనే తన తొందరపాటుకు సిగ్గుపడుతూ, 'సారీ....' అన్నాడు కళ్ళువాల్చుకుని.

నాగమణికి నవ్వొచ్చింది - మనసులో సంతోషంగా వుంది. ఏదో వుద్వేగంగాకూడా వుంది. గోరువెచ్చగా, దృఢంగా వున్న అతని అరి చెయ్యిని మరోసారి ముట్టుకోవాలని వుంది, మెడికల్ స్టూడెంటుగా ఎంత మంది మగవాళ్ళ చేతులనో తాకింది - పల్స్ చూసింది - గుండెలమీద చేతులు వేసి చూసింది, పక్కలు నొక్కింది - కాని ఏనాడు ఎదుటివ్యక్తి రోగిగాతప్ప - ఒక మగవాడు అన్నధ్యాస తనలోలేదు. అసలు అటువంటి ఆలోచనలే రాలేదు తనకి. కాని ఈనాడు ఈ సుందరరాజన్ స్పర్శ తనకి కొత్తగా, మళ్ళీ మళ్ళీ ఆ అరచేతిని పట్టుకోవాలి అనిపించేట్లుగా వుంది. అతను వదిలిన చేతిని, వెనకగా పెట్టుకుని 'వస్తాను' అంటూ వార్డులోంచి బయటపడింది.

ఆ తరువాత రెండురోజులదాకా - నాగమణికి సుందర్ రాజన్‌ని చూడటానికి వీలవలేదు. రోటరీవాళ్ళు కండక్ట్ చేస్తున్న ఫామిలీప్లానింగ్ కాంప్‌కి హెల్పర్‌గా ఆమెకి డ్యూటీ వేశారు. మొదటిరోజున కాంప్ సైట్‌కి ఏర్పాట్లు చూడటానికి వెళ్ళాల్సివచ్చింది - గైనకాలజిస్ట్‌తోపాటు రెండో

రోజు పొద్దుట ఎనిమిదినుంచి రాత్రి పదింటిదాకా - వరసలు దీరి నుల్చున్న ఆడవాళ్ళూ, మగాళ్ళూ. వాళ్ళని ప్రశ్నలు అడగటం, పక్కనున్న ఫామిలీప్లానింగ్ వర్కర్‌కి డిటైల్సు చెప్పటం, ఆలోచించేందుకు - ఆఖరికి మంచినీళ్ళు తాగటానికికూడా తీరికలేకపోయింది. మూడోనాడు శలవు తీసుకోమన్నారు. కదలకుండా మెదలకుండా పడుకుంది. మధ్యాహ్నం అన్నం తిని పడుకున్న మనిషి సాయంత్రం అయిదు అవుతేగాని నిద్ర లేవలేదు. తండ్రి నవ్వాడుకూడాను. ఇంత మొద్దునిద్ర ఎలా పట్టిందమ్మా అని. అయితే ఆరాత్రి - చాలాసేపటిదాకా నాగమణికి నిద్రరాలేదు. పది, పదకొండు, పన్నెండు, ఒంటిగంట కొట్టేదాకా పక్కమీద యిటూ అటూ కదులుతూనే వుంది పడక కుదరక ! పగలంతా నిద్రపోవటంచేత నిద్ర రావటంలేదని కాసేపు సరిపెట్టుకుంది. కాని నిద్ర రాకపోవటానికి అసలు కారణం అదికాదు. నాగమణికి పక్కమీద పడుకోగానే సుందర్‌రాజన్ జ్ఞాపకానికి వచ్చాడు. అతను ఎలా వున్నాడో ? వెళ్ళి చూసివస్తే అనిపించింది ఆక్షణంలో. రాత్రివేళ ఎలా వెళుతుంది ? అతన్ని చూడాలని, పక్కన కూచుని కబుర్లు చెప్పాలని, కోపంగా, మధ్య మధ్య ముహ మాటంగా మాట్లాడే అతని కబుర్లు వినాలని, విపరీతమైన ఆరాటంగా వుంది. అతని చేతిస్పర్శ ! అతని చెయ్యి ఆక్షణాన - తన చేతిని పట్టుకున్నట్లే - వెచ్చగా దృఢంగా చేతివేళ్ళు తనవేళ్ళని తాకుతున్నట్లు అనిపించింది. వులిక్కిపడి అరిచేతివంక చూసింది. తను తమ యింట్లో చిన్నమంచంమీద వుంది. పక్కమంచంమీద తండ్రి సన్నగా గురక తీస్తున్నాడు. తను హాస్పటల్లో లేదు, ఇంట్లో వుంది. తనకేగనక రెక్కలుంటే అతనిపక్కన వాలివుండేది. తను ఏగంధర్వకన్యో అయివుంటే అతని మంచంపక్కన నిల్చుని వుండేది - లేకపోతే అతని మంచాన్ని ఎత్తుకొచ్చి, తమ యింట్లో తనమంచంపక్కన వేసుకుని కబుర్లు చెప్పివుండేది. చిన్నప్పుడు ఎప్పుడో చదివింది. నిద్రపోతున్న అనిరుద్ధుని ఉషాకన్యకోసం యిలాగే మంచం

పళంగా తీసుకొచ్చారట చెలికత్తెలు. తనకికూడా అటువంటి మానవాతీత శక్తులుంటే ఎంత బాగుండును ! అలా నడుచుకుంటూ వెళ్ళిపోయి, అతని పక్కన కూచోవాలి - అతని చేతిలో తన చెయ్యివుంచి కబుర్లు చెప్పాలి. ఇది తెలివితక్కువపని – వెర్రిఆలోచన అని ఎంత సరిపెట్టుకున్నా – ఎన్నిసార్లు మనసుని అదుపులో పెట్టుకోవాలని అనుకున్నా ప్రయోజనం లేకపోయింది.

అతను ఏంచేస్తూంటాడు ? నిద్రపోతూ ఉంటాడా ? ఇంటిదగ్గర నుంచి అన్నం వచ్చివుంటుందా ? బెడ్‌పాన్ పెట్టటానికి తోటీవాడు పేచీ పెడుతున్నాడేమో ! దగ్గర ఎవరూ ఉండివుండరా ? ఎలా – ఎలా ? నిద్ర రావటానికి నాగమణి 'శ్రీఆంజనేయం....' అంటూ వందసార్లు - రెండు, మూడు, నాలుగువందలసార్లు – జపించింది ఆంజనేయస్వామి నామాన్ని. అయినా ప్రయోజనం లేకపోయింది. మెడికల్‌బుక్ తెరిచింది. ఒక్క అక్షరం కంటికి ఆనటంలేదు - చదివింది బుర్రలో నిలవటంలేదు – జ్ఞాపకం అసలే ఉంటంలేదు. కుస్తీ పట్టి పట్టి - ఆఖరికి రెండు కొట్టటం విన్నాక నిద్రలోకి జారుకుంది.

తెల్లవారి తండ్రి కుదిపి-కుదిపి మేలుకొలుపు పాడితేగాని మెళకువ రాలేదు. 'లేమ్మా - మణీ - ఏడు దాటిపోయింది లే - తల్లీ' అంటూ తండ్రి రెండుమూడుసార్లు పిలిచాకగాని కళ్ళు తెరిపిన పడలేదు. కళ్ళు ఇసకపోసినట్లు గరగరలాడుతున్నాయి. కాఫీ తాగుతుంటే తండ్రి అడిగాడు– 'కళ్ళు ఎర్రగా ఉన్నాయి – రాత్రి చాలాసేపు చదువుకున్నావా ?' అని.

'లేదు – నాన్నా. నిద్రపట్టలేదు.'

'పగలంతా నిద్రపోయావుగదూ – అందుకని నిద్ర పట్టివుండదు .... గబగబా స్నానం చెయ్యి. ఎనిమిది కావస్తోంది. మళ్ళీ ఖంగారయిపోతుంది' అన్నాడు తండ్రి.

నాగమణి కళ్ళు తడిఅవుతున్నాయి. ఒక్కసారి తల్లి జ్ఞాపకం వచ్చింది. అమ్మకూడా యిల్లాగే - త్వరగా స్నానంచెయ్యి, కాలేజీకి టైము అవుతోంది - అంటూ తొందరపెట్టేది. అయితే తల్లి యింత సౌమ్యంగా, స్నేహంగా చెప్పేదికాదు. కసురుకుంటున్నట్లు - కఠినంగా అంటూండేది. నాన్న ఎప్పుడూ కోప్పడడు, విసుక్కోడు. అమ్మ ప్రేమలో - అధార్టీ వుండేది. నాన్న ప్రేమలో మార్దవం ...

'నాన్నా' అంది కాఫీగ్లాసు పక్కనపెట్టి, గ్లాసులో యింకా సగందాకా కాఫీవుంది.

'ఏంతల్లీ !'

'అయ్ లవ్‌యూ, నాన్నా. మీకు నామీద నామీద....' మాటలకి తడుముకుంటున్న కూతురిని చూసి మొదలియార్ చిరునవ్వు నవ్వుతున్నాడు.

'ఏమిటమ్మా - కొత్తగా మాట్లాడుతున్నావ్ !'

'అదికాదు నాన్నా - అయామ్ వెరీలక్కీ.'

'కాదని ఎవరన్నారు ?'

'చాలామందికి నాకుమల్లే మంచి పేరెంట్సు దొరకరు....'

'పేరెంట్సు దొరకటం ఏవిటమ్మా ? తల్లితండ్రులు బజార్లో దొరికే వస్తువా ?'

'అదికాదు నాన్నా. నీకు మీకు నామీద ఎంతప్రేమో ! అమ్మకంటే కూడా శ్రద్ధగా ప్రేమగా వుంటావు, చదువు చెప్పిస్తున్నావ్ - కాఫీదగ్గర నుంచి అందిస్తావు.'

'అయితే ? ఇందులో పెద్ద గొప్ప ఏముందమ్మా, సహజమైన విషయం. అందరు తల్లి తండ్రులూ పిల్లలని ప్రేమిస్తారు.'

'ఉహూ - అందరూ నీలా ప్రేమించరు. అయామ్ వెరీ లక్కీ. నాన్నా నాకో తమ్ముడో, చెల్లెలో వుంటే, వాళ్ళనీ యిలాగే ప్రేమగా చూసేవాడివా ?'

మొదలియార్ కూతురువంక ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఆయన ముఖంలో చిరునవ్వు. 'నీకు అలాంటి సందేహం ఎందుకొచ్చింది ?'

'తల్లితండ్రులకి రెండోపిల్లవాడంటే ప్రేమవుండదా ?'

'ఎవరు చెప్పారు ?'

'వుంటుందా, వుండదా ?'

'ఎందుకుండదు ? పిల్లలందరూ సమానమే. ఒకరు హెచ్చు, ఒకరు తగ్గు అనివుండదు.'

'మరి భారతంలో ఏదోకథ వుందిటకదూ - రెండోకొడుకుని - రాక్షసుడికి ఆహారంగా పంపుతారుట...'

'ఆకథ ఎందుకొచ్చింది ? దానికీ పిల్లలమీద ప్రేమకీ సంబంధం ఏమిటి ?'

'ఆకథలో రెండోకొడుకుని - యిటు తల్లీతండ్రీ యిద్దరూ ప్రేమించరుట. పెద్దకొడుకు తండ్రికీ, బుల్లికొడుకు తల్లికీ యిష్టం అని - మధ్యవాడిని రాక్షసుడికి ఆహారంగా పంపుతారుట.'

'అవును, అల్లాంటికథ వుంది.'

'మరి తల్లితండ్రులు ముగ్గురినీ సమంగా చూడలేదనేగదా అర్థం.'

'అసలు ఆకథ నీకెవరు చెప్పారు ? నీకు చెల్లెలో తమ్ముడో వుండి వుంటే, వాళ్ళని నిన్ను చూసినట్లు ప్రేమగా చూడమని ఎందుకు అనుకుంటున్నావు ?'

'కొందరి యిళ్ళలో రెండోపిల్లలని ఎక్కువ శ్రద్ధగా చూడరట.'

'మీ ఫామిలీప్లానింగ్ ప్రోపగాండాలో యిది భాగమా ? ప్రభుత్వం యీ స్లోగన్‌కూడా ఆరంభించబోతున్నారా ?'

'అదికాదు, నాన్నా. ఇలాంటివి జరుగుతాయా, లేదా ? రెండో కొడుకుమీద తల్లితండ్రులకి అంత శ్రద్ధ వుండదా ?' ముద్దాయిని ప్రశ్నిస్తున్నట్లు అడుగుతూ వుంది.

మొదలియార్ చిరునవ్వుతో, నెమ్మదిగా చెప్పారు. 'తల్లి తండ్రులకి పిల్లలందరిమీదా ప్రేమ సమానంగా వుంటుందమ్మా - కాకపోతే, కొందరు పిల్లలపట్ల కఠినంగా వుంటారు-కొందరు సౌమ్యంగా వుంటారు. ఇది ప్రేమ లేకకాదు. తమ పిల్లలు చదువుకోవాలనీ, ప్రయోజకులవాలనీ తల్లితండ్రు లందరికీ వుంటుంది.'

'ఎంతమంది పిల్లలయినా వుంటుందా ?'

'ఎందుకుండదు ! ఎటొచ్చీ నీకుమల్లే, ఒక్కపిల్ల అయినపుడు ఆ ప్రేమ ఆ వొక్కపిల్లమీద - మరికాస్త సెంటరవుతుంది. పిల్లలు ఎక్కు వయినపుడు యింత శ్రద్ధ చూపటం వీలవకపోవచ్చుతప్ప - ప్రేమలో హెచ్చు తగ్గు లుండవు.'

'మరి భారతంలో ఆకథమాటో ?' అడిగింది నాగమణి, తండ్రి పేరెంట్సుతరఫున వకాల్తా పుచ్చుకున్నాడు అన్నట్లుగా.

"కథలన్నీ మనం 'ఫేస్‌వాల్యూ'గా తీసుకోకూడదు. భీముని శక్తి సామర్థ్యాలు నిరూపించేందుకు, పాండవులు ఆ గ్రామవాసులని రాక్షసుని బారినుంచి ఎలా తప్పించారో చెప్పటానికి యిలాంటి కథలు చెపుతూంటారు. అంతమాత్రంచేత మధ్యకొడుకుమీద తల్లితండ్రులకి ప్రేమ లేదనటం న్యాయంకాదు. ఇంతకీ యీవిషయాలు నీకెవరు చెప్పారు?"

'మాఫ్రెండు. అది వింటున్నపుడు నేను ఎంత లక్కీయో అనుకున్నాను, నాన్నా. నా కెప్పుడూ ఓ తమ్ముడో చెల్లెలో వుంటే బాగుండును అనిపించేది.'

'ఇప్పుడు అనిపించటంలేదా ?' అడిగాడు మొదలియార్ నవ్వుతూ.

నాగమణికి - యీ కొత్త స్నేహితుడిని గురించి తండ్రికి చెప్పెయ్యా లని అనించింది. అతనికి జరుగుతున్న అన్యాయం, సుందరరాజన్‌ని తండ్రి బలవంతాన ఎలా పౌరోహిత్యంలోకి దించాలనుకుంటున్నాడో, రెండోవాడు కాబట్టి తల్లితండ్రు లిద్దరూ ఎలా అతనిపట్ల ఉదాసీనంగా ఉంటున్నారో

చెప్పాలని అనిపించింది. ఈ కొత్త స్నేహితుని గురించి ఎలా చెప్పాలి ? ఎలా సంభాషణ ఆరంభించాలి ? — అని కాఫీ గ్లాసు చేతిలోకి తీసుకుని మధనపడుతోంది.

'ఎనిమిదింముప్పావు అయిందమ్మా - లే - ముందు స్నానంచెయ్యి. నీకు టైమయిపోతోంది' అంటూ తండ్రి తొందరపెట్టేడు. నాగమణి మనసులోమాట, నాలికచివరికి రాలేదు. గబగబ లేచి తయారయింది.

ఆరోజు లేతఆకుపచ్చని — లక్నో చీరె తీసింది బీరువాలోంచి. అదేరంగు జాకెట్. ఆ చీరె బీరువాలోంచి తీస్తుంటే ఆమె హృదయంలో సుందరరాజన్ మెదిలాడు. మూడురోజు లయింది అతన్నిచూసి — ఎలా ఉన్నాడో ? కాలికి మళ్ళీ ఎక్స్‌రే తీసివుంటారా ? బోన్ హీలవుతున్నదా ? చీరె చేతిలో పట్టుకుని అలాగు పరధ్యాన్నంగా నిలబడ్డ కూతురువంక - ప్రశ్నార్థకంగా — కాస్త ఆశ్చర్యంగా చూశాడు మొదలియార్. 'మణీ - నీళ్ళు చల్లారిపోతున్నాయ్ — ' అన్నాడు కొంచెం తీవ్రంగా.

నాగమణి ఉలిక్కిపడింది. 'వస్తున్నా — నాన్న-' అంటూ గబగబా స్నానాలగదిలోకి దారితీసింది.

కూతురికి అన్నం పెడుతున్నంతసేపూ మొదయార్ బుర్రలో ఎన్నో సందేహాలు, ఎన్నో ప్రశ్నలు ! మణి మాటల్లో, బిహేవియర్‌లో ఏదో మార్పు. అది పూర్తిగా మార్పు అనికాదుగాని, బాహ్యదృష్టికి కనిపించని చిన్నమార్పు. ఆమె దృక్పథాన్ని, ఆలోచనావిధానాన్ని ఎవరో ప్రభావితం చేస్తున్నారు. మణి కొత్తవ్యక్తితో పరిచయం చేసుకుంది. ఆ వ్యక్తి చెప్పేమాటలు ఆమెని ఆలోచింపచేస్తువి - ఎవరు ? అడుగుదామా ? — అన్న ప్రశ్న నాలిక చివరిదాకా వచ్చింది. కాని ఆయన అడగలేదు. ఇదివరలో భార్య - టపీమని కూతురిని ప్రశ్నలతో వుక్కిరి బిక్కిరి చేసేది. కుండ బద్దలుకొట్టినట్లు 'యివ్వాళ ఏబస్‌లో వచ్చావు ? ఎవరితో మాట్లాడావు ?

లెక్చరర్‌గారు ఎలా పాఠం చెప్పారు ?' అని ప్రతిదీ ఆరాతీసేది - మణి ఆడపిల్ల, ఆడపిల్లని వెయ్యికళ్ళతో కాపాడుకుంటూరావాలి అన్న తాపత్రయంతో. భార్య అలా ఆరాలు తియ్యటం తనకి యిష్టంలేకపోయేది. అలా అడగకూడదు అని అనేకసార్లు భార్యను మందలించేవాడు. ఈ విషయంలో తాము ఘర్షణకూడా పడ్డారు. అటువంటిది యీనాడు మణిని ఏమని అడుగుతాడు ? 'నీకు కొత్తస్నేహితులు దొరికారా ? నీమాటలని బట్టి అతను మొగవాడు అనిపిస్తోంది....ఎవ రతను ?' అని తను ఎలా అడుగుతాడు ? అడగలేడు. మొదలియార్ కూతురి ముఖంలోకి ప్రశ్నార్థకంగా, సాలోచనగా చూసేదేగాని, నోరువిప్పి ఏమీఅడగలేదు.

ఆ రోజు వార్డ్‌కి వెళ్ళేప్పటికి పదకొండున్నర దాటింది. ఫామిలీప్లానింగ్ సెక్షన్‌లో రెండురోజుల కాంప్‌తాలూకు రిపోర్టు, బ్రీఫ్‌గా - అంకెలూ, లెక్కలూతోపాటు రాసియివ్వాల్సి వచ్చింది. దీనిమీద ఛీఫ్ సంతకం పెడుతుంది చెక్‌చేసి. అవన్నీ పూర్తిచేసి, అప్పగించేప్పటికి పదకొండున్నర దాటింది. నాగమణికి సుందర్‌రాజన్‌ను చూడాలని ఎంత ఆతృతగా వుందో - అంత ఆలశ్యం అయింది ఆరోజు. లంచ్ తరువాత తీసుకోవచ్చుని, మెన్స్ సర్జికల్‌వార్డువైపుకి వెళ్ళింది. ఆమె వెళ్ళేప్పటికి ఛీఫ్ రౌండ్స్ ముగించి వెళ్ళిపోతున్నారు. అమ్మయ్యా అనుకుంది. సహజంగా ఛీఫ్‌కి యిలా స్టూడెంట్స్ వార్డులో కనపడటం యిష్టం వుండదని తనకి తెలుసు. సమయం వొచ్చినపుడు-సర్‌కాస్టివ్‌గా-'ఏమిటీ డాక్టర్‌గారు యినస్పెక్షనుకి వచ్చారా ? పేషంట్లందరికీ సరిగ్గా ట్రీట్‌మెంట్ జరుగుతోందా ? ఎనీ కంప్లైయింట్స్' - అంటూ బుర్రపేలిపోయేట్లు మిగతా స్టూడెంట్స్ అందరిముందూ చివాట్లు వెయ్యగలరు. అందుకనే రౌండ్స్ అయితేగాని వార్డులోకి రావటానికి గుండెలు వుండవు ఎవరికీను.

నాగమణి ఆరో నెంబర్ బెడ్ దగ్గరకు వెళ్ళింది. అతను కళ్ళుమూసుకుని పడుకుని వున్నాడు. గడ్డం చేసుకున్నట్లులేదు నల్లగా, గడ్డంమీద వెంట్రుకలు కనిపిస్తున్నాయి. నాగమణి మంచంపక్కకి వెళ్ళి నుల్చున్నా, అతను కళ్ళుతెరవలేదు. జ్వరం వచ్చిందా? మళ్ళీ వుదయం ఏమీ తీసుకోటంలేదా? ఆకలిగా వుందా? దేనికి అలా పడుకున్నాడు?

'హల్లో' అంది నాగమణి.

అతను కళ్ళు తెరిచాడు. 'మీరా!' అన్నాడు. నాగమణికి ఆశా భంగమయింది ఆ 'మీరా' అంటంలో వుత్సాహంలేదు. తను వచ్చిందన్న సంతోషమూలేదు. ఈ మూడురోజులుగా యీ మనిషిని గురించి తను ఎంత తపనపడింది? వెళ్ళి చూడాలని ఎంత ఆరాటపడింది. ఈ మనిషికి తన రాక సంతోషం కలిగించటంలేదా?

'ఏం అలావున్నారు? పొద్దున్న ఏంతీసుకోలేదా?' అడిగింది నాగమణి.

అతను తమాషాగా కళ్ళు చికిలించి నవ్వాడు. 'మీకు నా ఆకలి గురించితప్ప వేరు ఆలోచనలు రావా?'

'అదికాదు. ఎలాగో మూడీగా వుంటేను....'

'బాగానే వున్నానే....'

'నాడ్యూటీ అయిపోయిందిగా వెళ్ళిపోతాను....'

అతను ఆసక్తిలేనట్లు కళ్ళుమూసుకున్నాడు.

'వెళ్ళనా?'

'మీయిష్టం – మీకు పనివుంటే, నేను వుండమంటేమటుకు వుంటారా'

'నాకేం పనిలేదు – అందుకే వచ్చాను.'

'అంటే కాలక్షేపానికా? మీకు ఏపనీ లేకపోతే, పొద్దుపోవటానికి వస్తూంటారా?'

'ఎందుకల్లా మాట్లాడుతున్నారు ? మూడురోజులనుంచి, మీగురించి ఎంత అనుకున్నానో తెలుసా ?'

'అనుకునేనా – నేను ఏమైపోయానో చూసేందుకు రాలేదు....?' నిష్ఠూరంగా తల తిప్పుకున్నాడు.

'నేను రాలేదని కోపమా ?'

'కోప్పడటానికి నే నెవర్ని – మీరు డాక్టరు, నేను దిక్కులేని పేషంటుని.'

'ఛీ-ఛీ అలా అంటారేమిటి ?'

'అంతేగదా, నేను ఏమైపోతే మీకేం ? ఒక్కసారి కనిపించారా .... ఎంత ఎదురుచూశాను ? అగుమ్మంవైపు....చూసి చూసి...' అతని కంఠం బొంగురుగా వుంది.

'ఛ-ఛ. మీరల్లా ఫీలవకూడదు. ఇటు చూడండి' – నాగమణి అతని ముఖం తనవైపుగా తిప్పుకుంది. ఆమె వేళ్ళకి అతనిచెంపలు తడిగా అనిపించాయి. 'ఎబ్బెబ్బే...అదేమిటి చిన్నపిల్లవాడిలాగా....'

చెంపకి అనిన ఆమె చేతిని వదలకుండా, కుడిచేత్తో పట్టుకున్నాడు. కళ్ళనీళ్ళు ఆగకుండా వస్తున్నాయి. 'అరే, అదేమిటి బేబీలాగా ... తప్పు – ఛీ-ఛీ...' అని నెమ్మదిగా అనునయిస్తున్నది నాగమణి – చుట్టూ మంచాల మీద వాళ్ళు చూస్తారేమోనన్న భయంకూడా మర్చిపోయి.

'మీరు ఎందుకు రాలేదు ? మూడురోజులు నన్నిక్కడ వదిలేసి ఎక్కడి కెళ్ళారు ? నేనేం చేశానని మీకు కోపం వచ్చింది ?' అడుగుతున్నా డతను చెయ్యివదలకుండానే ; చెంపకి ఆమెచేతిని అనించుకుంటూ.

'భలేవారే, మీమీద కోపంవచ్చి రాలేదనుకున్నారా ? అదేంలేదు. ఫామిలీప్లానింగ్ కాంప్ వుంటే ఈ రెండురోజులు డ్యూటీ వేశారు... అందుకని రాలేదు.'

'వార్డ్‌బాయ్‌ని అడిగాను. సిస్టర్‌ని అడిగాను. ఎవ్వరూ మాకు తెలియదంటే, మాకు తెలియదన్నారు. అలా గాలిలోకి అంతర్ధానం అయిపోయినట్లు వెళ్ళిపోయారు....నేను, నేను....' అతను మాటలకి తడుముకుంటున్నట్లు.

'ఏమయింది? ఎక్సరే తీశారా - బోన్‌హీల్ అవుతోందా?' అడిగింది నాగమణి సర్దుకుని బల్లమీద కూచుని అతని చేతిని నెమ్మదిగా వదిలించుకుని. పక్కన కూచుని 'యిప్పుడు చెప్పండి మీకెందుకంత కష్టంగా వుంది - ఏంజరిగింది? మీనాన్నగారు ఏమన్నా అన్నారా?' అడిగింది అనునయంగా.

'మానాన్నా - మామయ్యా యిద్దరూ వచ్చారు.'

'వస్తే'

'మీకు మా మామయ్యసంగతి తెలియదు.'

'చెప్పండి, చెపుతేగదా తెలిసేది'

'పెద్దడాక్టరుగారికి చెప్పి నన్ను పుత్తూరు తీసుకెళ్ళిపోతారుట.'

'నాన్‌సెన్స్. అల్లాంటివి వొప్పుకోకండి...'

'నేనెవర్ని వొప్పుకోకపోవటానికి _ మేము పెద్దవాళ్ళం - చెప్పినట్లు వినాలి అంటున్నారు.'

'పెద్దడాక్టరుగారు పర్మిషన్ యివ్వరు.'

'మాబాధ్యతమీద తీసుకెళ్ళిపోతున్నాం అని వుత్తరం యిస్తే డిశ్చార్జి చేస్తారుట.'

'ఎవరు చెప్పారు?'

'మా మామయ్య.'

'మీ నాన్నగారో?'

''ఆయనకి మొదటినుంచీ యిష్టంలేదుగా.'

'మరి మీవిషయం? మీకు పుత్తూరువైద్యంమీద నమ్మకంలేదా?'

'లేదు.'

'ఎందుకని?'

'మీరు చెపుతున్నారా - నాకు మీమాటమీదతప్ప యింక దేనిమీదనూ నమ్మంలేదు. పుత్తూరువెళ్తే మీరు కనపడరు. మీతో మాట్లాడటం వీలవదు.'

'నాకోసమే ఉండిపోవాలనుకుంటున్నారా ?'

'మీకోసమే కాదు – నాకోసంకూడాను.'

'అంటే ?'

'ఈరోజు మా మామయ్య చేతిలో చిక్కుకుంటే – నాకు బ్రతుక్కు స్వేచ్ఛ ఉండదు.'

'అదేమిటి, ఆడపిల్లలాగా – మగవారు, చదువుకుంటున్నవారు – మీకు స్వేచ్ఛలేకపోవటం ఏమిటి ?'

'మీకు ఎన్నిసార్లు చెప్పను ? మా కుటుంబం గురించి యిదివరకు చెప్పానుగదా ! ... మళ్ళీ అడుగుతారేం ?'

'మీ స్వేచ్ఛకీ – దీనికీ మధ్య గల సంబంధం ఏమిటి ?'

అతను కోపంగా – విసుగ్గా చూస్తున్నాడు ఆమెవంక. తీక్షణంగా చూస్తూ – 'మీకు మొన్న చెప్పాను. నేను పుట్టింది అగ్రజాతి – అంటే బ్రాహ్మణ కుటుంబం. అది ఒకరకంగా మాకు శాపం. ఉద్యోగాలూ, చదువులూ మాకు అంత త్వరగా దొరకవు. కూలీనాలీ చేసుకునే ధైర్యం వుండదు. నాకు స్వేచ్ఛ దొరకాలి అంటే యింట్లోంచి పారిపోవాలి. అంటే హోటల్లో కాఫీకప్పులు కడుక్కుని బతకాలి. అంతకిమించి మార్గంలేదు.' అన్నాడతను బిట్టర్‌గా.

'అదేమిటి – బి. ఎ. పాసయ్యారు, ఎక్కడా ఉద్యోగం దొరకదా ?'

'దొరకదు. మీకు తెలియదు. మేము పడుతున్న అవస్థలు. ఇంట్లో తిండికి లేకపోయినా–ఒక్కపూట తింటున్నా–గుమాస్తా ఉద్యోగానికితప్ప–కిందకి పోలేం. అట్లాటి కుటుంబాలు మావి. అందులోనూ కాళ్ళులేని అవిటివాడిని....'

'ఛీ-ఛీ, అట్లా అంటారేమిటి – మూడువారాల్లో శుభ్రంగా నడుస్తారు.'

'అప్పటిదాకా అవిటివాడినేకదా! అంచేత మామయ్యకి మరీ లోకువ. పట్టు—పట్టు అంటూ నన్ను పుత్తూరు తీసుకెళ్ళిపోతామంటూ కూచున్నారు.'

'నేను రాను—అనండి'

'అన్నాను....'

'అయితే నీకూనాకూ తెగతెంపులు—అంటూ చిందులుతొక్కాడు - మా నాన్న.'

'ఆయనకి ఎందుకంత పట్టుదల...కానీ ఖర్చులేకుండా వైద్యం జరుగుతుంటే....'

'రోజూ బస్‌లకి అవుతోందిట. తిరగటానికి ఎవరూ లేరట. కారియర్లు జారెయ్యలేకుండావున్నారుట.'

'విచిత్రంగావుందే....కొడుకు బెడ్ మీద ఉంటే—యిల్లా ఆలోచించే తండ్రులు ఉంటారా!'

'ఉన్నారుగా....ఈ మధ్యాహ్నం పెద్దడాక్టరుగారితో మాట్లాడి లెటర్ రాసిస్తారుట. మీరు....మీరు....' ఆగిపోయాడు అతను.

'చెప్పండి. ఏంచెయ్యమన్నారు ?'

'ఆయన్ని పర్మిషన్ యివ్వద్దనండి. పేషంటుకి యిష్టంలేదని చెప్పండి. నేను యిక్కడినుంచి కదలను.'

'మీరే ఉత్తరం రాసివ్వండి. నేను తీసుకెళ్ళి యిస్తాను.'

అతను ఒక్క క్షణం తటపటాయించాడు. 'ఆ ఉత్తరం మా నాన్నకి చూపిస్తారా ? చూపిస్తే చాలా గొడవ అవుతుంది.'

'ఎందుకవుతుంది ?'

'మా మామయ్య వూరుకోడు. బాకీ కక్కమని అల్లరిచేస్తాడు.'

'బాకీయా ? – మీ నాన్నగారు మీ మామయ్యకి బాకీపడ్డారా ?'

'మూడువేలు అప్పుచేశాడు.

'దేనికోసం ?'

'అన్నయ్య దావావేశాడుగదూ ; ఆ సందర్భంలో ప్లీడరుఖర్చులూ - కోర్టుఖర్చులకీ అయిన డబ్బు మామయ్య యిచ్చాడు.'

'అయితే అబాకీ అడిగే సమయం యిదా ? మీరు వుద్యోగంచేసి తీరుస్తానని చెప్పండి.'

'అది తీర్చక్కర్లేదుట. మామయ్య కూతురుంది. ఆ హిడింబి, దాన్ని నాకు యిచ్చి పెళ్ళి చేస్తారుట - ఇంకో రెండువేలు, అంటే అయిదువేలు కట్నంగా యిస్తారుట'

'మంచిదేగా _ చేసుకోండి' అంది నాగమణి విసురుగా. ఆమె మనసులో కత్తులు దిగబడుతున్నట్లుగా వుంది. ఇంతకీ యితనికి యింకో అమ్మాయి నిచ్చి పెళ్ళిచేస్తారన్నమాట. చేసుకోమను. కసిగా, కోపంగా వుంది. స్టూలుమీంచి విసురుగా లేచింది.

'మీరు నాకు సాయం చెయ్యరా ?'

'ఏంచెయ్యమంటారు ? మీరూ మీరు ఒకటి. మధ్యన నేను ఎవర్ని ?'

'మీరు వస్తారని, నన్ను 'సేవ్' చేస్తారని.... వెయ్యికళ్ళతో ...'

'మీరేం ఆడపిల్లా 'సేవ్' చెయ్యటానికి. మగవారు, చదువుకున్న వారు...మీకు శక్తిలేదా ? ధైర్యంలేదా ?'

'ఉన్నాయి కాబట్టే మిమ్మల్ని అడుగుతున్నాను. నన్ను పుత్తూరు అంటూ తీసుకెళ్ళారా, మళ్ళీ మద్రాసు రానివ్వరు. చదువూలేదు - గిదువూ లేదు అంటూ ; ఆ హిడింబికి కట్టబెట్టి, గుళ్ళో కొబ్బరికాయలు కొట్టమంటూ వుంటారు.'

'మీమామయ్యకికూడా పూజారిపనేనా ?'

'ఆహా. ఆయనగారికీ వుంది - గుళ్లో అర్చన. పైగా మగపిల్లలు లేరు. అందుకని నాకు ఆ పదవి కట్టబెట్టాలని కోరిక.'

'మీకు ?'

'నేను ఆపిల్లని చేసుకోను. గుళ్లో పూజలు చెయ్యను. పదిపైసలూ అయిదుపైసలూ ఏరి బొడ్లో దోపుకోటం నావల్లకాదు. నేను చెయ్యలేను.'

'అయితే వుత్తరం రాసివ్వండి.'

'మావాళ్ళకి చూపించకండి.'

'అది తర్వాత - ముందు రాసివ్వండి' అంది నాగమణి దృఢంగా.

ఉత్తరం అయితే రాయించి తీసుకుందిగాని, అది 'చీఫ్'కి ఎలా యివ్వాలి? యీ పేషంటుకీ తనకీ మధ్య సంబంధం ఏమిటని 'చీఫ్' అడిగితే ఏంచెయ్యాలి? మెడికల్‌కాలేజీ ప్రొఫెసర్స్ పెద్దపులులయితే' హాస్పటల్ చీఫ్స్ సింహాలు. ఎప్పుడూ గాండ్రిస్తూ - ఏ స్టూడెంట్‌ని నమిలి తినేద్దామా అన్నట్లు భయంకరంగా వుంటారు. అందులోనూ స్టూడెంట్స్ అంటే - క్షుద్రకీటకాలని చూసినట్లుగా ట్రీట్ చేస్తూంటారు. ఉత్తరం బాగ్‌లో పెట్టుకుంది మేకపోతు గాంభీర్యంతో.

'మీరు ధైర్యంగా వుండండి - యిక్కడినుంచి మిమ్మల్ని ఎవరూ కదపలేరు....' అంది నాగమణి.

'కాలు విరగడంకాక, మనిషినంతా ఆ లారీకింద పడిపోయి వుంటే బాగుండేది.'

'అదేమిటి - అట్లా పిరికిగా మాట్లాడుతున్నారు?'

'పిరికితనంగాక ఏంచెయ్యను? నాకు అప్పు డప్పుడు విసుగ్గా వుంటుంది. చచ్చిపోవాలని అనిపిస్తూ వుంటుంది - ఎవరికీ అక్కర్లేనివాడిని.'

'సిల్లీగా మాట్లాడుతున్నారు.'

'నిజంగా చెపుతున్నాను. మా అమ్మకీ, నాన్నకీ నేను ఏమైపోయినా అక్కర్లేదు. కుటుంబానికి ఎలా వుపయోగపడతాను అన్న ఆలోచనతప్ప, వీడికి చదువుకోవాలని వుంది - మంచి వుద్యోగం చెయ్యాలని వుంది. అని అర్థం చేసుకుంటున్నారా?'

నాగమణి మాట్లాడలేదు.

అతను వుద్రేకంగా మాట్లాడుతూ వున్నాడు. 'నావయసు పిల్లలు హాయిగా స్పోర్ట్స్ అనీ, ఎన్. సి. సీ అని ఫ్రీగా తిరుగుతుంటే, మా నాన్న

గుడిలో కూచుని పదిపైసలూ అయిదుపైసలూ ఏరి దాచుకోరా అని – ఆ పూజలో పెట్టాడు. గజగజ వణికే చలిలో స్నానం చెయ్యమనేవాడు. టెక్స్టుపుస్తకాలు చదువుతే మండిపడిపోయేవాడు. ఎందుకిలాంటి జీవితం ? ఈ యింట్లోంచి పారిపోయి ఎక్కడయినా కూలినాలి చేసుకు బతుకుదామనిపించేది.'

'ఇంతకుముందేగదా అన్నారు. కూలి నాలి చేసుకునే తెగువ మీకు వుండదని.'

'నిజమే. ఈసారి పక్కమీంచి లేవగానే ఆఖరికి ఏ హోటల్లోనో సర్వర్‌గా జేరుతానుతప్ప, చస్తే మాయింటికి వెళ్ళను. నిజంగా చెపుతున్నాను. మీతో పరిచయం అయాక నాకు 'కాన్ఫిడెన్స్' వచ్చింది. ఏమైనాసరే మానాన్నమాట వినను.

'అయితే ఉత్తరం చింపెయ్యనా ?' అడిగింది నాగమణి నవ్వుతూ.

'వొద్దు. మీరు డాక్టరుగార్కి చెప్పండి. మా మామయ్య వృత్తి జిత్తులమారి నక్క. డాక్టరుగారి జాతకం చూస్తానంటాడు. చెయ్యిచూసి – ఆయనకి పై రాంక్ ఎప్పుడొస్తుందో చెపుతానంటాడు. పని అవటానికి ఎన్ని వేషాలన్నా వేస్తాడు.'

నాగమణికి యితన్ని చూస్తే తమాషాగావుంది. ఒక క్షణంలో ధైర్యంగా – తెగించేట్లు మాట్లాడుతాడు. మళ్ళీ మరుక్షణంలో నీరసపడిపోతూంటాడు. ఇతనికి నిజంగా పెళ్ళంటే యిష్టంలేదా ? లేకపోతే మేనమామమీద కోపమా ?'

'మీ మామయ్య కూతురు పేరేమిటి?–అదే మీకాబోయే భార్యామణి'

అతను బుసకొట్టే పాముపడగలాగా తలఎత్తాడు గభాలున. 'అది నాకు పెళ్ళాంకాదు. చస్తే దాన్ని పెళ్ళాడను' అన్నాడు తీవ్రంగా.

'పోనీ పేరు చెప్పండి' నాగమణికి అతన్ని ఏడిపిస్తుంటే, బాగుంది. సరదాగాకూడా వుంది.

'అలిమేలుమంగ' అన్నా డతను విసుగ్గా.

'పేరు బాగుంది. ఎన్నేళ్ళు? ఎలా వుంటుంది, నాలాగా వుంటుందా?' అడిగింది అల్లరిగా.

అతను కన్నార్పకుండా నాగమణివంక చూస్తున్నాడు. రెప్ప వెయ్యటం మర్చిపోయినట్లు మనిషినంతా ఆపాదమస్తకం చూస్తున్నాడు. అతని కళ్ళు ఆమె శిరస్సునుంచి కాలి బొటనవేలుదాకా దేహాన్నంతా పరిశీలనగా గుచ్చిగుచ్చి చూస్తున్నాయి. నాగమణికి వొకవైపు యిబ్బందిగా వుంది. మరోవైపు ఆనందంగా వుంది. అతని కళ్ళు ఆమెని ఒకరకమైన మత్తుతో, మాటల్లోకి రాని మనోభావాల్తో స్పృశిస్తున్నాయి. 'ఎందుకు అలా చూస్తున్నారు?' అని అడగాలనిపించింది. కాని అడగలేకపోయింది. 'అల్లా చూడకండి' అని గదమాయించా లనుకుంది. పెదవిదాటి ఆమాట పైకి రాలేదు. అతను అలా రెప్పవాల్చకుండా తనవంక చూస్తూ కూచోవాలి. ఆ దృష్టితో ఎవ్వరినీ - యింకెవ్వరినీ చూడకూడదు. ఆ కళ్ళు తన వొక్కదాని కోసమే వుండాలి. ఆ దృష్టి తన స్వంతం కావాలి. ఆమె ప్రశ్నకి అతను బదులు చెప్పలేదు. ఇద్దరిమధ్యా నిశ్శబ్దం. చుట్టూ పేషంట్లని, ఆస్పత్రి పరిసరాలని, కాకుల కావుకావులని అన్నిటినీ మర్చిపోయి చూస్తున్నారు ఒకరివంక మరొకరు.

'మీకంటే యీ ప్రపంచంలో ఎవ్వరూ అందంగా వుండరు. దానికీ మీకు పోలికలేదు' అన్నాడతను చాలానెమ్మదిగా, బొంగురుగా.

ఇద్దరిమధ్యా పేరుకున్న ఆ చిక్కని నిశ్శబ్దం అందమైన అతని మాటలతో ఆవిరిఅయిపోయింది. అతని మాటలకి తను బదులు చెప్పాలి. ఏంచెబుతుంది? అతను తన అందాన్ని పొగుడుతున్నాడు. నవ్వి వూరుకుంటుందా? ఆ కాంప్లిమెంటుని సాదాగాతీసుకుని వూరుకోటం ఎలా .... 'మీ అలిమేలుమంగ ఏం చదువుతోంది? ఎలావుంటుంది?'

'చదువా ? దానికి పొట్టకోస్తే అక్షరంముక్క రాదు. తెల్లవారగట్ల మూడింటికి లేచి - వూరంతా ముగ్గులు పెడుతుంది - అదేదో గొప్ప ఆర్టులాగా మామామయ్య తెగ చెప్పుకు మురిసిపోతూంటాడు.'

'స్కూలుకి పంపలేదా ?'

'పంపారు. చాకలిపద్దూ, మొగుడికి వుత్తరం, యీ రెంటిలో అది గ్రాడ్యుయేట్ అయింది. అక్కడికి చాలుట. తెలుగుఅక్షరాలు రాసి, చదివితే చాలుట. గిన్నెలు తళతళలాడేట్లు తోముతుంది. ఇల్లు అద్దంలా పెట్టుకుంటుంది. దద్దోజనం, చక్కెరపొంగలి చిటికలో చేస్తుంది. ఆడపిల్లకి యింతకంటే ఏంకావాలి ?' నవ్వుతూ అడుగుతున్నా డతను.

'మరి, మీ అభ్యంతరం ఏమిటి ?' అడిగింది నాగమణి కాస్త చికాగ్గా. ఆ పిల్లని మెచ్చుకుంటూనే పెళ్ళిచేసుకోనంటాడే.

'ఇవి నామాటలు కావు. మా మామయ్య మాటలు. సర్వసలక్షణ శోభితురాలయిన నాకూతురు అలిమేలుమంగమ్మని చేసుకోటానికి నీకొడుకు పెట్టిపుట్టాలి అంటూ, మా అమ్మకూ నాన్నకూ రోజురోజూ జ్ఞాపకం చేస్తూంటాడు. దానికితోడు గుళ్ళో అర్చనకూడా కట్టపెడతాడుట. ఏవైతే నాకు అసహ్యమో, వేటిని నేను హేట్ చేస్తున్నానో అవే నాతలకి చుట్టపెడతామంటున్నారు.'

'మీకెందు కంత హేట్రెడ్ ?' అడిగింది నాగమణి.

'నాకు మానాన్నలాగా యీపూజా పురస్కారాలమీద పూర్తి నమ్మిక లేదు. ఇది ఒకరకంగా బిచ్చం ఎత్తుకోటమనే నాకు అనిపిస్తూ వుంటుంది. అయిదుపైసలూ, పదిపైసలూ హారతిపళ్ళెంలోంచి ఏరుకొని బొడ్లో దోపుకోటం నావల్లకాదు.'

'పోనీ, మీమామయ్య వుద్యోగం యిప్పిస్తారేమో - అడక్కపోయారా ?'

'ఇప్పించినా - నాకు ఆ హిడింబ వొద్దు. దాని సైజెంతో మీకు తెలుసా ?'

'ఎట్లా తెలుస్తుంది ? మీరు చెప్పలేదుగా ?' నవ్వుతూ అడిగింది.

'మాఅమ్మని చూశారుగా. అలా వుంటుంది.'

నాగమణి ఫక్కున నవ్వింది. అతను కోపంగా చూస్తున్నాడు. సన్నగా పూచలాగావున్న యీతనిపక్క పొట్టిగా గుమ్మడికాయలాగా వుండే పెళ్ళాన్ని వూహించుకుంటే తెరలు తెరలుగా నవ్వొస్తోంది. ఆమె నవ్వుతున్నకొద్దీ, అతనికి కోపం ఎక్కువవుతోంది. ఆ నవ్వుని చూడలేనట్లు ముఖం రెండోవైపుకి తిప్పుకున్నాడు. నాగమణి కటిక్కున నవ్వటం ఆపేసింది. గుమ్మంలో ఎర్రంచుపంచా, చేతిలో ఎల్. జి. యింగువసంచీ కనిపించగానే గభాలున బల్లమీంచి లేచింది వెళ్ళిపోటానికి .... అతను ఆగండి అన్నట్లు చెయ్యిచాపి, ఆమె చెయ్యి అందుకోబోయాడు. కాని, నాగమణి ఆ అవకాశం యివ్వకుండా 'వెళ్లొస్తా' అంటూ కదిలింది.

గుమ్మంలో కృష్ణమాచార్యులు, ఆయన వెనుక నల్లగా పొట్టిగా వుండి, మొహంమీద నామాల్తో వున్న మరోఆకారం. బహుశా మేనమామ లు.

'అమ్మా డాక్టరుగారు, పిలుస్తున్నాడు సుందర్‌రాజన్ తండ్రి - కృష్ణమాచార్యులు. నాగమణి వినిపించుకోనట్లు రెండోవైపు ద్వారబంధం నుంచి వరండాలోకి వెళ్ళిపోయింది. ఆయన మళ్ళీ పుత్తూరు అంటాడు. ఈసోది వినే వోపిక తనకులేదు. గబగబ నడిచి వెళ్ళిపోతోంది. అయితే సుందర్‌రాజన్ యిచ్చిన వుత్తరం 'చీఫ్'కి ఎలా అందజెయ్యాలి ? అదో సమస్య. నాగమణి గైనిక్‌వార్డులోంచి వెళ్తుంటే, సర్జికల్‌వార్డు సిస్టర్ డ్యూటీకి వస్తోంది. సిస్టర్ నాగమణికి నవ్వుతూ విష్ చేసింది. ఇదే అదను అనుకుని 'సిస్టర్....నాకో హెల్ప్ చేసిపెడ్తారా ?' అడిగింది.

'ఏమిటి ?' ప్రశ్నించింది సిస్టర్ కాస్త అధికారంతో.

'మీవార్డులో ఆరోనెంబర్ బెడ్‌లోని పేషంటు :'

'ఎవరూ ? ఆ ఫ్రాక్చర్ కేసుగదూ. వాళ్ళ నాన్న ఒక న్యూసెన్సు.

చీఫ్ బాగా చివాట్లు వేశారు. ఇంతకుముందే చీఫ్‌రూమ్‌లో ఫార్సు జరిగింది.'

'ఏమిటయింది?'

'వాళ్ళుత్త మూర్ఖులు. ఆ పేషంటుకి బోన్ చక్కగా అతుక్కుంటున్నది. ఇంప్రూవ్ అవుతున్నాడు. వీళ్ళేమో పుత్తూరు తీసుకెడతామని గొడవ. ఇది పోలీసు కేసు. మీరు తీసుకెళ్ళటానికి వీల్లేదని, చీఫ్ గట్టిగా అరిచారు. మా రెస్పాన్సుబులిటీమీద తీసుకెడతామని చెప్పబోయారు....'

నాగమణి వెంటనే కల్పించుకుని 'సిస్టర్, ఆ పేషంటుకి యిష్టం లేదు. వాళ్ళ ఫామిలీ ప్రొబ్లెమ్స్‌వల్ల యితన్ని తీసుకెడతామంటున్నారుట. అతను నాతో చెప్పుకుని గోలపెట్టాడు.'

'అట్లాగా, అయితే డిశ్చార్జిషీట్ మీద చీఫ్‌ని సంతకం పెట్టద్దంటాను. అసలు నా టేబుల్ మీంచి రిపోర్ట్‌షీట్ కదుల్తేగా – తిక్కకుదురుస్తానుండండి. ఆ ముసలాడిచేత మూడుచెరువుల నీళ్ళు తాగిస్తాను.'

'ఎవరూ, ఆ తెల్లాయనా?'

'ఉహూ. ఆ రెండోగుండు. పంగనామాల గుండు. ఈ ఎమ్మెల్యే తెలుసు, ఆ మినిష్టర్ తెలుసు, అంటూ ఎగిరాడు. వీడి పొగరు అణుస్తాను. నాలిక పీక్కున్నా 'కేస్‌షీట్' కదలనివ్వను' అంది సిస్టర్ విజయగర్వంతో. అమ్మయ్యా అనుకుంది నాగమణి, హాండ్‌బాగ్‌లోని వుత్తరం 'చీఫ్'కి యివ్వక్కర్లేదన్న రిలీఫ్‌తో.

ఆ తరువాత అతని కష్టాలు ఆరంభమయ్యాయి. 'నన్ను డిశ్చార్జి చెయ్యండి' అంటూ డాక్టరుగారికి చెప్పుకోమన్నారుట. చెప్పను అంటే మేనమామ తండ్రీ కలిసి బాగా చివాట్లు వేశారుట. చిట్టచివరికి ఆ డాక్టరు పిల్లని మరిగావు అనికూడా అనేశారుట. ఈ ఆఖరుమాట అతను చెప్పలేదు గాని, మాటలనిబట్టి నాగమణి గ్రహించుకుంది. ఆ తరువాత రెండు వారాలు యించుమించు – నాగమణే పొద్దుట టిఫినుకీ, రాత్రి భోజనానికి ఏర్పాటు చేసింది. మధ్యాహ్నం ఏ రెండింటికో – విసుక్కుంటూ కసుక్కుంటూ తండ్రో – తమ్ముడో అన్నం తెచ్చేవారట.

రేపు డిశ్చార్జిచేస్తారనగా - నాగమణికి అసలు సమస్య ఆరంభమైంది. కొన్ని మందులకీ, బెడ్‌కీ - మొత్తం ఓ రెండువందలుదాకా కట్టాల్సి వచ్చింది. అది ఎలా కట్టాలి? - అన్న సమస్య. సుందరరాజన్ తండ్రి - నాదగ్గర అంత లేదు - మీ మామయ్యని నువ్వు అడుగు, యిస్తాడు___ అంటూ చిన్న మడతపేచీ వేశాడు. ఆయన అలా ఎందుకు అడగ మంటున్నాడో సుందరరాజన్ గ్రహించుకుని - నేను ఛస్తే అడగను; నువ్వే తెచ్చియ్యి - అన్నాడట తండ్రితో.

'ఆరువారాలుగా యిక్కడున్నాను. నర్సులకీ, వార్డుబాయ్‌లకీ ఏదన్నా యివ్వాలి. మొత్తం మూడొందలు తెమ్మన్నాను నాన్నని.' అన్నాడు నాగమణితో.

'తెస్తానన్నారా?'

'రెండొందలు ఎలాగో తెస్తాను. ఈ దానాలూ, ధర్మాలూ వీలవదు అన్నారు. నాకు అసహ్యం వేసింది. పదిపైసలకీ, పావలాకీ ఎదురుచూసే మా నాన్న - యీ తోటీవాళ్ళకి యివ్వటానికి గింజుకుంటున్నాడు.'

'అది ఆయన స్వభావం - మీరు అనవసరంగా రగడపెట్టుకోకండి' అంది నాగమణి.

'వీళ్ళకి ఏమీ యివ్వకుండా - నేను ఎలా వెళ్ళను. ఎన్ని తిట్టినా - విసుక్కున్నా బెడ్‌పాన్ వీళ్ళు పెట్టారా - మా నాన్న పెట్లాడా? మనుషులకి దయా, జాలీ అన్నది నశించిపోతున్నది.... వాళ్ళ ముఖం నేను ఎలా చూడను. ఏమీ యివ్వకుండా వెళ్ళిన పేషంట్లని వీళ్ళు ఎలా తిడతారో నా చెవులారా విన్నాను...'

'అవుననుకోండి. పోనీ నేను తెచ్చివ్వనా? ఒక వందేకదా; నేను సర్దుతాను___'

'మీకు మటుకు ఎక్కడినుంచి వస్తాయి. సంపాయిస్తున్నారా?'

'మానాన్నని అడుగుతాను - నేను అడిగితే కాదనరు.'

'అదృష్టవంతులు. అందుకే మీరు 'లక్కీ' అన్నది. ఆస్పత్రిలో వున్న కొడుక్కి ఖర్చుపెట్టడానికి మానాన్న యింత గొడవ చేస్తున్నాడు. మీనాన్నగారు ఎంత డబ్బిచ్చారో యీ నెల్లాళ్ళలో. ఒక్కసారన్నా లెక్క అడిగారా ? ఆయన చాలా నోబిల్ అనుకుంటా.'

'నన్ను మెచ్చుకోరేం - మానాన్న గురించి పొగుడుతున్నారుగాని.'

'నిన్నా....నిన్ను నేను పరాయిదానిగా అనుకోటంలేదు. నువ్వు నాప్రాణం' అన్నాడతను వుద్రేకంగా ; అతను తనని 'నువ్వు' అన్నాడన్నది నాగమణి గమనించలేదు. తను ఆమెని ఏకవచనంతో పిల్చానన్నది సుందర్‌రాజనూ గ్రహించలేకపోయాడు. ఈ పిలుపు ఇద్దరికీ సహజంగా అనిపించింది.

'ఎల్లుండినుంచీ మనం ఎక్కడ కలుసుకుంటాం ?' అడిగాడతను.

'మీరు ఇప్పుడప్పుడే బాగా తిరగటానికి కూడదు - కొన్నాళ్ళు కాలికి రెస్ట్ యివ్వాలిట.'

'అయితే అన్నాళ్ళూ యిక్కడే ఉంటాను. నిన్ను చూడకుండా ఒక్కరోజుకూడా ఉండలేను.'

'అదెట్లా వీలవుతుంది ?'

'ఎందుకవదు ? నన్ను చూడాలని నీకు అనిపించటంలేదా ? చూడకుండా ఉండగలవా ?'

నాగమణి బదులు చెప్పలేదు.

'జవాబుచెప్పు.' ఆమెచేతిని తన అరిచేతుల్లోకి తీసుకుంటూ అడిగాడు.

'ఉండలేను' అంది అతినెమ్మదిగా నాగమణి.

'మాయింటికి రా - రోజూ మధ్యాహ్నంపూట - హాస్పిటల్‌నుంచి వచ్చెయ్యి.'

'మీ నాన్నగారు ఏమన్నా అంటారేమో.'

'అననీ - ఐ డోంట్ కేర్ - నువ్వు రోజూ కనిపిస్తే చాలు. నన్ను ఎవరేమన్నా లెక్కపెట్టను.' అన్నాడు అతను విజగర్వంతో.

'మిమ్మల్ని కాదు - నన్ను.' అంది మెల్లగా.

'అప్పుడు చూద్దాం.' అన్నాడు దిలాసాతో.

హాస్పిటల్‌వారు సుందరరాజన్‌కి క్రచెస్ వేసుకుని నడవటం అలవాటుచేశారు. మొదటిరోజున కుడిచేతికి కిందుగా - ఒక క్రచెస్ పెట్టుకుని - ఎడంకాలుమీద భారంమోపి నడవటానికి ప్రయత్నించినపుడు పక్కన డాక్టరు, నర్సు ఉండి కిందపడకుండా – జాగ్రత్తగా ట్రయినింగ్ యిచ్చారు. ఫ్రాక్చర్ అయిన కాలుమీద భారం మోపకుండా – పాదం కొస్త ఎత్తి పెయ్యమన్నారు. క్రమంగా మంచాలమధ్య అడుగులువేస్తూ – మంచం పట్టుకుని అడుగులు వేస్తూ నడక నేర్చుకున్నాడు. ఆఖరురోజున అతను – నడుస్తూ ఆసుపత్రినుంచి - మెట్లుదిగి నెమ్మదిగా దిగుతూ యింటికెళ్తున్నపుడు - దూరాన నుల్చుని చూస్తున్న నాగమణికి ఎలాగో అనిపించింది. ఒకవైపు అతను మామూలుగా నడవగలుగున్నాడని ఆనందంగా ఉంది. మరోవైపు ఏదో వెలితి. రేపటినుంచీ తను యీ వార్డులోకి రానక్కరలేదు. తనతో కబుర్లుచెప్పే వ్యక్తి ఉండడు. ఈమధ్య– మరీ రెండువారాలుగా - రోజూ అతనిదగ్గర కూచుని కబుర్లుచెప్పటం అలవాటయింది. తన రాకకోసం అతను ఎదురుచూడటం – తను ఉత్సాహంగా పరుగెత్తుకురావటం అలవాటయిపోయింది. రేపటినుంచీ ఎలా ? ఇంకో రెండునెలలదాకా తనకి యీ హాస్పిటల్‌లో డ్యూటీ తప్పదు. ఆ రెండునెలలూ ఎలా గడపటం ? అతను టాక్సీ ఎక్కి – అది కనుమరుగు అయేదాకా – చూస్తూ నుల్చుంది - ఆసుపత్రి గేటుముందు నాగమణి. అతను వెనక్కి తిరిగితిరిగి చూస్తున్నాడు ....

'అన్నం పెట్టాను - వడ్డించాను___' అన్న ఆదెమ్మ పిలుపుకి ఉలిక్కిపడి తలఎత్తింది డాక్టర్ నాగమణి. తానెక్కడుంది ? మద్రాసులోని రాయపేట హాస్పిటల్ గుమ్మంలోగాదా ? పేవ్‌మెంటు పక్కనుంచి స్పీడుగా వెళ్ళిపోతున్న టాక్సీ ఏది ? ఆ టాక్సీ వెనుకభాగంలోంచి - గ్లాసులోంచి -

మసక మసకగా కనిపిస్తున్న ఆ సుందర్‌రాజన్ ముఖం ఎక్కడికి వెళ్ళింది? నాగమణి కళ్ళు నలుపుకుని, నిద్రలోంచి లేచినదానిలాగా చుట్టూచూసింది. అది మద్రాసుకాదు. తను ఆఖరుసంవత్సరంలోవున్న మెడికల్‌స్టూడెంటూ కాదు. తను తన కన్సల్టింగ్‌రూమ్‌లో వుంది. ఎదురుగుండా గుమ్మంముందు ఆడెమ్మ నుల్చునివుంది. రంగునేతచీరె కట్టుకుని, తెల్లరెవికతో వేలు ముడితో ఆడెమ్మ — మధ్యవయసు దాటిపోయి వృద్ధాప్యంలో అడుగు పెడుతున్న ఆడెమ్మ. తెల్లనివెంట్రుకలమధ్య అక్కడా అక్కడా ఒకటో రెండో నల్లవెంట్రుకలు. నుదిటిమీద అడ్డంగా దిద్దుకున్న విభూది – రెండు కనుబొమ్మలనీ కలుపుతూ వుంది.

'వడ్డించమంటావా? అన్నీ బల్ల మీద సర్దాను' ఆడెమ్మ నిర్లక్ష్యంగా అడుగుతోంది. కోపంగా వున్నపుడు 'నువ్వు' అని సంబోధిస్తుంది. ఆడెమ్మకి కోపంగా వుంది. ఆడెమ్మకేకాదు – నర్సుకి, ఆయాకి, వూళ్ళో పేషంట్లకి అందరికీ తనమీద కోపంగా వుంది. చాలాకాలం నిద్రపోయి, అప్పుడే మెళకువ వచ్చినదానిలా – కళ్ళు నులుపుకుని – మరోసారి చుట్టూచూసింది.

ఎదురుగుండా గోడగడియారం పదకొండున్నర సైపు చూపిస్తున్నది. పదకొండున్నర అయిందా? అంటే నాలుగుగంటలనుంచీ తను యిలా ఏపనీ లేకుండా కుర్చీలో కూచుని వుందా? ఈ నాలుగుగంటలూ తను ఏంచేసింది? ఏమీ చెయ్యకుండా అలా కుర్చీలో కూచుండిపోయిందా? ఇలా పనీపాటా లేకుండా తను ఏనాడన్నా కూచుందా? యీపాటికి ఎంతమంది పేషంట్లని చూసి వుండేది? అసలు విజిట్స్‌కి తాను ఎందు కెళ్ళలేదు? తలఎత్తి చూసింది – వాడుగ్గా వచ్చే రిక్షావాడు గుమ్మంలోలేడు. ఆవరణంతా ఖాళీగా, నిశ్శబ్దంగా వుంది. ఎండకి జడిసి పక్షులుకూడా శబ్దం చెయ్యటంలేదు. పక్షులూ, పేషంట్లూ ఎవ్వరూలేరు. నర్సూ, ఆయా ఎవ్వరూ రాలేదు. నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగావున్న యీ పరిసరాలని చూస్తే నాగమణికి భయంగా వుంది. తనదగ్గరికి పేషంట్లు ఎవ్వరూ రారా? తన వైద్యం ఈవూరివారికి అక్కర్లేదా? ఏంజరిగింది? తాను చేసిన తప్పేమిటి?

'అన్నం వడ్డించనా?' తీవ్రంగావున్న ఆదెమ్మ కంఠం.

'వొద్దు – నాకు ఆకలిలేదు' అందామనుకుంది. కాని, భోజనంకూడా మానేస్తే, రొటీన్‌లోని అలవాటయిన యీపనికూడా మానేస్తే, యీరోజు యింకా భయంకరంగా వుంటుంది. అన్నం తింటూ ఆదెమ్మని మాటల్లోపెట్టి అడుగుతే సరి. ఎలిజబెత్ – మరియమ్మా ఎందుకు రాలేదో – పేషంట్లు ఎవరూ ఎందుకు రాలేదో తెలుస్తుంది.

'ఊ' అంది నాగమణి తలఆడిస్తూ. 'ఊ' అన్న శబ్దం పెదవిదాటి రాలేదుగాని తల ఆడించటంతో ఆదెమ్మ పక్కవాటాలోకి వెళ్ళిపోయింది.

ఆదెమ్మ మళ్ళీ వచ్చి పిలవలేదు. ఒక అయిదునిముషాలు అలా నిర్వ్యాపారంగా, శూన్యంలోకి చూస్తూ కూచుంది. ఆదెమ్మదగ్గరనుంచి పిలుపురాలేదు. కాని గిన్నెలూ – గరిటలూ గట్టిగా శబ్దాలు చేస్తున్నాయి. నాగమణి నిరుత్సాహంగా, బలవంతాన కుర్చీలోంచిలేచి పక్కవాటాలోకి నడిచింది – క్లినిక్ మెట్లు దిగుతూ ఆవరణలోకి చూసింది. ఎక్కడా జన సంచారంలేదు. తన ఆవరణలో ఒక్కమనిషీ లేడు. చెట్లమీద ఒక్కపిట్టా లేదు. ఒక్కఆకూ కదలటంలేదు. గాలికూడా చలనరహితంగా అయి పోయింది. ప్రకృతీ – ప్రాణులూ అన్నీ స్థంభించిపోయి నిశ్శబ్దంగా భయంకరంగా వుంది. నాగమణికి యీసారి నిజంగానే భయంవేసింది. ఈవూరువచ్చి పదేళ్ళు అవుతోంది. ఈపదేళ్ళలో యిలా వంటరిగా నిశ్శబ్దంగా ఎప్పుడూలేదు. ఈరోజు ఎందుకిలా వుంది? ఎందుకిలా జరిగింది? క్లినిక్‌కి తాళంపెట్టకుండానే తన వాటాలోకి నడిచింది. ముందు వరండాలోని గ్రిల్స్‌లోంచి లోపల ఎండపడకుండా ఆకుపచ్చతడికలు: ఆ తడికలని క్రిందకిలాగి వుంచింది ఆదెమ్మ. లోపల చల్లగా వుంది. ఇక్కడ యిలా కూచుండిపోతే? ఆదెమ్మ మళ్ళీ వచ్చి పిలుస్తుందా? పిలవకపోతే .... తను అన్నం తినదు. పెంకిగా, పట్టుదలగా ముందు వరండాలోని పేముకుర్చీలో కూలబడి, పేపరు తీసింది, చదువుతున్నట్లు నటిస్తూ.

'వడ్డించాను' తీవ్రంగా, పొడిగా, బిగ్గరగా వుంది ఆకేక.

'నేను రాను' అందామనుకుంది. అనలేకపోయింది. కుర్చీలోంచి లేచి డైనింగ్‌గదిలోకి దారితీసింది. డైనింగ్‌రూమ్‌లో గాడ్రెజ్‌టేబుల్‌మీద వైట్ ప్లాస్టిక్‌క్లాత్ పరిచి, దానిపైన ప్లేటూ గిన్నెలూ వుంచింది ఆదెమ్మ. అన్ని సామాన్లూ, చెమ్మా, మంచినీళ్ళూ - ఆఖరికి వుప్పుగిన్నెకూడా పక్కన వుంచింది. రోజూలాగా ఆదెమ్మ వడ్డించలేదు. అన్నీ టేబుల్‌మీద వుంచి వెళ్ళిపోయింది. వడ్డిస్తుందేమోనని ఒక రెండునిముషాలు ఎదురుచూసింది. ఆదెమ్మ వంటింట్లోంచి వచ్చేట్టులేదు. ఆదెమ్మకి తనమీద కోపం వచ్చిందా ? ఏంచేసిందని ? ఎందుకు వడ్డించలేదు ? అన్నం చల్లారిపోతుంది త్వరగా తిను అంటూ ఎందుకు కేకలెయ్యటంలేదు ?

'ఆదెమ్మా' పిల్చింది గట్టిగా.

జవాబులేదు. ఆదెమ్మ వంటింటిగుమ్మం వెనక నుల్చుంది. 'వడ్డించు, ఎందుకు వడ్డించటంలేదు. అన్నం పళ్ళెంలో పెట్టు' ఇలా ఎన్నో అందామనుకుంది అధికారపూర్వకంగా - ఆజ్ఞ యిద్దామనుకుంది... కాని, ఏమీ చెయ్యలేకపోయింది. పోనీ తినకుండా - బల్లదగ్గరనుంచి లేచి వెళ్ళిపోతే ! అప్పుడయినా ఆదెమ్మ 'ఎందుకు వెళ్ళిపోతున్నా'రని అడుగుతుందా ? చిన్నపిల్లలా తను ప్రవర్తించలేదు. కొద్దిగా అన్నం ప్లేట్లో వేసుకుని కాస్త సాంబారు వడ్డించుకుంది. ఆదెమ్మ గుమ్మానికి ఆనుకుని నుల్చుందిగాని, యిటు చూడటంలేదు.

'సమీర వూరినుంచి వచ్చిందా ?' అడిగింది నాగమణి.

'నాకు తెలియదు' తుంచినట్లుగా వుంది సమాధానం.

'ఎవరినైనా పంపి కనుక్కో.'

'ఎవరూలేరు.'

'ఎందుకులేరు ? ఎందుకు రాలేదు' అడిగింది నాగమణి, సంభాషణ అక్కడితో ఆగిపోకుండా - యింకా పొడిగించాలనే వుద్దేశ్యంతో.

కాని అటువైపునుంచి సమాధానంలేదు - నిశ్శబ్దంతప్ప, జవాబు రాలేదు.

సాంబారు కలుపుకుంటుంటే సమీర మళ్ళీ మళ్ళీ జ్ఞాపకానికి వస్తోంది. ఎందుకు రాలేదు? ఈరోజు తప్పకుండా వస్తానని చెప్పిందే! అసలు రాత్రి పన్నెండింటికే వస్తుంది అనుకుంది తను. ఈవూరు వచ్చి సమీర యిన్నిగంటలసేపు తనని చూడకుండా ఎప్పుడూ లేదు! వంట్లో బాగాలేదా? పిల్లవాడికిగాని సుస్తీ చేసిందా? వాళ్ళాయన వద్దన్నాడా? ఛ, ఛ అతను అలాంటివాడుకాదు. అసలు సమీరకంటేకూడా అభిమానంగా ఆప్యాయతగా వుంటాడు. ఎందుకు రాలేదు? రాజారావుగారు వద్దన్నారా? సమీరని తనదగ్గరకు వెళ్ళొద్దు అన్నారా? నిన్న వుదయంకూడా వచ్చారే - 'సమీర ఎంతరాత్రయినా వస్తుంది - వచ్చీ రాగానే మీదగ్గర కొస్తుంది - కార్లో వస్తున్నారు. టైము సరిగ్గా చెప్పలేను' అన్నారే; నిన్నకూడా ద్రాక్షపళ్ళు పట్టుకొచ్చి స్వయంగా తన చేతుల్లో బుట్ట అందించిన రాజారావుగారు - కూతురిని తనదగ్గరకు ఎందుకు వెళ్ళొద్దు అంటారు. సమీరకుకూడా తనమీద కోపం వచ్చిందా? తనేం చేసిందని? ఎందుకు అందరూ తనను ఏకాకిగా వదిలేశారు? - అని గట్టిగా అరిచి అడగాలని వుంది?

ఎవరిని అడుగుతుంది? కిటికీలనా? తలుపులనా? శిలలాగా నుల్చున్న ఆదెమ్మనా? కిచకిచలాడటంకూడా మర్చిపోయిన పక్షులనా? తీవ్రంగా కాసే యీ ఎండనా? ఎవరిని అడుగుతుంది? గట్టిగా అరిచి, కేకలేసి అడిగితే పిచ్చిపట్టింది అనుకుంటారు - ఇలా అయితే తనకి పిచ్చి పట్టటం ఖాయం. పనిలేక, మాట్లాడే మనుషులులేక, పేషంట్లులేక, తన ప్రశ్నలకి జవాబు చెప్పేవాళ్ళులేక, ఎలా వుంటుంది? గట్టిగా ఏడవాలని అనిపిస్తున్నది - బిగ్గరగా అరిచి 'మీరందరూ ఎందుకు నన్ను ఏకాకిగా వదిలేశారు?' అని వీధిగుమ్మంలో నుల్చుని అడగాలని వుంది. కాని, కాని ఎలా.... అరవాలన్న కోర్కెని బలవంతాన ఆపుకుంది. సాంబారు అన్నం

కూడా లోపలికీ పోలేదు. అలాగే పళ్ళెంలో చెయ్యికడుక్కుని లేచింది. పక్కనవున్న చిన్నటవల్‌తో చెయ్యి తుడుచుకుంటూ ముందు వరండాలోకి వచ్చి బయటకి చూసింది. ఒకవేళ ఎవరన్నా పేషంట్సు వచ్చారేమో అన్న ఆశతో...ఎవ్వరూలేరు. నిర్మానుష్యంగా వుంది బయట. క్లినిక్‌తలుపు తెరిచేవుంది. తాళంపెట్టి, లోపలికొచ్చి పడుకోనా ? ఉహూ, పడుకోదు. పడుకుంటే పిచ్చిపడుతుంది. ఆలోచనలు తనని నిలవనివ్వవు. క్లినిక్‌లో అలా వంటరిగా పిచ్చిదానిలా కూచోటమా ? ఏ మెడికల్ జర్నలో తిరగేస్తూ కూచుంటే సరి. ప్రాక్టీసులేని డాక్టర్లాగా క్లినిక్‌లో దుమ్ముదులుపుకుంటూ కూచోటమా ? పోనీ, దుమ్ముకూడాలేదే ! దులుపుదామంటే ! పొద్దుటే మరియమ్మ అద్దంలా తుడిచిపెట్టేసిందే ! ఏంచెయ్యటం ? ఎవరూ పేషంట్లు రాకపోతే పాతతుక్కు మాగజయిన్ అయినా చదువుతుందిగాని, యిలా యింట్లో పడుకుని తన వోటమిని వొప్పుకోదు. ఇంట్లో యీ ఆడెమ్మ తన వంక విజయగర్వంతో, నిర్లక్ష్యంతో చూస్తూవుంటే తను భరించలేదు.

నాగమణి క్లినిక్‌లోకి అడుగుపెట్టింది. ఇక్కడ ఆమెకి 'సేఫ్'గా కాస్త ధైర్యంగా వుంది. ఈ క్లినిక్, టేబుల్‌మీద మెడికల్‌సామాను ఆమె అస్తిత్వాన్నీ – వునికినీ దృఢపరిచి ధైర్యాన్ని యిస్తున్నాయి. ఇటు అటూ పచార్లు చేస్తున్నది. గోడమీద ఒకవైపు ఫామిలీప్లానింగ్‌వారి ఎర్ర త్రికోణపు కార్డు. 'ఇద్దరు పిల్లలు చాలు, సుఖసంసారానికి' అంటూ హెచ్చరిస్తున్నారు. పరిమిత కుటుంబం గురించి ఆ కార్డులో నవ్వుతున్న దంపతులు. ఆపక్కగానే గుండుగా నవ్వుతూవున్న పాపాయి కేలండరు. బేబీఫుడ్‌వారి కాలెండరు. యీ సమస్త ప్రపంచమూ నానవ్వులోనే యిమిడి వుంది – అన్న బోసినవ్వులతో మురిపించే ఆ కాలెండరులో పాపను చూస్తుంటే – యిలాంటి పాపాయిలని తను ఎంతమందిని యీ ప్రపంచంలోకి తీసుకొచ్చింది ? అన్న ఆలోచన వచ్చింది.

అవును, తను ఎన్ని డెలివరీలు చేసింది? జ్ఞాపకంలేదు. తనదగ్గర రిజిస్టర్ వుందిగా! డెలివరీ చేసిరాగానే రిజిస్టర్‌లో ఎంటర్ చేసుకునే అలవాటు తనకు హాస్పటల్ పోస్టింగ్స్‌నుంచి అలవాటయింది. హౌస్ సర్జెన్సీ చేస్తున్నపుడు .... నాగమణి తన ప్రమేయం లేకుండానే కుర్చీలో కూలబడిపోయింది. గడియారం ఠంగున ఒకటి కొట్టింది. ఒంటిగంటా? వాచీ చూసుకుంది. పన్నెండున్నర. టైము పన్నెండున్నర అయిందా? ఎంత అయితేఏం - యీరోజు టైముకీ, తనకీ, తన వృత్తికీ దేనికి విలువ లేదు - దేని అవసరమూలేదు. ఎందుకిలా అయింది. పదేళ్ళపాటు విపరీతమైన బిజీగావున్న తను యీరోజు ఎందుకిలా పనిలేకుండా కూచోవాల్సివచ్చింది?

సమీర ఎందుకు రాలేదు? కారు చెడిపోయిందా? అసలు బయలుదేరి వుండదా? యాక్సిడెంట్ అయిందా? ఛీ ఛీ - అలా ఎప్పటికీ జరగదు. హాయిగా గలగల నవ్వే సమీరవంటి అమ్మాయిలకి, జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కోగల సమీరకు ఎటువంటి ఆపదా రాదు. మరి తనని చూడటానికి ఎందుకు రాలేదు! పోనీ వాళ్ళనాన్నగారు రావచ్చుగా! ఆయనా రాలేదే! ఎందుకు రాలేదు? ఏంజరిగింది? ఏదైనా ప్రమాదం సంభవించిందా?

నాగమణి తన ఆలోచనలని అదుపులో పెట్టుకోటానికి ప్రయత్నిస్తున్నది. ఒక్కక్షణం తను పిరికిపడిపోయిందా; యిక తన ఆలోచనా ప్రవాహాన్ని ఆపలేదు. రకరకాల భయాలు. రకరకాల శంకలు తనని చుట్టబెడతాయి. ఉహూ, సమీరకి ఏమీ అయివుండదు. వూళ్ళో అందరిలాగానే సమీరకికూడా కోపంవచ్చి వుంటుంది. ఎందుకు కోపంవచ్చింది? తనేం తప్పు చేసింది? క్రితంరాత్రికూడా ఒకప్రాణిని యీ ప్రపంచంలోకి తీసుకొచ్చి పడేసిందే! ఆ కుటుంబీకుల ఆనందానికి, కృతజ్ఞతకీ కారణమయిందే! మరి, ఎంత ఆలోచించినా కళ్ళకు గంతలు కట్టుకున్న

ఎద్దులాగా గిరాగిరా తిరుగుతూ వుంది తన ఆలోచన. ఎన్నిసార్లు ఆలోచించినా యీరోజు ఒక్క పేషంటుగాని, స్టాఫ్‌గాని ఎందుకు రాలేదు - అన్న ప్రశ్నకు జవాబు దొరకటంలేదు.

తన జీవితంలో జవాబు దొరకని ప్రశ్నలు చాలా వున్నాయి? ఇంతకంటే జటిలమైన వాటికి, తను జవాబు చెప్పలేకపోయింది ః సుందర్ రాజన్ అలా ఎందుకు చేశాడు? అతను ఏ కారణంవల్ల అలా చెయ్యాల్సి వచ్చింది? మళ్ళీ ప్రశ్నలు. ప్రశ్నలు - జవాబులేని ప్రశ్న. కోటిసార్లు తనని తాను అడిగిన ప్రశ్న. నాగమణి గతంలోకి వెళ్ళిపోతున్నది. చుట్టూవున్న యీ చెట్లని, ఆకుకూడాకదలని యీ చెట్లకొమ్మలని ప్రశాంతంగా వున్న యీ ఆవరణని అన్నిటిని వదిలేసి పక్షిలాగా ఎగురుతూ పోతున్నది. ఎక్కడికి? ఆకాశంలోకా? స్వేచ్ఛకోసమా? ఉహూ, తను ఆకాశంలోకి ఎగరలేదు. స్వేచ్ఛ తనకి వొద్దు. వూపిరిసలపని కార్యభారం కావాలి. లేకపోతే తాను భూతకాలంలోకి ఎగిరిపోతుంది, రెక్కలు విరిగిన పక్షిలాగా గిలగిల తన్నుకుంటుంది తన మనసు - ప్రశ్నలతో.

తను ఎగురుతోంది. ఎక్కడికి? — మద్రాసులోని కపాలేశ్వరుని కొలనుమీదకి ఎగురుతోంది. హాయిగా పక్షిలాగా - స్వేచ్ఛగా, సంతోషంగా ఎగిరే మనసుతో సుందరరాజన్ యింటికెళ్ళింది తను. అతను ఆసుపత్రి వదిలి వెళ్తూ తనదగ్గర మాటతీసుకున్నాడు - రోజూ వచ్చి చూడాలని. మొదటిప్రయత్నంగా — ఆరోజు నాలుగింటికి బయలుదేరింది. ఆనాడు ఎండ అంత తీవ్రంగా లేదు. మబ్బుమబ్బుగా - చల్లగా గాలి వీస్తున్నది. ఆ గాలి విసురుకి తన పమిటచెంగు ఎగిరిపోతుంటే - నడుంచుట్టూ తిప్పి - దోపుకుంది. అతనిచ్చిన ఎడ్రస్ ప్రకారం ఈస్టు మాడో వీధిలో నెంబరు వెతుక్కుంటూ వెళ్ళింది. కపాలీశ్వరుని కోవెల శిఖరం - ఎత్తుగా - మబ్బుతునకల మధ్యనుంచి కనిపిస్తున్నది. కోవెలముందున్న కొలనులో అక్కడా అక్కడా నీళ్ళు. ఆ నీళ్ళమీద దట్టంగా అల్లుకున్న తామరాకులు—

ఎక్కడా పువ్వులు లేవు. స్టీలుసామాను కొట్లు, గాజుల కొట్లు, బట్టల కొట్లు, కోవెల ముందుభాగాన ఉన్న పూలకొట్లు. ఏదో కొత్త పరిసరాల్లోకి ప్రవేశించినట్లుగావుంది తనకి. పూలకొట్లలోని పూలమీద – నీళ్ళు జల్లి బట్టలు పరుస్తున్నారు. గులాబీదండలమీద నీళ్ళు చిలకరిస్తున్నాడు చిన్న పిల్లవాడు. ఆ నీటిచిలకరింపుతో – గులాబీల సౌరభం గాలిలో ప్రయాణించి నాగమణిని చుట్టబెట్టి – నిలబెట్టింది. 'అబ్బ ఎంత మంచి వాసన – ఇక్కడ ఎంత బాగుందో!' అనుకుంది తనలో తాను. ఆ వీధి దాటుకుని పక్క సందులోకి వెళ్ళమన్నారు – కాయితంమీద ఎడ్రసు కొట్టువాడికి చూపించి అడగ్గా. కుంకుమా, గాజులూ, లక్కపిడతలూ అమ్మే షాపు దాటుకుని, పక్కవీధిలోకి అడుగుపెట్టి – 'అబ్బా!–' అనుకుని – ముక్కు మూసుకుంది ఒక్కసారి. అతని మాటలు జ్ఞాపకంవచ్చాయి — ఆ వీధినిండా ఉచ్చలి మడుగులు – దేవాలయ ప్రాకారంనుంచి రోడ్డుమీదకి పారుతున్న మూత్రపు మడుగులు – అక్కడా అక్కడా మానవ పెంటలు — ఎక్కడ వాటిమీద కాలువేస్తానో అన్న భయంతో – ముక్కుమూసుకుని – ఎత్తెత్తి అడుగులు వేస్తూ – ఆ నెంబరు యింటిముందుకు జేరుకుంది.

ఇంటికి రెండుపైపులా చిన్న చిన్న అరుగులు. కర్రస్తంభాల మీద ఆనివున్న వసారా. ఆ వసారాకింద చిన్న అరుగులు. సింహద్వారం. ఒకేఒక్క తలుపు—దానినిండా నగిషీలు – మందిరాలు, బొమ్మలు, చిరు గంటలు, పొన్నచెట్లు, చిలకలు – ఇలా చిత్రవిచిత్రాలుగా చెక్కిన — ఒకేఒక్క వెడల్పాటి కర్రతలుపు. తలుపు మూసివుంది. తలుపు తట్టాలా? గొంతెత్తి పిలవాలా? అంతదాకావున్న ఉత్సాహం – ధైర్యం అడుగంటి పోయాయి. వాళ్ళు ఏమనుకుంటారో? సుందరరాజన్ తండ్రి ముఖం తిప్పుకుంటాడా? వాళ్ళకి అసలే తనమీద సదభిప్రాయంలేదు. తిరిగి వెళ్ళిపోతే! గిరుక్కున తిరిగి వెళ్ళిపోయే ప్రయత్నంలో వుంది నాగమణి.

సరిగా ఆక్షణంలోనే లోపలినుంచి ఎవరో తలుపు తెరిచారు. ఎవరై వుంటారు ? కుతూహలంగా నల్చుంది నాగమణి. ఆతలుపు తెరిచినవ్యక్తి సుందరరాజన్.

'మీకోసమే ఎదురుచూస్తున్నాను .... రండి – రండి' అంటూ సంతోషంతో, వుత్సాహంతో ఆహ్వానించాడు.

'మీరు' అంటున్నాడు. గమనించింది ఆ పిలుపులోని మన్ననని.

'ఈఇల్లు అవునో కాదో అని సందేహిస్తున్నాను' అంది ఏదో అనాలని.

'ఇందాకటినుంచి అరుగుమీదనే కూచున్నాను అమ్మ కాఫీకి రమ్మంటే లోపలి కెళ్ళాను. 'అమ్మా, డాక్టరుగా రొచ్చారు ఆవిడకుకూడా కాఫీ పట్రా' తల్లిని కేకేశాడు. తను పూర్తిడాక్టరుకాదు, అని జ్ఞాపకం చెయ్యబోయి, లాభంలేదు, చెప్పినా వీళ్ళు వినిపించుకోరని వూరుకుంది.

కూటంతోవున్న మండువాయిల్లు. వాలుగా, కిందుగావున్న మండువా· కర్ర స్తంభాలమీద ఆనివుంది. ప్రతి స్తంభంమీద రకరకాల నగిషీలు. ఎదురుగా పంపు. పక్కనే మరో చిన్నగది. దానిముందు నీళ్ళబక్కెట్లు – బహుశా బాత్ రూమ్ అయివుంటుంది అనుకుంది నాగమణి.

అతను చేతులున్న కర్రకుర్చీని ఒక స్తంభానికి ఆన్చి వేసి వుంచాడు. తన రాకకోసం కాబోలు.

'కూచోండి' అన్నాడు ఆ కుర్చీచూపుతూ. నల్లవిరుగుడు చేవకుర్చీ – చేతులకింద గిలకలు. అవి చేత్తో తిప్పుతే కిరకిర శబ్దం చేస్తున్నాయి. అల్లాంటిదే మరోకుర్చీమీద సుందరరాజన్ తమ్ముడు కూర్చుని చేత్తో విసురుగా ఆ గిలకలు తిప్పుతూ, వాటి సంగీతం విని ఆనందిస్తూ, తనవైపు దొంగచూపులు చూస్తున్నాడు అన్నగారికీ, తనకీ మధ్యనున్న స్నేహం గురించి కథలూ గాథలూ విన్నాడా ? ఎందుకలా చూస్తున్నాడు. నాగమణి అతన్నిచూసి నవ్వబోయి మళ్ళీ ఆగిపోయింది.

లోపలినుంచి సుందర్‌రాజన్ చెల్లెలు - ఆరోజు హాస్పటల్‌లో కనిపించిన అమ్మాయి - కాఫీగ్లాసుతో వచ్చింది. స్టీలుగిన్నెలో కాఫీగ్లాసు పెట్టి పట్టుకొచ్చింది.

'తాగే వచ్చాను' అంది నాగమణి మొహమాటంగా.

'ఫరవాలేదు, తీసుకోండి' అంది ఆ అమ్మాయి నెమ్మదిగా.

'ఎల్లా వుంది మీకాలు?' అడిగింది కాఫీగ్లాసుని వంగి నేలమీద పెడుతూ.

'నెప్పిచెయ్యలేదు. బాగానే నడవగలుగుతున్నాను.'

'ఏదీ చూపించండి' అతను మోకాలుదాకా పంచఎత్తి, కాలు ముందుకు జాచాడు. ఫ్రాక్చర్ అయినచోట చర్మంమీద తెల్లనిమచ్చ. అక్కడ నొక్కింది వేళ్ళతో. అతను చటుక్కున కాలు వెనక్కి లాక్కున్నాడు.

'నెప్పా?'

'కొద్దిగా' అన్నాడు.

'అందుచేతనే రెస్ట్ యిమ్మన్నారు. కాలిమీద బరువుమోపకండి. ఎక్కువ స్ట్రెయిన్ అవకండి.'

'ఇంట్లో కూర్చుంటే బోరుకొడుతోంది - కాలేజీకివెళ్తే....'

'లాభంలేదు. పదిహేనురోజులదాకా మీరు నడవటం - పరుగెత్తి బస్‌లు పట్టుకోటం చెయ్యకూడదు.'

'ఎల్లా?'

'ఎల్లా ఏమిటి - యింట్లోనే కూచోండి' అంది నాగమణి మందలింపుగా.

అతను యిబ్బందిగా - యిటూ అటూ చూశాడు - తమ్ముడు యింకా కుర్చీ గిలకలు గిరగిరా తిప్పుతూ శబ్దం చేస్తూనే వున్నాడు. ఆ పిల్లవాడి

వంక కోపంగా చూశాడు సుందరరాజన్. లోపలినుంచి అతని తల్లిరాలేదు. చెల్లెలు నిశ్శబ్దంగా కాఫీగ్లాసు పట్టుకెళ్ళిపోయింది.

హాస్పటల్‌లోవున్న స్వేచ్ఛా, స్నేహం యీ పరిసరాల్లోలేవు. ఇక్కడ కొత్తగా - యిబ్బందిగా వుంది. అతనికి ఏదో చెప్పాలన్న ఆతృత. ఆమెకి వినాలన్న వుత్సాహం. కాని యిద్దరికీ యిబ్బందిగా వుంది. లోపలనుంచి ఎవరూ రాలేదు. పక్కకుర్చీలోని తమ్ముడి కిచకిచ శబ్దాలూ ఆగలేదు. ఈలోపల వీధితలుపు తోసుకుని సుందరరాజన్ తండ్రి కృష్ణమాచార్యులు లోపలి కొచ్చాడు. ఆయన వంటిమీద చొక్కాలేదు. చేతులో సంచీ, పై పంచతో ముఖంమీద చెమట తుడుచుకుంటూ -

'డాక్టరమ్మగారా ?' ఆ పిలుపులో కొంచెం వెక్కిరింపు - వుదాసీనత.

'ఎలా వుందో చూద్దామని వచ్చాను.'

'వాడికేం - మహరాజులాగా వున్నాడు. అమ్మా, ఆ లారీవాళ్ళ కేసు ఎప్పు డవుతుంది ? ఒక అయిదువేలన్నా యిస్తారా ?' అడిగాడాయన.

'నాకు ఆ విషయాలు తెలియవండీ ?' అంది నాగమణి ఇబ్బందిగా.

'మీరుకూడా రాసివ్వండి, ఒక అయిదువేలదాకా మాకు ఖర్చయిందని, రేపు కోర్టులో.'

'అల్లాంటివి మేము యివ్వకూడదు. మాపని వైద్యం చెయ్యటం దాకానే' అంది నాగమణి.

ముళ్ళమీద కూచున్నట్లు వుంది. ఎందుకొచ్చానురా బాబూ అని అనుకుంటూ వుంది మనసులో.

'అమ్మాయ్, కాఫీ పంపమను....' కేకవేశాడు కృష్ణమాచార్యులు.

'ఆవిడ తాగారు నాన్నా' అన్నాడు సుందరరాజన్.

'నాకూ - ఎమేవ్ - కాఫీ' అంటూ మళ్ళీ కేకపెట్టాడు.

హాస్పటల్‌లో పిల్లిలాగా భయభయంగా చేతులు నలుపుకునే యీ మనిషి - యిక్కడ పులిలాగా గాండ్రుమంటున్నాడు. నాగమణికి ఆశ్చర్యంగా

వుంది ఈయింటి పద్ధతులు. తన తండ్రి ఎప్పుడూ యిలా గట్టిగా అరవడు. అసలు ఆయన కాఫీ పెట్టమని ఎవర్నడుగుతాడు - తనే పెట్టిస్తాడుగా!

'మీరు పెద్దడాక్టరుగార్కి చెప్పి - ఆ లారీవాళ్ళచేత త్వరగా డబ్బు యిప్పించే ఏర్పాటు చేయించండి. చాలా ఖర్చయిపోయింది - బీదవాళ్ళం. కోర్టుకేసూ అంటే చాలారోజులు పడుతుందిట' మళ్ళీ అదేపాట అందు కున్నాడు - కాఫీగ్లాసు కిందపెట్టి, అదేచేత్తో బొడ్లోని పొడుంకాయ చేతిలోకి తీసుకుంటూ.

నాగమణి జవాబు చెప్పటం అనవసరం అనుకుని కుర్చీలోంచి లేచింది వెళ్ళటానికి అని. సుందర్‌రాజన్ ఆమెవంక నిస్సహాయంగా, బాధగా చూస్తున్నాడు. ఆకళ్ళలో వేడికోలు. అప్పుడే వెళ్ళిపోతున్నారా అన్న ప్రశ్నలు - ఆతనికళ్ళు ప్రతిసారి ఆమెని కదిలిస్తూ వుంటాయి.

'వెళ్లొస్తాను. ఎలా వున్నారో చూసిపెడ్దామని వచ్చాను' సంజాయిషీ చెప్పుకుంటున్నట్లు మరోమారు అంది.

'ఏమేవ్ - డాక్టరమ్మ వెళ్ళిపోతోంది' మళ్ళీ కేకపెట్టాడు.

ఆమె వంటింటి గుమ్మంలోనే నుల్చుంది. గడపదాటి బయటకి రాలేదు. 'అంతా బాగున్నారా?' అడిగింది. తన వాళ్ళంతా ఆమెకేదో తెలిసినట్లు!

'వెళ్లొస్తాను' అంటూ బయటకి నడిచింది. అతను గుమ్మందాకా వచ్చాడు. నెమ్మదిగా నడుస్తూ వీధిఅరుగులదగ్గిర - ఒక్క-క్షణంసేపు నిల్చుంది. ఏదో చెప్పాలని, యిద్దరి ప్రయత్నం. మాటలు రాలేదు. అతను ఒక కవరు చేతిలోపెట్టాడు. ఏమిటది? అన్నట్లు ప్రశ్నార్ధకంగా చూసింది. ఆతనికళ్ళు - చిన్నగావుండే ఆకళ్ళు మొహమాటంగా నవ్వుతున్నాయి. మొదటిరోజున నిస్సహాయంగా, సైలెంట్‌గా బాధపడ్డాడేతప్ప - సహాయం అర్థించలేదు. అయితే యీరోజు తాము అపరిచితులుకారుగా - అందుకే వుత్తరం యిచ్చాడు. కవర్ హాండ్‌బాగ్‌లో పెట్టుకుని....

'రేపు ఆదివారం' అంది ఏదో అనాలని.

'అవును. మీరు హాస్పటల్‌కి రారుకదూ-'

'ఎల్లుండి' అంటూ వెనక్కి తిరిగి ఇంటితలుపువైపుకి చూశాడు ఎవరైనా వింటారేమో అన్నట్లు.

'సో.... వెళ్ళొస్తాను. కాలుకి స్ట్రెయిన్ యివ్వకండి. బి కేర్‌ఫుల్' అంటూ బయటకి నడిచింది.

ఈసారి వచ్చిన వీధినుంచిగాక, కపాలేశ్వరుని కోవెలనువైపునుంచి నడుచుకుని బస్‌స్టాప్‌కి చేరుకుంది - అప్పుడప్పుడే చీకట్లుపడబోతున్నాయి. కపాలేశ్వరుని కోవెలముందున్న కోనేటిగట్టున గుంపులు గుంపులుగా బ్రాహ్మణులు. కోనేటిగట్టుమీద, పిట్టగోడమీద సంచీలతో, పంగనామాలూ, విభూదిరేఖలు, పంచకట్లు, పిలకలు, నున్నగావున్న గుళ్ళు, ముడివేసుకున్న వసారా తలలు. ఇంతమంది బ్రాహ్మణులు ఇలా గుమిగూడటం నాగమణి ఎప్పుడూ చూడలేదు. సుందరరాజన్ ఆనాడు అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి.

'మీరెప్పుడైనా కపాలేశ్వరుని కోవెలకి వచ్చారా ?' అని ఆనాడు అతను అడిగాడు.

వచ్చాను. ఇప్పుడు చూస్తున్నాను అనుకుంది నాగమణి.

బస్‌స్టాప్‌కి చేరుకునేప్పటికి ఎలక్ట్రిక్‌లైట్లు వెలిగాయి. దూరాన్నించి కోవెలశిఖరంమీదనున్న 'ఓమ్' అన్న అక్షరం - దీపాలకాంతితో కన్పిస్తున్నది. ఆలయగోపురంచుట్టూ - పైనించి కిందదాకా ఎలక్ట్రిక్ బల్బులు - దీపాలు తోరణాలుతోరణాలుగా వేళ్ళాడుతున్నాయి. ఈ పరిసరాలు కొత్తగా, దీపాలకాంతిలో విచిత్రంగా వున్నాయి. పైన దేదీప్యమానంగా వెలుగుతున్న ఆలయగోపురం - క్రింద అసహ్యంగా మలమూత్రాదులతో నిండి, ఆలయప్రాకారాన్ని అంటిపెట్టుకున్న వీధులు.

తను ఎక్కాల్సిన బస్ రాలేదు. నాగమణి ఎలక్ట్రిక్ దీపం కింద నుల్చుని - బాగ్‌లోని కవరు తీసింది. లిప్తపాటు కవరు విప్పేముందు కవరులో ఏముంటుంది అన్నసందేహం. వుత్తరం - అతను తనకి రాసిన మొదటి వుత్తరం. ఏం రాసివుంటాడు ?

"నాహృదయమణీ ! .... "

ఉలిక్కిపడింది ఆ మొదటివాక్యం - ఆ సంబోధన చదివి...

" .... 'నువ్వు యీపూట వస్తావు. నాకోసం వస్తావు' అని నామనసు పదేపదే చెపుతోంది. ఎంతో ఉత్సాహంగా వచ్చిన నీకు మాయింట్లో ఎటువంటి స్వాగతం లభిస్తుందోకూడా నాకు తెలుసు. మావాళ్ళతరఫున నేను క్షమార్పణలు చెప్పుకుంటున్నాను. ఇది యిల్లుకాదు. బందిఖానా. ఎవరికీ మాట్లాడే స్వతంత్రంగాని, మనసులోని మాట చెప్పుకోగల స్వేచ్ఛగాని లేని చెరసాల - యీ యిల్లు. నువ్వు వచ్చినా - యిక్కడ నేను ఒక్కమాట మాట్లాడలేను. ఆవిషయం నాకు బాగా తెలుసు. కాని, నువ్వు రావాలి - రావాలి అని నా మనసు గోలపెడుతోంది - వస్తావు. కాని ఒక్కమాటకూడా మాట్లాడలేని అశక్తుడిని. రేపు - ఆదివారం లజ్‌లో గల నాగేశ్వరరావు పార్కుకి రా. అక్కడ చల్లగా, ప్రశాంతంగా వుంటుంది. నేను ఎల్లాగో అల్లా నాలుగున్నరకల్లా - అక్కడికి చేరుకుంటాను. రిక్షాలో వస్తాను - కాలుకి శ్రమలేకుండా. తప్పకుండా రా. నీతో మనసువిప్పి మాట్లాడక, నీపక్కన కూచుని కబుర్లు చెప్పక, నేను బతకలేను. నీకు దూరంగా వుండలేను. నాలుగున్నరికి తప్పక రా.

నీకోసం నిరంతరం ఎదురుచూసే
నీ సుందరరాజన్. "

నాగమణికి ఆ వుత్తరం చదువుతుంటే - కొత్తగా నూతన ప్రపంచంపు గవాక్షంముందు నిలబడినట్లుగా వుంది. తనకి ఇంతవరకు ఎవరూ వుత్తరాలు రాయలేదు. అందులోనూ మగపిల్లలెవరూ అసలు రాయలేదు. ఇది ప్రేమలేఖా ? అతను తనని ప్రేమిస్తున్నాడా ? తనుకూడా అతన్ని ప్రేమిస్తున్నదా ? ప్రేమఅంటే ఏమిటి ? దాని లక్షణాలు ఎలా వుంటాయి ? అన్నీ ప్రశ్నలే, అన్నీ సందేహాలే – ఒకటిమటుకు నిర్ధారణ అయిన సత్యం. అతన్ని చూడకంగా తను వుండలేదు. అతన్ని రోజూ చూడాలి. బస్‌వచ్చింది. నాగమణి బస్‌ఎక్కేసింది తోసుకుంటూ.

'నాన్నా' పళ్ళెంలో పెట్టిన కూరా అన్నం కెలుకుతూ పిల్చింది నాగమణి.

'ఏమిటమ్మా ?' నోట్లో పెట్టుకోబోతున్న ముద్ద అలానే పట్టుకుని అడిగాడు మొదలియార్.

'నాన్నా....నామీద కోప్పడవుగదా !' అడిగింది.

'దేనికి తల్లీ ... కారణం లేకుండా నేను ఎప్పుడయినా కోప్పడ్డానా?'

'లేదు. అందుకే భయంగా వుంది.'

'ఏంచేశావని – దేనికి భయపడుతున్నావ్ ?' అడిగాడు మొదలియార్. ఆయన కూతురిలో వస్తున్న మార్పుని గమనిస్తూనే వున్నారు. ఈమధ్య తన మణి - తన మణిగాకాక – దూరంగా, కొత్తదానిలాగా ప్రవర్తిస్తున్నది. ఏదో తనలోకంలో తాను వున్నట్లుగా - తక్కువ మాట్లాడుతోంది. పూర్వంలాగా అన్నిసంగతులూ తనకి చెప్పటంలేదు. డబ్బు ఖర్చు ఎక్కువవుతోంది, మధ్య – మధ్య పదీ, యిరవై కావాలని అడిగి తీసుకెళ్తోంది. మూడురోజులక్రితం వందరూపాయలు కావాలని అడిగి తీసుకెళ్ళి, 'అవసరం రాలేదు' అంటూ మళ్ళీ తెచ్చియిచ్చేసింది. ఒక్కోసారి 'మణీ, నువ్వేం చేస్తున్నావు ? ఎవరికోసం ఖర్చుచేస్తున్నావ్ ?' అని

అడగాలని అనిపించేది. జవాబు చెప్పకపోతే ! అబద్ధంచెప్పి తప్పించుకుంటే, నాయిష్టం అంటే - ఇలా రకరకాల ఆలోచనలు వచ్చేవి. ఆయన భార్య బ్రతికివున్న రోజుల్లో కూతురిని ప్రతి విషయంలో ఖండించవద్దనీ, నాగమణి ప్రతి కదలికనూ అనుమానాస్పదంగా చూడవద్దనీ వాదిస్తూ వుండేవాడు. కాని, యిప్పుడు ఆయనకికూడా నాగమణి గురించి అనేక అనుమానాలూ ప్రశ్నలూ వస్తున్నాయి. అయితే నోరుతెరిచి అడగలేకుండా వున్నాడు.

'నాన్నా - నేను ఎవరితోనన్నా స్నేహంచేస్తే మీకు కోపం వస్తుందా'

'అదేం ప్రశ్నమ్మా .... నీ స్నేహితులమీద నాకెందుకు కోపం వస్తుంది?' తిరిగి ప్రశ్నించాడు.

'అదికాదు నాన్నా - నేను ఎవరినేనా యిష్టపడతాననుకో....'

మొదలియార్ ఉలక్కిపడ్డాడు. నాగమణి సూటిగా చెప్పేస్తుందా ? ఏంచెపుతుంది ? జవాబుచెప్పకుండా ఉండిపోయాడు.

'నాన్నా...'

'వింటున్నాను'

'నాకు ఒకతను అంటే జాలికలుగుతోంది. అతనికి సహాయపడాలని అనిపిస్తున్నది.' మాటలకు తడుముకుంటున్నది.

'మీ హాస్పిటల్ పేషంటా ?

'అవును నాన్నా! ఇన్నాళ్ళనుంచి మీకు సూటిగా చెప్పలేకపోయాను. అబద్ధం చెప్పాను.'

'నువ్వు అబద్ధం కావాలని చెపలేదమ్మా. నిజంచెపితే నాకు కోపం వస్తుందని భయపడ్డావు.' అన్నాడు నిదానంగా.

తండ్రివంక కృతజ్ఞతతో చూసి 'నాన్నా ! నామీద కోపమా ?' అడిగింది నాగమణి.

'నువ్వేం చేశావని ? అతనెవరు - నువ్వేం సాయం చేయా లనుకుంటున్నావ్?' అడిగాడు మొదలియార్. ఆయన గుండెల్లో సముద్ర

ఘోష. తను యింత ప్రేమగా - శ్రద్ధగా ప్రాణంకంటే మిన్నగా పెంచిన యీ కూతురికి - చదువు, ఉద్యోగం - యీ రెండూ తృప్తినివ్వటంలేదు. ఇంకా ఏదో కావాలని ఆరాటపడుతోంది - దానికి 'స్నేహం' అని పేరు పెడుతోంది.

'నాన్నా, అతను చాలా మంచివాడు.'

అన్ని ప్రేమలూ యిలాగే మొదలవుతాయి. అందరి ప్రేమికులకి, ఎదుటివారు మంచివారులాగానే కనిపిస్తారు. అన్ని ప్రేమకథలూ యిలాగే ఆరంభమవుతాయి.

'మంచివాడుకాదని - నేను అన్నానా ?' ప్రశ్నించాడు మొదలియార్.

'వాళ్ళవాళ్ళు చదువుకోనివ్వటంలేదు. అతనికి ఎమ్. ఎ. చదవాలని చాలా పట్టుదలగా వుంది.'

'ఎందుకు చదువుకోనివ్వటంలేదు ? డబ్బులేకనా ?'

'డబ్బొక్కటే ముఖ్యకారణం కాదనుకుంటా ?'

'మరి ?'

'వాళ్ళకి నేనంటే యిష్టంలేదు.'

'అతను చదువుకోటానికీ - నీమీద యిష్టంలేకపోవడానికి సంబంధం ఏమిటి ?'

'అదికాదు నాన్నా, అతనికి మేనమామ కూతుర్ని చెయ్యాలని, పూజారిపని అప్పగించాలని.'

'వాళ్ళు బ్రాహ్మణులా ?' గభాలున అడిగాడు మొదలియార్.

'వాళ్ళు తరతరాలనుంచి గుళ్ళో అర్చకులుగా వున్నారుట. వాళ్ళ నాన్న పేరు కృష్ణమాచార్యులు. అతనిమీద తల్లితండ్రు లిద్దరికీ ప్రేమలేదు. మధ్యకొడుకు కొబట్టి యిద్దరికీ అక్కర్లేదు' అంది గభాలున.

'ఇవన్నీ ఎవరు చెప్పారు నీకు ? తల్లి తండ్రులకి పిల్లలమీద ప్రేమ వుండదని - పిల్లలు వాళ్ళకి అక్కరలేదని అనుకోటం చాలాపొరబాటు.'

'అల్లాకాదు నాన్నా, అమ్మకంటే - నువ్వు నామీద ఎక్కువప్రేమ చూపిస్తావు....'

'మణీ' ఎప్పుడూ లేంది గట్టిగా కోపంగా అరిచాడు మొదలియార్.

నాగమణి హడిలిపోయినట్లు - ఖంగారుగా చూసింది. కూతురుముఖం చూసి తను అల్లా అరిచివుండకూడదనుకుని....సర్దుకుని నిదానంగా చెప్పటం మొదలుపెట్టాడు.

'చూడు మణీ, ఇలాటి అభిప్రాయాలు ఎవరు చెప్పినా నమ్మకు. అమ్మ నాకంటే నిన్ను వెయ్యిరెట్లు ఎక్కువ ప్రేమించేది. ఎటొచ్చీ, కొందరికి ఆ ప్రేమ ఎలా చూపించాలో తెలియదు. కేకలేసి సరిదిద్దాలి అనుకున్నవాళ్ళంతా, ప్రేమించటంలేదు - తక్కువ ప్రేమిస్తున్నారు అనుకోటం తప్పు. మీరు చిన్నపిల్లలు. మీ మంచిచెడ్డలు మాకు తెలుసు. మీకంటే మాకే బాగా తెలుసు అనుకుంటాం, అలా అనుకుని, ఇలా చెయ్యి, అలా చెయ్యి, యీ మార్గాన పయనించు. అలా వెళ్ళకు - అంటాం. అంతమాత్రాన ప్రేమని ఎక్కువ తక్కువలు అని త్రాసులోవేసి తూచకూడదు.'

'అమ్మ గురించి అల్లా అన్నానని కోపం వచ్చిందా ? అమ్మ విసుక్కుని - కోపంచేసేది. నువ్వు ఎప్పుడూ ఏమీ అనవు. అందుకు చెప్పాను.'

'ఈరోజు - నువ్వు చెప్పిన విషయాలు నాకు నచ్చక - నిన్ను కేక లేస్తాను అనుకో - అతనితో నీకెందుకు, వాళ్ళగొడవలు వాళ్ళవి, నువ్వు కలిపించుకోకు. నీచదువు నువ్వు చూసుకో - అంటాను అనుకో. అప్పుడు నాకు నీమీద ప్రేమ లేదని అనుకుంటావా ? ప్రేమలేకపోబట్టి నిన్ను ఆజ్ఞలు పెడుతున్నాను అనుకుంటావా ?'

'ఛ, చ. అలా ఎప్పుడూ కాదు.'

'అంచేత మొదట నీ ఫ్రెండు ఆర్గ్యుమెంటు తప్పు. ఇదివర కోసారి భారతంలోని కథ గురించి నన్ను అడిగినపుడే అనుకున్నాను. నువ్వు వక్రమార్గాన ఆలోచిస్తున్నావని. ఇంతకీ అతను చదువుకోటానికి ఏమిటి సమస్య. కాలేజీలో చేరాడా ?'

'చేరాడు.'

'మరి ?'

'కాలు ఫ్రాక్చరయింది. పదిహేనురోజులు యింట్లో వుండాలి.'

'మంచిదే – చదువుకోవచ్చుగా.'

'కాని, కాని....'

'చెప్పు. నీమనసులో వుందేదో సూటిగా చెప్పు.'

'వాళ్ళ వాళ్ళకి అతను నాతో మాట్లాడటం, యింటికి రావటం యిష్టంలేదు.

'నువ్వు వాళ్ళింటి కెళ్ళావా ?'

'వెళ్ళాను'

'ఎన్నిసార్లు ?'

'ఈ సాయంత్రం వెళ్ళాను. హాస్పటల్లో చాలా చనువుగా మాట్లాడే వాళ్ళు. కాని ఈరోజు ఎలాగో వున్నారు.'

'ఎవరు అతనుకూడానా ?'

'ఉహూ, అతనుకాదు. అతను నన్ను చూడకుండా వుండలేడు. కాని వాళ్ళ అమ్మా నాన్నా ఒకమాదిరిగా వున్నారు.'

'అసలు నువ్వు వాళ్ళింటికి వెళ్ళటం తప్పు. అసలు ఎందుకెళ్ళావ్ ? వాళ్ళు రమ్మన్నారా ?' తీవ్రంగా వుంది తండ్రి కంఠం.

'అతను రమ్మన్నాడు.'

'నువ్వు చదువుకున్నదానివి, ఆడపిల్లవి, పెళ్ళికానిదానివి. అలా వెళ్ళం తప్పనిపించలేదా ?'

'బయలుదేరేప్పుడు యివ్వేమీ తోచలేదు. అక్కడికి వెళ్ళాక యిబ్బందిగా ఫీలయ్యాను.'

'ఇకనుంచి వెళ్ళకు.' అన్నాడు మొదలియార్ ఫైనల్‌తీర్పు యిచ్చేసినట్లు.

నాగమణి తలఎత్తలేదు. తండ్రి యిలా ఖచ్చితంగా అనేస్తాడని వూహించలేకపోయింది. ఎదురుచూడని ఆయన తీర్పుకి తెల్లబోయింది. తండ్రి సుందర్‌రాజన్‌ని యికమీదట కలుసుకోవద్దు అంటున్నాడు. ఎలా ? అతన్ని చూడకండా ఎలా ?

'నాన్నా' అంది బెరుగ్గా.

'ఊఁ, చెప్పు' అన్నాడు. ఆ కంఠం కరకుగా వుంది.

'నేను వాళ్ళింటికి వెళ్ళను.'

'మంచిది - అలా మాటకు కట్టుబడి వుండు. నువ్వు యీ చిన్న చిన్న ప్రలోభాల్ని జయించాలమ్మా - ఇంకో సంవత్సరంలో డాక్టరయి పోతావు. హాయిగా మంచి వుద్యోగం చేసుకుంటూ, నీకు నచ్చినవాడిని పెళ్ళి చేసుకోవచ్చు.'

నాగమణికి తండ్రి మాటలు బుర్రలోకి జొరబడటంలేదు. అతని వుత్తరం - బాగ్‌లోని అతని వుత్తరం గురించి తండ్రికి చెప్పాలా, వద్దా ? చెపితే వెళ్ళొద్దంటాడేమో ?

'రేపు సాయంత్రం అతన్ని కలుసుకోబోతున్నాను. చాలా సంగతులు చెప్పాలి, రమ్మని రాశాడు.'

'ఎక్కడ కలుసుకుంటారు ? పార్కుల్లోనా - బీచివొడ్డునా ? ఎక్కడికి రమ్మన్నాడు' ఆయన కంఠం తీవ్రంగా, తీక్షణంగా వుంది.

'నాగేశ్వర్రావుపార్కుకి రమ్మన్నాడు. అక్కడ మాట్లాడుకుంటాం - నేను వెడుతున్నాను' అంది నాగమణి దృఢంగా. అంత ధైర్యంగా ఏనాడూ తన అభిప్రాయాలని వెళ్ళడించలేదు నాగమణి. ఆమాటలు అన్నతరువాత

తండ్రి ముఖంలోకి చూసే ధైర్యంలేకపోయింది. పళ్ళెంలో చెయ్యి కడుక్కుని లేచి వెళ్ళిపోయింది. టేబుల్‌లాంప్ స్విచ్ ఆన్‌చేసి ఎనాటమీ బుక్ తెరిచింది ... అక్షరాలు కనపడటంలేదు. వరసలూ కనపడటంలేదు. తండ్రి తనవెనక గదిలోకి వస్తాడా? వచ్చి ఈవిషయం యింకా సాగదీస్తాడా? వాదా ప్రతివాదాలూ, ఘర్షణా సాగుతాయా? తండ్రిని ఎలా ఎదిరించగలుగుతోంది? ఆయన మాటలని కాదనేశక్తి తనకి ఎక్కడి నుంచి వస్తోంది? తనకి యింత ధైర్యం ఎలా వచ్చింది? బయలుదేరు తుంటే - అతను వుత్తరం అందిస్తూ చూసిన చూపు ఆ కళ్ళలోని మొహమాటం, వేడికోలు మర్చిపోలేకుండా వుంది. అతన్ని తను వదల లేదు. అతనికి తను సాయంచేస్తుంది - అతనితో స్నేహం పొడిగించుకుంటూ పోతుందేతప్ప తండ్రి చెప్పినట్లు తుంచివేచి దూరానికి వెళ్ళిపోదు.

మరునాడు వుదయం లేచినప్పటినుంచీ నాగమణికి భయంగానూ, సిగ్గుగానూ వుంది. ఆరోజు ఆదివారం. అంచేత తప్పనిసరిగా యింట్లోనే వుండిపోవాల్సి వచ్చింది. తండ్రితో ఒక్కమాట మాట్లాడలేకపోయింది. ఏదోతప్పు చేస్తున్నట్లుగా అనిపిస్తోంది ఒకక్షణంలో - మరుక్షణంలో 'నేనేం చేశాను. వున్ననిజం చెప్పేశానుగా' అని తనకు తాను ధైర్యం చెప్పుకుం టున్నది. తండ్రి చాలా ముభావంగా వున్నాడు. కాఫీ తాగేసి, తన చీరెలు రెండు వుతుక్కుని గంజిపెట్టుకు ఆరేసింది. తలకి చమురుపెట్టుకుని, తల రుద్దుకు స్నానంచేసింది. తన రూములోని అల్మారా దులిపి, పుస్తకాలన్నీ మళ్ళీ సర్దింది. అయినా పన్నెండు అవలేదు. తండ్రి తనని 'వెళ్ళద్దు' అని కేకలేస్తే - ఎట్లా ఆయనని కన్విన్స్ చెయ్యాలో - మనసులో తగిన ఆర్గ్యుమెంట్స్ సిద్ధంచేసి వుంచుకుంది. కాని ఆయన ఏమీ అడగలేదు.

మొదలియార్ ఒకరకమైన నిస్సహాయ పరిస్థితిలో యిరుక్కుని వున్నాడు. కూతురు యిలా ఎవరో అబ్బాయిపట్ల ఆకర్షణ పెంచుకోటం యిష్టంలేదు. ఇది ఏపరిస్థితులకి దారితీస్తుందోనని భయంగా వుంది. కాని,

వయసులోవున్న పిల్లలు ఆడవాళ్ళయినా మగవారయినా యీమాదిరి ఆకర్షణలకి లోనవటం సహజం. దాన్ని ఎవరూ ఆపలేరు. ఈ సమయంలో తను కేకలేసి, భయపెట్టి కూతురిని తనదారికి తీసుకురాలేనని, యీ పరిస్థితుల్లో తన భార్యలాగా కఠినంగా ప్రవర్తించలేనని ఆయనకి తెలుస్తోంది. ఎప్పుడూ లేదుగాని, యీ మూడేళ్ళకాలంలోకంటే, యీరోజున ఆయనని భార్య మరణం, ఆమె లేనిలోటు, ఆమె దూరదృష్టి పదే పదే జ్ఞాపకం వచ్చింది. 'ఏవయసులో ముచ్చట ఆవయసులో జరగాలి' అన్న ఆమె మాటలు నిజమేమో! మణికి పెళ్ళిచేసివుంటే యీ సమస్య వచ్చి వుండేదికాదు. ఈబాధ్యత తన నెత్తిన పడివుండేదికాదు. మణికికూడా పెళ్ళి చేసుకోవాలని వుంటుందనీ, దానికికూడా తోడు కావాలనీ, ప్రేమించే హృదయం వుంటుందనీ తనకి ఎందుకు తట్టలేదు? చదువుకుంటే అన్ని సమస్యలూ తీరిపోతాయి, చదువుతప్ప మనిషికి యింకేమీ అక్కరలేదు - అని తను అనుకున్నాడు. ఆడదానికైనా, మగవాడికైనా చదువు ఒక్కటే చాలదు. చదువు విజ్ఞానాన్ని యివ్వొచ్చు. చదువువల్ల పెద్దపొజిషన్ లభించవచ్చు, గొప్ప డాక్టరవవచ్చు - కాని యివికాక యింకా కావాలి. వీటితోనే మనిషి తృప్తిపడి వూరుకోడు. మొదలియార్ తనగురించి తాను కూడా ఆలోచించుకోటం మొదలుపెట్టాడు. తనకి యిరవై ఏళ్ళకి పెద్దలు పెళ్ళిచేశారు. పెళ్ళినాటికి తన భార్యకి పదమూడేళ్ళు. పెళ్ళయిన ఆరు నెలలకి ఆమెను తను కాపరానికి తీసుకొచ్చాడు. కొట్టునుంచి యింటి కొచ్చేప్పటికి సాయంత్రాలు తనకోసం భార్య కనిపెట్టుకువుంటుందని, ఎంత వుత్సాహంగా వచ్చేవాడు! పెద్దలచాటు కాపరం అయినా - తమ చిన్నగది, తమ ఏకాంతం యివి తనకి వుత్సాహాన్ని, తెలియని ఒకరకమైన ఆత్మ ధైర్యాన్ని యిచ్చేవి. భార్య, అత్తపోరు, మామగారి కట్టుబాట్లూ నేరాలుగా ప్రతిరోజూ చెప్పినా, ఆమె అలా చెప్పుకోటంలో - తను వోదార్చటంలో ఎంతో తృప్తి వుండేది. ఆమెకి తనుగాక, మరెవరున్నారు - తాము ఒకరి

కొకరం అని, యిద్దరం శరీరాలు వేరయినా, మనసులు ఒకటని, మనసులో మాట చెప్పుకునే తోడు నీడ దొరికిందనీ యిద్దరూ అనుకునేవారు.

ఇప్పుడు మణికి యిరవై రెండో ఏడు. ఈ వయసులో మణికిమటుకు అటువంటి ఆలోచనలు రావా ? తండ్రిగా తను ప్రేమించవచ్చు. అన్ని సౌకర్యాలూ సమకూర్చవచ్చు. చదువు చెప్పించవచ్చు. కాని ఆ వికసించే హృదయంలోని ఆరాటం తను ఎలా తీర్చగలడు ? వయసులోవున్న ఆమె హృదయం – మరో యువక హృదయాన్ని కోరుతున్నది కాబోలు. మరో వ్యక్తి సాన్నిహిత్యాన్ని అభిలషిస్తున్నది కాబోలు. మొదలియార్ వులిక్కి-పడ్డాడు. మరోవ్యక్తి సాన్నిహిత్యాన్ని కోరుతోంది అంటే....యీస్నేహం ఎంతదూరం వెళ్ళింది ? ఇది ఒక్క- ఆకర్షణేనా ? మణి తప్పటడుగు వెయ్యలేదుకద ! ఛ, ఛ. తను అప్పు తన భార్యలాగానే ఆలోచిస్తున్నాడు. కాలు ప్రాక్చరయి పక్క-మీదవున్న, ఆ పిల్లవాడి గురించి యిలా ఆలోచించటం న్యాయంకాదు. ఇది కేవలం జాలిమటుకు అయివుంటుంది. ఈపరిస్థితిలో మణిని వెళ్లొద్దు అని వత్తిడి తీసుకురాడు. తను 'వద్దు' అని బలవంతాన ఆపుతే, తప్పకుండా దొంగతనంగా, చెప్పండా కలుసుకోవచ్చు. అలాటిస్థితి రాకుండా వుంటం మంచిది. మధ్యాహ్నం మూడుగంటలదాకా తండ్రీకూతుళ్ళు యిద్దరూ లోలోన మధనపడుతూనే వున్నారు. మూడింటికి నాగమణి కాఫీ తాగి మొహంకడుక్కు-ని, ఇస్త్రీచీరె కట్టుకుని, వెళ్ళటానికి తయారయింది. ఆమె బాగ్‌లో పన్నెండురూపాయలు వున్నాయి. అంచేత బస్‌ఖర్చులకి అడగక్క-ర్లేదు. చెప్పులు వేసుకుని, వెళ్లొస్తాను నాన్నా – చీకటిపడకుండా వచ్చేస్తాను' అంటూ చెప్పి – బయటకి వెళ్తున్న కూతురిని చూస్తే, మొదలయార్‌కి కోపంవచ్చింది. మణి తనని ఎదిరించి, తనమాట లెక్క-చెయ్యకుండా వెళ్తోంది – అని తాత్కా-లికంగా మనసులో ముల్లు గుచ్చుకున్నా తనని తాను కంట్రోల్ చేసుకుని పర్సులోంచి పదిరూపాయలు తీసి కూతురికి యివ్వబోయాడు. నాగమణి కొంచెం తడబడింది. తను

చేస్తున్నపనికి తానే సిగ్గుపడింది. ఇంత మంచినాన్నని, తనగురించి యింత ఆలోచించే తండ్రి వెళ్లొద్దు అన్నపుడు – వినకుండా వెళ్తోంది. మనసులో 'గిల్టీ'గా వుంది – 'నాన్నా' అంటూ గుమ్మంలో చెప్పులు విడిచి వెనక్కి వచ్చి, గట్టిగా తండ్రిని వాటేసుకుని చిన్నపిల్లలాగా ఆయనగుండెలమీద తలదాచుకుంది. బాల్యంలోనేకాదు, తండ్రిమీద అమితమైన ప్రేమ గలిగినపుడు నాగమణి యిలాగే గుండెలమీద తలపెట్టుకు గారాలుపోతుంది.

'నాన్నా, నీకు కోపం తెప్పిస్తున్నానుకదూ – కష్టం కలిగిస్తున్నాను కదూ.'

'అన్నీ తెలిసే ఎందుకు చేస్తున్నావమ్మా ?' అడిగాడు ప్రేమగా.

'నాకు వెళ్ళాలని వుంది. అతన్ని చూడాలని' వుంది.

'అయితే వెళ్ళు. కాని తొందరపడి ఏ నిర్ణయమూ తీసుకోనని మాటివ్వు.'

'అదేమిటి నాన్నా – నేనెందుకు నిర్ణయం తీసుకోవలసివస్తుంది ?' ప్రశ్నించింది.

'కూతురు నిజంగా అమాయకంగా అడుగుతోందా ః లి ప్తపాటు సందేహం. 'నువ్వు చిన్నపిల్లవి. వుద్రేకంలోపడి ఏమీ చెయ్యనని మాటివ్వు. అతనేం మాట్లాడాడో నాతో దాచకుండా చెపుతావా ?' అడిగాడు మొదలియార్.

నాగమణికి యిబ్బందిగా వుంది. అతనేం మాట్లాడుతాడు ? తామిద్దరూ ఎన్నో విషయాలు మాట్లాడుకుంటూ వుంటారు. తనచేతిని అనేకసార్లు అతను తన చేతులోకి తీసుకున్నాడు. గడ్డం నీకోసం గీసుకున్నానన్నాడు. నిన్ను చూడనిదే వుండలేనంటున్నాడు. నువ్వులేనిదే నాకు బ్రతుకు లేదంటున్నాడు – ఇవన్నీ తండ్రికి ఎలా చెప్పటం ? అసలు అతను మాట్లాడినమాటలు, తమ కబుర్లు, తరువాత చాలామటుకు జ్ఞాపకం

వుండవు. అతను మాట్లాడుతున్నంతసేపు. సరదాగా యింకా, యింకా వినాలని వుంటుందితప్ప ఏమి మాట్లాడేడో అన్నది జ్ఞాపకం వుండదు.

'మీకబుర్లు కాదమ్మా – అతను నిన్ను ఏదేనా నిర్ణయం తీసుకో మంటే. తనతో నిన్ను వచ్చెయ్యమంటే....'

'అదేమిటి నాన్నా, ఆయనకే వుంటానికిలేదు. నన్నెందుకు రమ్మంటాడు.'

'పోనీలే. ఏదోఒకటి. నాకు చెప్పకుండా ఏనిర్ణయం తీసుకోవుగా.'

'తీసుకోను. అసలు అతని కాలు కాస్త బాగుపడ్డాక, మనింటికి పిలుద్దామనుకుంటున్నాను. నువ్వు అతన్ని లైక్‌చేస్తావు, నాన్నా. చాలా మంచివాడు. ఒకటే మొహమాటం' అంది వుత్సాహంగా నాగమణి.

మొదలియార్ వోడిపోయినట్లు మొహంపెట్టి, 'సరేలే, నువ్వు వెళ్ళిరా. ఇలా పార్కులకి బీచికి వచ్చి కలుసుకోటం – మానాన్నకి యిష్టం వుండదని చెప్పు' అన్నాడు.

'చెపుతాను' అంటూ బయలుదేరింది నాగమణి.

ఆమె లజ్‌లో దిగి నాగేశ్వరరావుపార్కుకి వెళ్ళేసరికి అతను యింకా రాలేదు. పార్కుగేటుదగ్గర అతను కనిపించకపోయేప్పటికి లోపలి కెళ్ళి ఒక్క రౌండ్ తిరిగొచ్చింది. పచ్చగావున్న ఆపార్కుగాని, విరగ బూసి, గర్వంగా తలలూగిస్తున్న రంగురంగుల మెట్టతామరలుగాని నాగమణి దృష్టిని ఆకట్టుకోలేకపోయాయి. ఆకుపచ్చగా, మందంగావున్న హెడ్జ్ – ఆహెడ్జ్‌ని ఆనుకునివున్న బోగన్‌విల్లా, లేడిపామర్లు నాగమణిని పల్కరించి పక్కున నవ్వాయి తమరంగులు వొలకబోస్తూ. అయితే నాగమణి వాటి నవ్వులని చూడలేదు. ఆ పూలబాసలు ఆమెకి చెవుల్లో జొరలేదు. ఆ పుష్పసౌందర్యం ఆమె కంటికి కనిపించలేదు. వాటి సౌరభం ఆమె నాసికకు జొరలేదు. ఈ పూలసౌందర్యంపట్ల బధిరాంధురా లయింది. ఆమెకళ్ళు, ఆమె హృదయం ఒకే ఒక్క ప్రాణికోసం ఆత్రంగా ఎదురు

చూస్తున్నాయి. పార్కు-గేటుముందు, వేరుశనక్కాయలబండీ పక్కగా నుల్చుని అతనికోసం ఎదురుచూస్తూ వుంది. శనక్కాయలవాడు విసుగ్గా కోపంగా చూస్తున్నాడు ప్రింటెడ్‌చీరె కట్టుకున్న యీ యువతివంక. ఈవిడ అక్కడ నుల్చోటంవల్ల అతనికి నష్టంతప్ప లాభంకలగదు. పిల్లలయితే వేరుశనక్కాయలు కొనుక్కుని తింటారు. పెద్దలూ కొందరు పొట్లాలు కొనుక్కుని తింటూ పోతారుగాని యీ అమ్మాయి అల్లా కొనేట్లు లేదు. నాగరికంగా, చదువుకున్నదానిలా వుంది. ఇలాంటివాళ్ళవల్ల తన బిజినెస్‌కు లాభించదు. అయిదునిముషాలపాటు అయిస్‌ఫ్రూట్ బండివాడు, వేరుశనక్కాయలవాడు ఆమెని మార్చిమార్చి చూడగా, ఆఖరికి సైకిల్ రిక్షాలోంచి నెమ్మదిగా, నిదానంగా దిగాడు సుందర్‌రాజన్. అతన్ని చూసేవేళకి ఆమె ముఖం వెయ్యికాండిల్ బల్బులాగా దేదీప్యమానంగా వెలిగిపోయింది. గబగబా ముందుకెళ్ళి చెయ్యి అందించబోయింది. అతను ఆమె చేతిని అందుకోలేదు. మొహమాటంగా యిటూఅటూ చూశాడు. రిక్షా పైటాపు ఆసరాగా పుచ్చుకు నెమ్మదిగా పేవ్‌మెంటుమీద కాలుఅన్చాడు.

'ఇంతసేపయిందేం?' అడిగింది.

'రిక్షాదొరకలేదు. అయిదురూపాయలు అడిగాడు. బేరంచెయ్యగా మూడురూపాయల కొచ్చాడు' అన్నాడతను.

నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ నడుస్తున్నాడు.

'కాలు నెప్పిగావుందా?'

'లేదు. కాని జాగ్రత్తగా నడవమన్నావుగా. మళ్ళీ ఏదన్నా అవుతే, మంచంమీద పడాల్సివస్తుందని నిదానంగా నడుస్తున్నాను' అన్నాడతను. అతను ప్రతిదీ జాగ్రత్తగా, నిదానంగా ఆలోచిస్తాడు. తనకి అటువంటి ఓర్పులేదు.

ఈ సిమెంట్ బెంచీమీద కూచుందాం. అటువైపయితే పిల్లలూవాళ్ళూ ఒకటే రొదగా వుంటుంది.' అన్నాడు ఎడంవైపునున్న లాన్‌లోకి దారి తీస్తూ.

'ఇక్కడ లైటులేదు. చీకటిపడితే....కష్టం.'

'మరీ మంచిది. చీకట్లో అయితే ఎవరికీ కనిపించము – డిస్టర్‌బెన్స్ లేకుండా మాట్లాడుకోవచ్చు' అంటూ ఆమెచెయ్యి పట్టుకు బెంచీమీద కూచో పెట్టాడు.

'నేను వెళ్ళాక మీవాళ్ళు ఏమైనా అన్నారా ?' అడిగింది నాగమణి. అతను జవాబు చెప్పలేదు.

'ఏంజరిగింది ?' మళ్ళీ అడిగింది.

'జరగటానికి ఏమీలేదు. మా తమ్ముడు నీకు వుత్తరం యివ్వటం చూశాడు. మా అమ్మకి చెప్పేడు. నీకేదో ప్రేమలేఖ రాశానని.'

'తరువాత ?'

'మళ్ళీ మామూలే. మా మామయ్యని త్వరగా రమ్మని, నాకు ఎంత త్వరగా పెళ్ళిచేస్తే అంత మంచిదనీ నిర్ణయించారు.'

'మీరో ?'

'నేను వాళ్ళు ఎన్ని అనుకున్నా బదులు చెప్పదలచుకోలేదు. నన్ను కాదు అన్నట్లు వూరుకున్నాను. మణీ, నన్నేం చెయ్యమంటావ్ ? చెప్పు, నాకేదన్నా దారిచూపించు ?' అడిగాడు ఆమె చేతిని తన రెండుచేతుల్లోనూ యిముడ్చుకుని, ఆమె దేహంలోని శక్తినంతా పోగుచేసుకుని, అది తన శరీరంలోకి పీల్చుకుంటున్నట్లు.

'రాత్రి మీనాన్న తగాదా పెట్టుకున్నారా ?'

'ఆయన అరుస్తూనే వున్నాడు. కులంగాని పిల్లని కట్టుకుని కొంప ముంచుతానని భయపడుతూనే వున్నాడుట. అమ్మా, నాన్నా చాలాసేపు మాట్లాడుతూనే వున్నారు.'

'ఇంతకీ మీవుద్దేశ్యం–' అడిగింది నాగమణి.

'నేను ఆపరిసరాల్లో వుండలేను. నిన్న చూశావుగా. అలా కూచుని వుండాలి – యింటి కప్పుకేసి చూస్తూ! నాన్న ఆ యింగువసంచీ పుచ్చుకుని, ముక్కుపొడి పీలుస్తూ – డబ్బూ డబ్బూ అంటూ, ఎప్పుడు డబ్బు గురించి తప్ప యింకోటి మాట్లాడడు.

'మనంమటుకు డబ్బు గురించి ఆలోచించవద్దా?' అడిగింది నాగమణి.

'కాదనను. ఈ రిక్షాలో రావటానికి నేను ఎంత నాటకం ఆడాల్సి వచ్చిందో తెలుసా? కొలనుగట్టుదాకా నెమ్మదిగా నడిచి, అక్కడ రిక్షా ఎక్కాను – యింట్లో ఎవరూ చూడకుండా. మూడురూపాయలే అంటూ గుండెలు బాదుకుంటాడు నాన్న చూస్తే. డబ్బుతప్ప యింక ఏవిలువలూ లేవు ఆయింట్లో.'

నాగమణికి అతన్ని చూస్తే జాలిగా వుంది. తమకీ డబ్బులేదు. అయితే తమకి డబ్బే ప్రాణంకాదు. కాని ఈతని యింట్లో డబ్బుకితప్ప దేనికీ విలువలేదా?

'ఏంచేద్దామంటారు? ముందు ఎం. ఎ. పూర్తిచెయ్యొద్దా?'

'చెయ్యాలి. కాని నిన్ను చూడకండా నేను వుండలేను. నీతో మాట్లాడకుండా వుంటం నాచేతకాదు.'

'ఎల్లా?'

'మనం రోజూ ఎక్కడో ఒకచోట కలుసుకోవాలి .... రోజుకి ఒక్కసారన్నా నిన్ను చూడాలి. నీతో మాట్లాడాలి.'

నాగమణి మాట్లాడలేదు. తండ్రికి యిచ్చిన మాట జ్ఞాపకం వచ్చింది. తండ్రికి చెప్పకుండా తను ఎటువంటి నిర్ణయం తీసుకోదు.

'మణీ, మాట్లాడవేం? ఎలా మనం కలుసుకోటం. నాకోదారి చూపించు.'

'మీయింటికి నేను రావటం సాధ్యంకాదు. నిన్న వచ్చినందుకే సిగ్గుపడి చచ్చిపోయాను.'

'మణీ, నన్ను క్షమించు. మావాళ్ళు చేసిన పనికి నేను క్షమార్పణ చెప్పుకుంటున్నాను - యిలా రోజూ యీ పార్కులో కలుసుకుందాం. నువ్వు మాయింటికి రావద్దు.'

'ఉహూ' అంది నాగమణి.

'ఎందుకని ? నాకంటే నీకు స్వేచ్ఛ వుంది. మీనాన్న ఏమీ అనరుగా.'

'అనకపోవచ్చు. నాకు యిలా పార్కుల్లో, బీచీల్లో కలుసుకోటం యిష్టంగాలేదు. అదేదో తప్పుపని చేస్తున్నట్లనిపిస్తోంది. అదీగాక మానాన్న యిలా బయట కలుసుకోటం బాగుండదన్నారు.'

'మన గురించి మీనాన్నకి చెప్పావా ? ఏంచెప్పావ్ ?'

'మీరంటే నాకు యిష్టం అని చెప్పాను. మీయింట్లోవాళ్ళకి నారాక యిష్టంలేదని చెప్పాను. నేను ఏమీ దాచలేదు. మీవుత్తరంకూడా....'

'నావుత్తరంకూడా చూపించావా ?'

'ఛీ, ఛీ. అల్లా ఎల్లా చూపిస్తాను ? కాని ఈపార్కుకి రమ్మని రాశారని చెప్పాను.'

'వెళ్ళొద్దు అనలేదా ?'

'మానాన్న అలా అనేమనిషి కాదు. నాకు మాట్లాడాలని వుంది, చూడాలని వుంది, వెళ్తాను - అన్నాను. ఈరోజు వెళ్ళుగాని, అలా పార్కుల్లో, బీచిలో కలుసుకోటం మంచిదికాదు. కావాలంటే మనింటికి రమ్మను అన్నారు.'

'కాని... బస్సుల్లో ఎక్కి యీకాల్తో నేను అంతదూరం రాలేనుగా.'

'అందుకే మీకాలు నయమయేదాకా మనం కలుసుకోవద్దు. ఆ ప్రయత్నం చెయ్యొద్దు.'

'మణీ....మణీ....ఇది నీకు న్యాయంగా వుందా ? నువ్వు లేకుండా నేను ఎలా బతకను ? ఆయింట్లో మావాళ్ళమధ్య ఎలా ?' అడుగుతున్నా డతను తన రెండుచేతులూ పట్టుకుని.

ఆక్షణాన నాగమణి మానసికంగా చాలా ఎదిగింది. మనోధైర్యమూ పుంజుకుంది.

'మనం ఒకరి నొకరం చూసుకుని, మన పరిచయం అయి, ఎన్నాళ్ళయింది?'

'ఆరువారాలు' అన్నాడతను.

'ఒక్క ఆరువారాల పరిచయంతో నన్ను విడిచి బతకలే ననుకుంటున్నారు. మీ అమ్మా నాన్నా మిమ్మల్ని యిరవై ఆరేళ్ళు పెంచారు. ఆపరిసరాలు యిరవై ఆరేళ్ళుగా అలవాటయ్యాయి'

'కాని నాకు నీలాంటివాళ్ళు ఉంటారని ఈ బయట ప్రపంచం యింత అందంగా, యింత స్నేహమాధుర్యంతో వుంటుందనీ తెలియదు. ఈ ఆరు వారాల్లో నేనో కొత్తమనిషిని అయ్యాను. పునర్జన్మ అంటారే అల్లాంటిది సంభవించింది. మణీ, నిన్ను చూడకుండా నేను ఉండలేను.'

'ఉండటం నేర్చుకోండి. మీరు కాలేజీకి వెళ్ళేదాకా – మనం కలుసుకోటం పడదు. మా నాన్నకి మాటిచ్చాను.'

అతను మాటలు మర్చిపోయినట్లు – ఆమె చేతిని గట్టిగా పట్టుకుని కూచున్నాడు. ఒక పావుగంటసేపు ఎవరి ఆలోచనల్లో వారు వున్నారు. ఇద్దరి చేతులూ కలిసివున్నా – మనసులు చెరోవైపూ పయనిస్తున్నాయి.

'మణీ-' అన్నాడతను నెమ్మదిగా.

'ఏమిటి?' అన్నట్లు తలతిప్పి అతనివంక చూసింది.

'ఇన్నిరోజులు – ఈ ఇరవై ఆరేళ్ళు ఎలా గడపగలిగానని అడిగావు కదూ.... గుడ్డివాడికి – అకస్మాత్తుగా కళ్ళు కనపడి, ఈ పంచరంగుల ప్రపంచాన్ని చూడటం వీలవుతుందనుకో. వెల్తురుచూడటం నేర్చుకున్న ఆ మనిషిని మళ్ళీ చీకట్లోకి వెళ్ళిపో – నీ కళ్ళు పీకేస్తాను – అంటే ఎలా ఉంటుంది? నువ్వుగాని అసలు కనపడకుండా ఉండిఉంటే యింత బాధ

వుండేది కాదు. ఆరోజు నన్నుచూసి ఎందుకు జాసివడ్డావ్ ? బెడ్‌పాన్ ఎందుకు తీశావ్ ?'

దానికీ దీనికీ సంబంధం ఏముంది ?

'లేకపోవటమేమి ? ఆనాడు చూపించిన జాలి ఈనాడు నీకు కలగటం లేదా ? నిన్ను చూడకుండా నేను ఉండలేను. నా బాధ అర్థం అవటంలేదా?'

'మీరు మరీ అంత డీలా పడిపోకూడదు. ఒక్క పదిహేనురోజుల్లో కాలేజీకి వస్తారుగా. అప్పుడు రోజూ సరాసరి మా యింటికి వద్దురుగాని. రోజూ కలుసుకుందాం.'

'ఈ పదిహేనురోజుల్లో నువ్వు నాకు దూరమైపోతావేమో - నా గురించి మర్చిపోతావేమో ।'

'ఛీ, ఛీ. అవేంమాటలు ?'

'నీప్రపంచం, నీస్నేహితులు, మీయిల్లు అవన్నీ పూర్తిగా నాకు తెలియని ఒక కొత్త జీవితం. అందులో నాకు చోటువుందా ? నీస్నేహితుల మధ్య నేను జ్ఞాపకం వుంటానా ? నాకు చాలా సందేహాలు వస్తున్నాయి' అన్నాడతను బొంగురుగా - ఆ కంఠం సందేహాల్తో వూగిసలాడుతోంది.

'నాకు స్నేహితులు లేరని మీకు ముందే తెలుసు. మానాన్న, మీరు తప్ప నాకు స్నేహితులులేరు.'

'కాని నాకు నువ్వుతప్ప ఎవ్వరూలేరు. నీకు మీనాన్నతోపాటు నేను వున్నాను అంటున్నావు. నాకు నువ్వుతప్ప ఎవ్వరూలేరు. ఏకాకిని.'

'అదేమిటి అల్లా అంటున్నారు. అల్లా అనుకోకూడదు. మీవాళ్ళు కఠినంగా వుండచ్చు. కాని వారు మీ తల్లితండ్రులు - ఆవిషయం మర్చిపోకండి.'

'అది మర్చిపోవాలనే నాప్రయత్నం. నాకు వూపిరి సలపనివ్వక, నన్నో పురుగులాగా చూసేవాళ్ళు నాకు అమ్మా నాన్నా అవరు. శత్రువు

లవుతారు. మణీ, నన్ను యిలా వదిలి వెళ్ళిపోతావా ? నాకు కనిపించవా ? అల్లా తెలుస్తే ఆ హాస్పిటల్‌లోనే వుండిపోయేవాడిని.'

'ఎన్నాళ్ళుంటారు . వాళ్ళు వుంచుకోరే ?'

'అదే నేను చెప్పేది. నేను ఎవరికీ అక్కర్లేదు. అమ్మానాన్నకి, హాస్పటల్‌వాళ్ళకి – ఆఖరికి నీకూ – ఎవరికీ – '

"మీరల్లా 'సెల్ఫ్‌పిటీ'తో మాట్లాడకండి."

"ఇది 'సెల్ఫ్‌పిటీ'యా ?"

'కాక ? మగవారు, చదువుకున్నారు. మీవాళ్ళు ఏమంటే మీకేం ? వినిపించుకోకండి. మీపుస్తకాలు ముందేసుకుని కూచోండి. పిలుస్తే వెళ్ళి అన్నంతినండి. ఈపదిహేనురోజులూ అలా పంతంగా గడపండి. మీనాన్న చెప్పింది కాదని కాలేజీలో జేరలేదా ?'

'అది వేరు. నేను వుద్యోగంచేసి సంపాయించి పెడతానని ఆశ.'

'ఇప్పుడుమటుకు సంపాయిస్తే వాళ్ళకి యివ్వక ఎవరి కిస్తారు ?'

అతను జవాబు చెప్పలేదు.

'కాలేజీలో చేరరా ? కంటిన్యూ చెయ్యరా ?'

'ఎందుకు చెయ్యను.'

'మరి నాప్రశ్నకు జవాబు చెప్పలేదే ?'

'మణీ, నీకు నామనసు అర్థం కావటంలేదా ? నిన్ను వదిలి వుండలేను _ వుండలేను అని చెపుతున్నానుగా.'

'ఆసంగతి నాకు తెలియదా ?'

'అది మావాళ్ళకీ అనుమానంగా వుంది. అందుకని నామెడలు వంచి పెళ్ళిచెయ్యాలని చూస్తారు.'

'చేసుకోనని మొండికెయ్యండి.'

'ఎలా వెయ్యమన్నావు చెప్పు.'

'సత్యాగ్రహం చెయ్యండి.'

'అన్నం తినను, అని భీష్మించుకు కూచుంటే – వాడికి తిండిపెట్టకు, అన్నం దండగ – అంటాడు నాన్న. హాస్పిటల్‌లో చూశావుగా.'

'ఇల్లొదిలి వెళ్ళిపోతానని బెదిరించండి.'

'నాకు వెళ్ళే స్థలం ఏది ? వుద్యోగంలేదు. వెళ్ళి హోటల్లో కప్పులు కడుక్కోవాలి.'

'మీస్వేచ్ఛకోసం అవసరం అయితే అదీ చెయ్యాలి. పంతం అంటూ వస్తే మీరు ఆపనికీ సిద్ధపడాలి.'

'నువ్వాధైర్యం యిస్తే చాలు. తప్పకుండా ఇల్లువదిలి వచ్చేస్తాను. ఆపెళ్ళిమాటుకు నన్ను చేసుకోమనకు. నేను నిన్నుతప్ప ఎవరినీ ఆదృష్టితో చూడలేను.' అన్నాడతను.

నాగమణికి గర్వంగా వుంది. సంతోషంగానూ వుంది. ఇతను తనని ఆరాధిస్తున్నాడు, ప్రేమిస్తున్నాడు, తను లేకుండా బతకలేనంటున్నాడు. ఈపెళ్ళికి వాళ్ళవాళ్ళు వొప్పుకోరు. తన తండ్రి వొప్పుకుంటాడా ? ఎవరు వొప్పుకున్నా లేకపోయినా తామిద్దరం ఒకరి నొకరు వొదిలివుండలేరు.

'మీదగ్గర డబ్బుందా ?'

అతను సిగ్గుగా తలవూపాడు లేదు అన్నట్లు. తన హాండ్‌బాగ్‌లోని పదిరూపాయలు తీసి అతని పర్సులో పెట్టింది.

'ఒక్క పదిహేనురోజులు ఆగండి. కాలు మామూలుకి వస్తుంది. మా యింటికి వెళ్దాం – నాన్నకి పరిచయం చేస్తాను. ఈ పదిహేనురోజులు ఇల్లు కదలకండి....ప్రామిస్....' చెయ్యి జాపింది.

'ఆ తరువాత నిన్ను చూడొచ్చునన్న ఆశతో ఈ పదిహేను రోజులూ గడుపుతాను. నిన్ను తల్చుకుంటూ, హాస్పటల్లో ప్రతిరోజూ నువ్వు నాతో గడిపిన ఆ రెండుగంటల కాలాన్ని తిరిగి తిరిగి తలుచుకుంటూ కాలక్షేపం చేస్తాను.'

'టెక్స్ట్‌బుక్స్ చదువుకోరా ?'

'ప్రయత్నిస్తాను.'

'అదేమిటి?'

'నాకేమిటో భయంగావుంది. నిన్ను వదిలి నిన్ను చూడకండా వుండలేను అనిపిస్తోంది – చదువుమీద మనసు నిలపలేనేమో ననిపిస్తోంది. మణీ....మణీ....ఇప్పుడు ఈక్షణాన నీతో నన్ను తీసుకెళ్ళిపో....నీవెంట వచ్చేస్తాను...' చాలా వుద్రేకంగా వుంది అతని కంఠం.

నాగమణికి తండ్రికి యిచ్చిన మాట జ్ఞాపకం వస్తోంది – ఉహూ. తను అలా చెయ్యలేదు.

'ఒక్క పదిహేనురోజులు ఆగండి. మనం తొందరపడి నిర్ణయం తీసుకోకూడదు. మానాన్నకి అంతా చెపుతాను.'

'ఆయన యిష్టపడకపోతే? మళ్ళీ కనిపించవా?'

'మానాన్న గురించి మీకు తెలియదు. అల్లా మొండిగా చెప్పే మనిషి కాదు. మిమ్మల్ని యిష్టపడకండా వుండడు' అంది నాగమణి దృఢంగా.

'మణీ, నేను నీకంటే తక్కువ చదువుకున్నాను. ఏమీలేనివాడిని.'

'ఇంకా చెప్పాల్సింది ఏమైనా వుందా?' నాగమణికి కోపంవస్తోంది.

'నిన్ను యిల్లా యిబ్బంది పెట్టటం న్యాయం కాదనిపిస్తోంది....'

'మరి నన్ను చూడకండా వుండలేనంటున్నారు, వుండగలరా?'

అతను ఆమె చేతిని గట్టిగా పట్టుకున్నాడు. మునిగిపోతున్న వ్యక్తి ఆసరాకోసం తడుముకుంటున్నట్లు చీకట్లో ఆమెచేతిని తడుముకుంటూ అందుకుని, గట్టిగా పట్టుకుని, ఆచేతిని పెదవులదగ్గరకు చేర్చుకున్నాడు. అతని పెదవులస్పర్శ ఆమెకి కొత్తగా వుంది. వెచ్చగావున్న అతని పెదవులు ఆమె అరిచేతికి గిలిగింతలు పెడుతున్నాయి. ఆ వెచ్చదనం క్రమంగా కాలుతున్నట్లుగా వుంది. అతని పెదవులు మండిపోతున్నాయా?

ఎందుకంత వేడిగా వున్నాయి. ఆమె బుజంచుట్టూ చెయ్యివేసి దగ్గరకు - చాలాదగ్గరకు లాక్కున్నాడు. ఆతని వూపిరి - వేడిగా, బాయిలర్‌లోని వేడి ఆవిరిలాగా తాకుతూవుంది మెడమీదకి....

'ఇక మనం లేద్దాం - చీకటిపడిపోయింది' అంది నాగమణి ఆతని చేతులు విడిపించుకుని. ఆమెకి ఏదో భయంగావుంది. తండ్రిమాటలు జ్ఞాపకం వస్తున్నాయి. 'నువ్వు - ఏనిర్ణయం తీసుకోకు - తొందరపడకు' అని హెచ్చరించటం జ్ఞాపకంవస్తోంది.

అతన్ని రిక్షా ఎక్కించింది పేరమాడి. రోజూ వుత్తరం రాయమని మాటతీసుకుంది. పదిహేనురోజులూ జాగ్రత్తగా వుండమని హెచ్చరించింది. రిక్షా కనుమరుగుఅయేదాకా అలా చూస్తూనే వుంది. లజ్‌లోని దీపాల వెలుగులో అతనిరిక్షా - క్రమక్రమంగా చిన్నదైపోయి, చుక్కలా అదృశ్యమైపోయింది.

ఆతరువాత నాగమణికి ఏమిటో పిచ్చిగా వున్నట్లుండేది. ఏపని చేస్తున్నా, క్షణక్షణం అతను జ్ఞాపకం వస్తున్నాడు. భోజనంమీద, చదువు మీద, కాలేజీమీద అన్నిటిమీదనూ శ్రద్ధ తగ్గిపోతున్నది. ఆఖరికి కట్టుకునే బట్టలమీదకూడా యిదివరలా జాగ్రత్త కన్పించటంలేదు. చీరె నలిగినా, చినిగినా పట్టించుకోటంలేదు. పదిహేనురోజులు పదిహేను యుగాలుగా గడిచాక, అతను హాస్పటల్‌కి వచ్చాడు కాలు మళ్ళీ చూపించుకోటానికి. ఆరోజు ఎక్స్‌రే తీసి చూసి - యింక మామూలుగా నడవవచ్చని క్లీన్‌చీటీ యిచ్చారు.

ఆర్థొపెడిక్‌వార్డ్‌నుంచి ఓ. పి. డి కి వచ్చి ఆమెకోసం వెయిట్ చేస్తూ నుల్చున్నాడు. వస్తూనే ఆమెకి చీటి పంపించాడు వార్డుబాయ్‌చేత. నాగమణి గబగబా డ్యూటీ ముగించుకు వచ్చేసింది. ఇద్దరూ హాస్పటల్‌కి ఎదురుగావున్న హోటల్‌కి వెళ్ళారు. అది మామూలు సాదాహోటల్. కేవలం ఆస్పత్రికొచ్చేవారికోసం వెలిసింది. లోపల ఒకే ఒక్క ఫామిలీ రూము. ఆరూమ్‌లో రెండేబలలు. ఒకబలముందు మరోజంట.

కుర్చీలో కూలబడి 'మణీ' అంటూ ఆమెచేతిని గట్టిగా పట్టుకున్నాడు.

ఆమెకికూడా చాలా సంతోషంగా వుంది. ఈ పదిహేనురోజుల వియోగం యిద్దరినీ వుక్కిరి బిక్కిరి చేస్తున్నది. ఎన్నో మాట్లాడాలన్న తొందర - కలుసుకున్నామన్న సంతోషం. ఏవిషయం ముందు చెప్పాలి ? ఎవరు ముందు మాట్లాడాలి ! ఇద్దరూ ఎదుటివారికి ఛాన్సు యివ్వాలన్నట్లు మొహాలు చూసుకుంటున్నారు, ఏంచెబుతారు—అన్నట్లు !

'రేపటినుంచీ కాలేజీకి వెళ్తారా ?'

'వెళ్తాను. రేపు నిన్ను చూడటం ఎలా ? సాయంత్రం యిక్కడికి రానా ?'

'రోజూ ప్రెసిడెన్సీనుంచి రావటం మీకు కష్టం అవుతుంది.'

'ఫరవాలేదు.'

'పోనీ నువ్వు బీచికిరా.'

'ఉహూ. అలావొద్దు. మీయింట్లో ఎలా వున్నారు ?' ప్రశ్నించింది.

'ప్రస్తుతానికి అందరూ తగ్గారు. నువ్వు మళ్ళీ రాలేదు. నేను యిల్లు కదల్లేదు. అందుకని తృప్తిపడి వుంటారు.'

'ఈ పదిహేనురోజులు ఏంచేశారు ? మిస్ అయిన లెక్చర్స్ ఎక్విప్ చేసుకున్నారా ?'

'నిజం చెప్పనా—నిన్ను తలుచుకుంటూ గడిపాను. సెమినార్‌కి తయారవలేకపోయాను....' అన్నాడతను బిడియంగా భయంగా చూస్తూ.

అతను అలా చూసినపుడు నాగమణి మంచులా కరిగిపోతుంది. ఆకళ్ళలోని మొహమాటం - సన్నగా తొంగిచూసే భయం, నిస్సహాయత ఆమెని బలహీనురాలిని చేస్తాయి.

'ఇప్పుడే యింటికెళ్ళాలా ? భోంచేసి వచ్చారా ?' అడిగింది.

అతను నవ్వాడు.

'దేనికి నవ్వుతున్నారు ?'

'నన్ను కలుసుకున్నపుడు నీకు నా భోజనంతప్ప యింకేమీ గుర్తు రాదుకదూ -ఆరువారాలు ప్రతిరోజూ యిదే అడిగేదానివి. జ్ఞాపకంవుందా?'

'మీయింట్లో వంట త్వరగా అవదని అన్నారు ఆరోజున - అందుకు అడిగాను.'

'ఈరోజూ - అదేపాట. పాతపాటే - '

'అరే - అయితే కాఫీ తాగకండి. దోశగాని, ఇడ్లీగాని తెప్పిస్తాను.'

'మణీ' పిల్చాడతను నెమ్మదిగా.

తలఎత్తి చూసింది.

'మీ యింటికి తీసుకెడతానన్నావ్ - మీ నాన్నకి పరిచయంచేస్తానన్నావ్ - మర్చిపోయావా ?'

'ఇవ్వాళ వస్తారా ?'

'వస్తాను. ఒకసారి మీ నాన్నగారు నన్ను చూస్తే - మీ యింట్లో నిన్ను కలుసుకోనిస్తారేమో ! నిన్ను చూడకుండా ఉండలేను.'

'పదిహేనురోజులూ ఉన్నారుగదా !'

'ఈరోజు నిన్ను కలుసుకుంటాను - అన్న ఆశతో గడిపాను. ఆ సంగతి నీకు తెలియదా ?' అన్నాడతను.

ఆ మధ్యాహ్నం మూడింటిదాకా అచుట్టుపక్కల గడిపి. మూడింటికి యింటికి తీసుకెళ్ళింది అతన్ని. వారు వేళ్ళేప్పటికి మొదలియార్ నిద్రపోతున్నాడు. కళ్ళుతుడుచుకుంటూ తలుపుతెరిచి, గుమ్మంలో కూతురు వెనుక నిల్చున్న పొడుగాటి యువకుని చూసి - కాస్త తడబడి, మళ్ళీ సర్దుకుని లోపలికి రమ్మని పిలిచాడు.

ఇద్దరికీ కాఫీ కలిపి తీసుకొచ్చి యిచ్చాడు. అతని ఆరోగ్యం గురించీ, చదువు గురించీ ప్రశ్నలు అడిగాడు. చాలా మర్యాదగా - మామూలు అతిథిగా ఆహ్వానించి మాట్లాడాడు. సుందరరాజన్‌కి తమ యింటికీ - యీ యింటికీ గల వ్యత్యాసం కొట్టవచ్చినట్లు కనబడింది.

ఒక అరగంట కూచున్నాక – 'మణీ – నేనల్లా బజారుకెళ్ళి కూరలు తీసుకొస్తాను' - అంటూ ఇద్దరినీ వదిలి వెళ్ళిపోయాడు ఆయన. ఆయనకి కూతురుమీద ఎంత నమ్మకం! తామిద్దరూ ఏం మాట్లాడుకుంటారో అన్నట్లు - దొంగచూపులు చూస్తూ - కాపలాకూచున్న తమ్ముడు, పిల్చినా బయటకి రాని తల్లి – అందరూ అతని మనసులో కదలాడుతున్నారు.

'మణీ! నువ్వు చాలా లక్కీ.. నిన్ను చూస్తుంటే నాకు అసూయ వేస్తోంది.'

'ఎందుకు?' నవ్వుతూ అడిగింది. ఆమెకి కారణం తెలుసు.

'మీ నాన్నగారు ఎంత సంస్కారం కలవారో అర్థం అవుతోంది. ఎంత మర్యాదగా ఉన్నారో. అదే మాయింట్లో అయితే – ఆడపిల్లకి స్నేహితులేమిటి? చదువేమిటి? అన్న ప్రశ్నలు. అసలు బాయ్‌ఫ్రెండ్‌ని యింటికి తీసుకొచ్చే ధైర్యంగాని, ఆ వచ్చినవాడిని చీవాట్లుపెట్టకుండా పంపే సంస్కారంగాని మాకు లేదు.' అన్నాడతను ఉద్రేకంగా.

'పోనివ్వండి. అవన్నీ ఎందుకిప్పుడు.' అంది నాగమణి.

పెళ్ళి అన్నది – ఒక మరుపురాని మధురమైన ఘట్టం అందరి జీవితాల్లో!

కాని తనకి – పెళ్ళి జ్ఞాపకంలేదు. తన పెళ్ళి ఎలా జరిగింది అన్నది తన స్మృతిపథంలోనించి – చాలామటుకు మరుగునపడిపోయింది. అయితే ఆతరువాతది మటుకు – తను మర్చిపోలేదు. అది ముల్లులా తమ ఇరువురి హృదయాలనీ గుచ్చిగుచ్చి బాధించింది.

ఎలా జరిగింది? ఎందుకు జరిగింది? ఈ లోకంలో ఎంతమంది కులాంతరవివాహాలు చేసుకోటంలేదు! చదువుకున్నవాళ్ళు – ప్రేమించుకుని

మతాంతర, దేశాంతర వివాహాలు చేసుకుంటున్న కాలంలో యింకా పట్టింపులూ, ఆచారాలూ అంత లోతుగా పాతుకుపోయివుంటాయని తాను ఊహించలేకపోయింది. తనేకాదు—తన తండ్రికూడా అనుకోలేకపోయాడు.

అతను ఆరునెలలపాటు తమ యింటికి రాకపోకలు సాగించాడు. రోజూ, రోజు విడిచి రోజూ యిలా కలుసుకుంటూ వుండేవారు. మొదట్లో తండ్రికి కలిగిన సందేహాలు, అపనమ్మకాలూ తగ్గిపోయాయి. అతను అల్లరి చిల్లరగా ప్రవర్తించే యువకుడు కాదు అన్న నమ్మకం కుదిరింది. ఆ వేసంగిలోనే తను హౌస్ సర్జన్సీ చేస్తున్నపుడు ఒక సాయంత్రం అతను తన తండ్రితో హోరాహోరీ దెబ్బలాడి యిల్లువదిలి వచ్చేశాడు.

ఆ శెలవల్లో వూరికే కూచోటం ఎందుకు, మేనమామ వూరికెళ్ళి, గుళ్ళో అర్చన వగైరా తంతు నేర్చుకోమని తండ్రి పోరు. దీనికి తల్లీ, మేనమామా మద్దతు. ఆవిధంగా అతన్ని తనకి అల్లుడిని చేసుకునే మార్గం తేలిక అవుతుంది అన్న ఆలోచన. అతను ఒప్పుకోలేదు. ఏమైనా సరే మద్రాసునుంచి కదలనన్నాడుట. అయితే 'నాపిల్లని పెళ్ళి చేసుకో. లేకపోతే నాఅప్పు కక్కండి' అంటూ కూచున్నాడు మేనమామ. ఈతను పెళ్ళిససేమిరా చేసుకోనన్నాడుట. తండ్రి యింట్లోంచి వెళ్ళిపొమ్మన్నాడు. ఆరాత్రి తొమ్మిదింటివేళ కట్టుబట్టల్తో తమ తలుపుకొట్టాడు. నాగమణి తలుపుతీసింది - అతను తిరిగి మైలాపూర్ వెళ్ళలేదు.

ఆ తరువాత తమ పెళ్ళిప్రయత్నాలు. మధ్యవర్తులు. అతని తండ్రి దగ్గరకు వెళ్ళి రాయబారాలూ, రాజీలు ప్రయత్నించారు. అవి పూర్తిగా వెడిసి కొట్టాయి. తామిద్దరూ ఒకరినొకరు యిష్టపడుతున్నారు. అతను నెల్లాళ్ళుగా యింట్లో వుంటున్నాడు. ఇదే సరైనమార్గం అని - మంచిముహూర్తం చూసి, తమ యింట్లోనే - చాలా క్లుప్తంగా ఒక పదిమంది దగ్గిరవారిని భోజనాలకి పిల్చి పెళ్ళిచేశాడు తండ్రి.

పెళ్ళి అయిన వెంటనే ఆ పసుపుబట్టల్తో కపాలేశ్వరుని గుడికివెళ్ళి, పూజ చేయించి రావాలన్నాడు అతను. ఒకరోజున మనసు మరీ కల్లోలంగా వున్నపుడు ఆ గుడికి వెళ్ళి, ప్రదక్షణచేసి, లోపల మండపంలో కూచున్న పుడు మొక్కుకున్నాడుట. తనకి నాగమణితో పెళ్ళి అయితే, పెళ్ళిబట్టల్తో గుడికి వస్తానని. పెళ్ళికి వచ్చిన పదిమందీ భోజనాలు చేసి వెళ్ళిపోయారు. తామిద్దరూ, తండ్రీ భోంచెయ్యలేదు. దైవదర్శనం అయాక, అంటూ టాక్సీలో బయలుదేరారు.

'అట్లాగే మీ అమ్మానాన్నగార్కి నమస్కరించి ఆశీర్వచనం పొందుతే బాగుంటుందేమో. ఎంతయినా పెద్దవాళ్ళు.'

'ప్రయోజనం వుండదండీ, మీతృప్తికోసం వెళ్ళాం. అనక మీరు బాధపడకూడదు' అన్నాడతను - టాక్సీలో వెనకసీట్లో కూచున్న తన అరిచేతిని నొక్కుతూ। ముందు డ్రైవరుపక్కన కూచునివున్నాడు తండ్రి. తను అతని చేతిని గిల్లింది అల్లరిగా. వుండు నీపని పడతాను అన్నట్లు చూపుడువేలుతో బెదిరిస్తున్నాడతను. టాక్సీ, కపాలేశ్వరునిగుడి - అవతల వైపు పూలకొట్లవైపున ఆగింది. ఈవైపు కోనేరు వుండదు. రథం - గాలి గోపురానికి ఎదురుగా పెద్దమండపం వుంటుంది. అక్కడ దిగి, ముందు గుళ్ళోకి వెళ్దాం అన్నాడు అతను.

గర్భగుడిలోకి వెళ్ళగానే అక్కడి అర్చకుడిని చూడగానే, యితను కూడా యిలాగే పూజ చేయించేవాడా? ఇదే పూజావిధానం యితనూ 'ఫాలో' అయేవాడా అన్న ఆలోచన వచ్చింది.' అతనివంక చూసింది. కళ్ళు మూసుకుని - ఏదో స్తోత్రం వల్లిస్తున్నాడు అతి శ్రద్ధగా - పైకి శబ్దం రావటంలేదు.

'అర్చనకు జన్మనక్షత్రం, నామధేయం చెప్పమని అర్చకుడు అడిగినపుడు తను వెర్రిదానిలా చూసింది. తండ్రి తడబడ్డాడు. అతను మటుకు 'భగవంతుని' పేరున చేయించండి అన్నాడు తడుముకోకుండా.

అయితే భగవంతునికి హారతియిచ్చి, అందరికీ ఆ హారతి చూపిస్తూ, విభూతి చేతిలో వేస్తున్నపుడు – అర్చకుడు ఇతనివంక, పరిశీలనగా చూసి, 'నువ్వు, కృష్ణమాచార్యుల కొడుకువిగదూ ?' అడిగాడు సందేహంగా. అతను వినిపించుకోనట్లు వూరుకున్నాడు.

'అవునండీ. మా అమ్మాయి నిచ్చాము. ఉదయమే వివాహం అయింది. ఇక్కడినుంచి వాళ్ళింటికివెళ్ళి పెద్దల ఆశీర్వచనం తీసుకుంటారు. ఈ దంపతులిద్దరూ పదికాలాలపాటు పిల్లాపాపాతో వర్థిల్లాలని ఆశీర్వదించండి స్వామీ' అన్నాడు మొదలియార్.

'దీర్ఘ సుమంగళీభవ – దీర్ఘాయుష్యరస్తు' అంటూ యిద్దరినీ ఆశీర్వదించాడు – హారతిపళ్ళెంలో బడిన అయిదురూపాయలనోటు బొడ్లో దోపుకుంటూ. నాగమణి మళ్ళీ అతనివంక చూసింది. అతను నిశ్చలంగా గర్భగుడిలోని ఆ శివలింగంవంక రెప్పవెయ్యకుండా చూస్తున్నాడు.

'మీనాన్నవాళ్ళూ కోనేరుదగ్గర వున్నారు. ఇంట్లోలేరు. ఇల్లు తాళం పెట్టి వుంటుంది' అన్నాడు పూజారిగారు ఆఖరిమాటగా వీరు అక్కడినుంచి కదులుతుంటే.

'మనం అక్కడికే వెళ్దాం. ఇంక యింటి కెందుకు ?' అంటూ తండ్రి అనగా, ముగ్గురూ ధ్వజ స్తంభం దాటుకుని కొలనువైపుగా ఆలయం బయటకొచ్చారు. కొలనుగట్టుమీద ఆవైపుగా గుంపులు గుంపులుగా బ్రాహ్మణులు. కొలనుగట్టుమీద నాగమణికి మామగారూ, మరిదీ కనిపించారు. వాళ్ళకి కాస్త దూరంగా అత్తగారూ, ఆడబడుచూ ; నాగమణి అటువైపుగా వెళ్ళబోతున్నది. సుందరరాజన్ 'ఆగు' అన్నట్లు చెయ్యి అడ్డుగా పెట్టాడు. అక్కడే నిలబడిపోయింది. దూరంగా ఏవో మంత్రాలు. అలవాటులేని మంత్రోచ్చరణ శబ్దతరంగాలు ఆమె చెవుల్లో సోకుతున్నవి. అలా బొమ్మలాగా నుల్చుని చూస్తూ వుండిపోయింది – ఏంజరుగుతున్నదో తెలుసుకోలేక.

అత్తగారూ, ఆడబడుచూ, మరో స్త్రీ — ముగ్గురూ తడిబట్టలతో కొలను మెట్లు ఎక్కి పైకి వస్తున్నారు. ఎవరో బ్రాహ్మణుడు రెండు అరిచేతులూ జాపి పట్టుకుంటున్నాడు. అత్తగారు ఏడుస్తూ అతని చేతిలో నీళ్ళు పోస్తున్నది. ఇదే తతంగం అంత్యక్రితం మామగారూ చేశారు. ఏవిటి ? ఏంచేస్తున్నారు ?

'పదండి. మామూలుగా - వాళ్ళ ప్రవర్తన. పెళ్ళిపోదాం.' అంటూ కదిలాడు సుందరరాజన్ - నిద్దట్లో నడుస్తున్నట్లుగా అడుగువేసి.

'ఎంత దారుణం చూడండి. కొడుకూ కోడలూ పెళ్ళిబట్టల్తో వస్తే - తర్పణాలు వదుల్తాడా ? మరీ మూర్ఖంగా తయారవుతున్నాడు ముసలాయన. ఇంత పట్టుదల కూడదు.' అంటూన్న మాటలు నాగమణి చెవులోపడ్డాయి. తలఎత్తి చూసింది. కొలనుగట్టుమీద కూచున్న మధ్యవయస్కుడు అంటున్నాడు తమవైపుచూసి జాలిగా.

'రాజన్ — రాజన్' ఎవర్లో పిలిచారు అతన్ని పేరుపెట్టి.

గబగబ అడుగులువేస్తున్న అతను ఆగాడు. ఇతన్ని అందరూ రాజన్ అని పిలుస్తారుకాబోలు అనుకుంది నాగమణి.

'మీ నాన్న మూర్ఖుడు. పట్టుదలగల మనిషి. ఆయన నమ్మకాలు ఆయనవి. నువ్వు లక్ష్యపెట్టకు. మీరిద్దరూ హాయిగా ఉండండి.' అన్నాడు ఎవరో అపరిచితుడు. అతను తనకి అపరిచితుడు కావచ్చు. తన భర్తకి తెలిసేవుంటాడు.

'శుభమా అని పెళ్ళిచేసుకునివస్తే — ఆయన యిల్లా చెయ్యొచ్చా ?' అడుగుతున్నాడు నాగమణి తండ్రి.

'తెగతెంపులు చేసుకోకపోతే ఇక్కడ అందరూ వెలేస్తారు. ఎవ్వరూ పూజలకీ, పునహ్వాలకి పిలవరండి.' మధ్యవయసు దాటిన ఒకాయన చేతిలో దర్భలు పుచ్చుకుని అంటున్నాడు.

'అందుకని - కొడుకుకి తర్పణాలు వదుల్తారా ?' రాజన్ అని పేరుపెట్టి పిలిచిన వ్యక్తి అడుగుతున్నాడు.

'వొదిలినంతమాత్రంచేత నష్టం ఏమిటి ? ఏదో అయన నమ్మకం ఆయనది. వొరేయ్ - రాజన్ - యింక యీవైపుకి రాకు. నీ గొడవేదో నువ్వు పడు. రేపు నీ చెల్లెలికి పెళ్ళికావాలి - పెద్దవాడిని చెపుతున్నాను. నీ మానాన నువ్వుండు.' అన్నాడా పెద్దాయన.

ఎవరికీ ఏమీ మాటలు లేవు. మాట్లాడేందుకు మాటలు కనిపించటం లేదు. తమ పెళ్ళిరోజున, పసుపుబట్టల్తో - వచ్చిన కొత్తదంపతుల కళ్ళ ముందే - అందులో వొకవ్యక్తి చనిపోయాడు అని ధర్మోదకాలు వదలటం ఎక్కడైనా వుందా? ఇంతటి అపశకునంతో ఆరంభమైన కూతురి వైవాహిక జీవితం ఏమవుతుంది ? ఏ పరిణామాలకి దారితీస్తుంది ? అని గజగజ లాడిపోయాడు మొదలియార్. మనసులోని భయాలని బయటకి కనిపింప నివ్వకుండా, 'వారి నమ్మకాలు వారివి. నువ్వేం బాధపడకయ్యా. నువ్వు నాకు అల్లుడివికాదు - కొడుకువి. నాకు కొడుకులేని లోటు యీనాటికి తీరింది' అంటూ అల్లుడి చెయ్యిపట్టుకుని టాక్సీలో కూచోబెట్టి, వెళ్ళిన గంట లోనే యింటికి తిరిగి తీసుకొచ్చేశాడు కొత్తదంపతులని.

అంతక్రితం ఎంతో కళకళలాడుతూవున్న ఆయిల్లు, గుమ్మాలకి కట్టిన మామిడికొమ్మలు వడిలిపోయినట్లూ, బోసిగా వున్నట్లు అనిపించింది నాగమణికి. పొద్దుట ఈ హాలులో పన్నెండుమంది కూచున్నారు. అందరూ నవ్వుతూ కాఫీలు తాగారు, విందుభోజనం చేశారు. ఇప్పుడు వంటచేసిన వంటఅయ్యరుతప్ప ఎవరూలేరు - అంతా వెళ్ళిపోయారు.

తండ్రి ముగ్గురికీ ఆకులు వెయ్యమని. వడ్డించమని వంటఅతనికి చెప్పి, 'కాళ్ళూ చేతులూ కడుక్కునిరండి. భోంచేద్దాం' అన్నాడు.

అతను నిశ్శబ్దంగా, మరబొమ్మలా కాళ్ళుకడుక్కొచ్చి, భోజనానికి కూచున్నాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. ముగ్గురికీ మాటలు దొరకటంలేదు.

అతను అన్నం కెలికి, కెలికి తింటున్నాడు - తలఎత్తటంలేదు. అంతక్రితం దాకా ఆరునెలలుగా తండ్రి ఎదురుగా యీవ్యక్తితో అనేకసార్లు మాట్లాడింది - వేళాకోళంచేసి, వాదించింది, నవ్వింది. కాని ఈరోజు అవేమీ అనలేకుండా వుంది. ఒకవైపు సిగ్గు, మరోవైపు మనసులో ముల్లు దిగిన బాధ.

ఆసాయంత్రం తండ్రి 'యిద్దరూ అలా తిరిగిరండమ్మా - అతని మనసు బాగాలేదు. అలా బీచికో, సినిమాకో వెళ్ళండి' అన్నాడు.

ఇద్దరూ బీచికెళ్ళి కూచున్నారు. నాగమణి అతని చెయ్యి తన చేతిలోకి తీసుకుని, బుజం ఆనుకునేటట్లు దగ్గరగా జరిగి 'మీరు యింకా ఆ విషయం మర్చిపోలేదా? ఒక్కమాటకూడా మాట్లాడటంలేదు - పెళ్ళి అయిపోయాక ప్రేమ పారిపోయిందా?' అడిగింది.

'ఈరోజు మనం వెళ్ళకండా వుంటే బాగుండేది. నాకెందుకో భయంగా వుంది.'

'దేనికి - ఆయన మనకి పెట్టి పోషించక్కర్లేదు. ఇంకో మూడు నెలల్లో నాకెక్కడో ఒకచోట వుద్యోగం వస్తుంది. మీరు యమ్. ఎ. పాసవుతారు. ఆతరువాత ఎమ్. ఫిల్ చేస్తారు. మనం చెయ్యాల్సినవి చాలా వున్నాయి, మాట్లాడండీ.'

'నాకు మాటలు రావటంలేదు. నువ్వు మాట్లాడుతూ వుండు - మన భవిష్యత్ గొప్పగా వుంటుందని చెప్పుకుంటూ వెళ్ళు. అప్పుడైనా నాకు కాస్త శాంతిగా వుంటుంది.'

'మీరెందుకంత పిరికిగా అవుతున్నారు?'

'ఈరోజుకాక - యింకోరోజున మానాన్న అలా చేసివుంటే, నేను యింత 'డిస్టర్బ్' అయేవాడినికాదు. పెళ్ళి చేసుకుని పసుపుబట్టల్తో, ఆశీర్వచనానికి వెడితే - తర్పణాలు వొదిలాడా? ఇది ఎక్కడైనా వుందా? ఈరోజు నాపెళ్ళి అని తెలిసికూడా....'

'అది ఆయన నమ్మకం. ఆయనెవరో అన్నారుగా మీ చెల్లెలికి పెళ్ళి అవదని - అందుకేమో !'

'ఎందుకైతేనేం మానాన్న తన పట్టుదల తాను నెగ్గించుకున్నాడు. నువ్వు ఆ పిల్లని చేసుకుంటే - నాకు కొడుకు లేడనుకుంటా - చచ్చిపోయాడనుకుంటా' అని శపథం చేశాడు ఆరోజున. అది నెగ్గించుకున్నాడు.'

'పోనిద్దురూ, ఆవిషయం మర్చిపోదాం. మనం హాపీగా వున్నాం - మీరు కోరుకున్న భార్య వచ్చింది !'

'అతను మాట్లాడలేదు.

'మాట్లాడరేం. నావెంటబడి - నన్ను పెళ్ళిచేసుకో - అని గొడవ చెయ్యలేదా ?'

'నీకుమటుకు - నామీద ప్రేమలేదా ? ఒక్క నాబలవంతంమీదనే చేసుకున్నావా ?' అడిగా డతను.

అమ్మయ్యా - అనుకుంది నాగమణి. అతను ఎలాగేనా మధ్యాహ్నపు సంఘటనని మర్చిపోవాలి.

'కాస్త జరగండి. కాళ్ళు జాపండి అంటూ అతని వొళ్లో తల పెట్టుకు పడుకుని - 'మెళ్లో యీపుస్తెలు బరువుగా, కొత్తగా వున్నాయి - మీకెల్లా వుంది ? నామెడ కొత్తగాలేదూ.'

అతను ఆ సన్నని చీకట్లో మెడలోని పసుపుతాడు చేతిలోకి తీసుకు చూస్తున్నాడు - వొంగి. అతని వేళ్ళు చల్లగా - అయిసులాగా ఉన్నాయి. వొంగిన అతని ముఖాన్ని - రెండుచేతుల్తో తన ముఖంమీదికి లాక్కుని - అతని పెదవులని తన పెదవుల్తో స్పృశించింది ఆ సన్నని చీకట్లో. ఆ పెదవులు చల్లగావున్నాయి. నాగమణి ఉలిక్కిపడింది. అతని చేతివేళ్ళు, ఆ వేళ్ళ కొనలు, పెదవులు, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎప్పుడూ వేడిగా, ఉద్రేకంతో పరవళ్ళుతొక్కుతూవుండేవి తన స్పర్శతో. ఈనాడు ఎందుకు ఇల్లా ఉన్నాడు ? తన తండ్రి ప్రవర్తన ఇతన్ని యింత గాయపరిచిందా ?

'ఇంటికెడదామా ?' అడిగింది.

'పద - వెళ్ళిపోదాం.' అన్నాడు.

ఆరాత్రి — తండ్రి ముందుగదిలో పక్కపరుచుకున్నాడు. అప్పటిదాకా ఆ గదిలో సుందరరాజన్ పడుకునేవాడు. తనూ, నాన్నా లోపలి గదిలో పడుకునేవారు. తాము యింటికొచ్చేసరికి - తండ్రి తనగది శుభ్రంగా సర్ది - మంచంమీద తెల్లటి దుప్పటి పరిచి, ముందుగదిలో తన పక్క వేసుకున్నాడు. తల్లికంటే శ్రద్ధగా యీ యేర్పాట్లన్నీ చేసిన ఆ పెద్దాయనను - వార్ధక్యంలోకి అడుగుపెడుతున్న యీ తండ్రిని చూస్తే - నాగమణికి ప్రేమ, అభిమానం, జాలి - అన్నీ కలిగాయి. 'నాన్నా....' అంటూ ఆయనని చిన్నపిల్లలా వాటేసుకుంది రెండుచేతుల్తో.

'మణీ— చంటిపిల్లలా గారాలుపోకు. నువ్వు పెళ్ళిచేసుకున్నావ్. ఒక యింటిదానివయ్యావు. ఇవన్నీ నాదగ్గరకాదమ్మా చూపించవల్సింది-' అంటూ ఎన్నడూ లేనిది తలమీద ముద్దుపెట్టుకున్నాడు — గుండెలకి హత్తుకుంటూ.

నాగమణి మెడిసిన్ చదివింది - మానవదేహశాస్త్రం గురించి, స్త్రీ పురుషుల ఆకర్షణ గురించి వూహించలేనంత పసిపిల్లకాదు. ఆ వయసులోని ఆడపిల్లలందరికిమల్లే నే - ఏరికోరి, ప్రేమించి పెళ్ళిచేసుకున్న భర్తపక్కన పడుకుని, మీదచెయ్యివేసింది. అతని చెయ్యి చల్లగా వుంది. ఆ దేహంలో కదలికలేదు. వెనుకటిలాగా వెచ్చని వూపిరిలేదు.

'మణీ - మణీ - నాకెందుకో భయంగా వుంది, ఇలా దగ్గరకురా - యింకా దగ్గిరకురా' అంటూ గట్టిగా గుచ్చి గుచ్చి కౌగిలించుకుని - మనిషంతా తెగ వూగిపోతున్నాడు దుఃఖంతో.

'దేనికి మీరంత బాధపడుతున్నారు ? ఏంజరిగింది ?' అడిగింది నాగమణి పసిపిల్లవాడిని వోదారుస్తున్నట్లు అతని తలని తన గుండెలమధ్య దాచుకుని.

'ఆ తర్పణాలు, ఆ కొలనుదగ్గర జరిగినవి మర్చిపోలేకుండా వున్నాను. మానాన్న మనిద్దర్నీ శపించిపోస్తున్నాడు. ఎందుకిల్లా చేశాడంటావ్ ? నేనేం చేశానని యింత కక్ష ? అకారణంగా ఎందుకింత ద్వేషిస్తున్నాడు ? నామీద దయలేదా ?' కుమిలిపోతూ ప్రశ్నించే అతని ప్రశ్నలకి బదులు చెప్పలేకపోయింది. పసిపిల్లవాడిని సముదాయించినట్లు వీపుమీద రాసి, బుజ్జగిస్తూ వుంది. అతను అలా బాధపడుతూనే నిద్రలోకి జారుకున్నాడు.

నాగమణికి నిద్రరావటంలేదు : ఎందుకిల్లా జరిగింది ? తమ మొదటి రాత్రి యిలా ఆరంభమైందా ? సినిమాల్లోలాగా పాటలుపాడాలనుకోలేదు. పాలగ్లాసు అందించాలనుకోలేదు. మొదటిరాత్రి కొత్తదంపతుల్లా తామెందుకు వుండలేకుండా వున్నారు. ఇంత వుద్రేకంగా, తనకోసం పలవరించిన మనిషి, మాటిమాటికి తన స్పర్శకోసం తపించిపోయిన యితను ఎందుకిల్లా వున్నాడు ? బహుశా మధ్యాహ్నపు సంఘటన అతని మనసునింత తీవ్రంగా గాయపరిచిందా ?

సుందర్ రాజన్ మామూలుమనుషుల్లో పడేసరికి ఒకవారంరోజులు పట్టింది. ఆవారంరోజుల్లో అతను ముభావనగా, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నట్లు వుండేవాడు. ఒకరోజు రాత్రి – నాగమణి అర్ధరాత్రి మెళకువవచ్చి చూసేప్పటికి తలకింద రెండుచేతులూ పెట్టుకు – యింటి పైకప్పుకేసి చూస్తూ వున్నాడు భర్త....

'మీరు నిద్రపోలేదా ?' అడిగింది అతనిపైన చెయ్యివేసి.

అతనికి స్పర్శజ్ఞానం లేనట్లూ, తన చేతిని గమనించనట్లూ వూరుకున్నాడు. అతనివైపుగా తిరిగి గడ్డంపట్టుకు – ముఖం తనవైపుకి తిప్పుకుని 'ఏమిటి ఆలోచిస్తున్నారు ?' అని అడిగింది.

'మణీ, నిన్ను పెళ్ళిచేసుకుని – నీకు అన్యాయం చేశానా ?' అడిగాడు అతను దిగులుగా.

'మీకేం మతిపోయిందా ? మనిద్దరం ఒకరి నొకరం ప్రేమించుకుని, అందరినీ ఎదిరించి పెళ్ళి చేసుకున్నాం - యిప్పు డీమాటలేమిటి - అర్ధం లేకుండా ?'

'మానాన్న -- ఆరోజు ఎందుకలా చేశాడు ? నామీద ఆయన కెందు కంత కక్ష ?'

'అది మీమీద కక్షకాదు - ఆయనమాట వినలేదన్న కోపం. నా కొలీగ్ ఒకతనితండ్రి - జందెం తెంచుకు కాశీ పారిపోయాట్ట - భార్యమీద కోపంవచ్చి. మాకుటుంబాల్లో యీపట్టుదలలు మామూలే. మీరేం - లక్ష్య పెట్టకండి' అన్నాడాయన నాతో.

'ఆరోజు మనం వెళ్ళకండా వుంటే బాగుండేదికదూ ! నేనే ... గుడికి వెళ్ళాలని పట్టుబట్టాను. లేకపోతే ఆయనేం చేశాడో మన కంటపడి వుండేదికాదు.'

'మిమ్మల్ని ఆరోజునుంచీ అడగాలనుకుంటున్నాను .... మీరు నామాలు పెట్టుకుంటారుగదా - విష్ణుభక్తులుకదా - కపాలేశ్వరుని గుడికి ఎల్లావచ్చారు ? ఎట్లా మొక్కుకున్నారు.'

'నాకు శివుడైనా - విష్ణువైనా ఒకటే. అసలు ఆ గర్భగుడిలో వుండి, భగవంతుని పూజచేసి, హారతి యిస్తున్నపుడు దేముడులేడు .... ఎవరూ లేరు. ఇది వుత్తరాతివిగ్రహం - యీ హారతీ, నైవేద్యం యిదంతా కూడా బిజెనెస్. ఇదీ ఒక వుద్యోగమే యిందులో ఏమీలేదు - అనిపిస్తూ వుంటుంది.'

'మరి, మొక్కుకున్నాను ... అంటిరే.'

'కాని, అశాంతిగా వుంటే, ఆరాటంగా వుంటే నాకు తెలియకుండానే భగవంతుడిని తల్చుకుంటూ వుంటాను. ఇది జరిగితే మళ్ళీ నీదగ్గిరకొస్తా - పరీక్ష పాసవుతే దర్శనం చేసుకుంటా - అని రాయి అనుకున్న ఆ మూర్తిలోనే ఏదో మహత్యం వుంది, అనుకుని, మొక్కుతూ వుంటాను.'

'ఇంతకీ మీకు దేముడిమీద నమ్మకం వుందా లేదా ?'

'ఒకప్పుడు దేనిమీదా నమ్మకం వుండదు. ఒకప్పుడు వున్నాడనే ఆశకలుగుతూ వుంటుంది. నామనసు స్థిరంగా వుండదు.'

'పోనీలెండి. దేముడు వున్నాడా లేదా అన్నప్రశ్న చాలామంది తేల్చుకోలేకపోయారు. అందులో మనమూ ఒకళ్ళం' అంది నాగమణి అతనికి దగ్గరగా జరుగుతూ.

ఆమె చెక్కిలిమీద చూపుడువేలుతో ఏదో డిజైన్సు ట్రేస్ తీస్తున్నాడు. అతని వేళ్ళస్పర్శ నాగమణికి గిలిగింతలు పెడుతున్నది. ఒక్కవేలు నాలుగువేళ్ళయి - ఆమె చెక్కిల్ని సర్దుతున్నాడు. అతని అరిచెయ్యి వెచ్చగా ఆమె బుగ్గమీంచి మెడమీదకి జారుతోంది.

'మణీ - మణీ' అంటూ నెమ్మదిగా మంద్రస్థాయిలో పిలుస్తూ - ఆమెని గట్టిగా, వదలలేనట్లు గుండెలకి హత్తుకుంటున్నాడు. మాటలు, మనసులోని శంకలు ఆ దేహాల వెచ్చదనంలో మరుగున పడిపోయినాయి. ఆరోగ్యంతో, వయసుతో వచ్చే కోర్కె ఇద్దరినీ మాటలాడనివ్వలేదు.

అతని ప్రేమలో, ప్రవర్తనలో, శ్రద్ధలో నాగమణికి ఎక్కడా లోపం కనిపించేది కాదు. కాని అతని మనసు మధ్యమధ్య తననుంచి దూరమై ఎక్కడో ఆలోచనాతరంగాల్లో కొట్టుకుపోతూ, తనకి దూరంగా - చాలా దూరంగా వెళ్ళిపోతున్నట్లు అనిపిస్తూండేది. మళ్ళీ మరుక్షణంలో ఇదంతా తనవూహ. తాము అందరి దంపతులమల్లేనే, కొత్తగా పెళ్ళయినజంట లాగానే, సంతోషంగా సరదాగా వున్నాము అనిపించేది.

నాగమణి తండ్రికి అల్లుడిలో సుగుణాలేతప్ప లోపాలు కనిపించేవి కావు. తనకి కొడుకులేని లోటుతీరింది, అనుకునేవాడు. సుందర్‌రాజన్ ఆయింటి కొచ్చిన మరోవ్యక్తి అనీ, తండ్రీకూతుళ్ళమధ్య కొచ్చిన మూడో వ్యక్తి అనీ - ఎవరికీ అనిపించేదికాదు. అతను యీయింట్లో అతి సహజంగా యిమిడిపోయాడు.

ఇంటరన్‌షిప్ అయీ అవగానే నాగమణికి, ప్రయివేటు నర్సింగ్ హోమ్‌లో వుద్యోగం వచ్చింది. నెలకి అయిదువందలు జీతం. నైట్ డ్యూటీ వారానికి ఒక్కరోజు. పొద్దుట ఎనిమిదింటికి వెళ్తే సాయంత్రం నాలుగింటికి వచ్చేది. కాలేజీకి వెళ్ళేరోజుల్లాగానే - హాస్పటల్‌కి వెళ్ళేది. దినచర్యలోగాని, ప్రవర్తనలోగాని ఎక్కడా మార్పులేదు. వెనుకటికంటే, యింటిఖర్చుల విషయం కాస్త రిలాక్స్ అవటానికి వీలుగావుండేది.

సుందర్‌రాజన్ యమ్. ఎ. పూర్తి చేశాడు. అతనికి క్లాసురాలేదు. రిజల్ట్సు తెలిశాక ఒకవారంరోజులపాటు ఆశాభంగం పొందినట్లు చాలా ముభావంగా వున్నాడు. అతను యిలా నాలుగు మూడురోజులు మాట్లాడకుండా వుంటం, అంతర్ముఖుడైనట్లుగా బిగుసుకుపోయి వుంటం నాగమణికి అలవాటయిపోయింది - ఆ మూడు నాలుగు రోజులూ - మొదట్లో చాలా భయపడేది. 'ఎందుకిల్లా వున్నారు - నామీద కోపం వచ్చిందా ? మీమనసు కేమన్నా బాధకలిగించానా ?' అని గుచ్చి గుచ్చి అడిగేది. అతను 'అందేం లేదు. నాకు మనసులో బాగాలేదు. అదే సర్దుకుంటుంది' అంటూ జవాబు చెప్పేవాడు.

ఈయనకి మెంటల్ - డిప్రెషన్సు వస్తున్నాయి. వీటిని ఎలా పోగొట్టాలి ? ఎవరైనా డాక్టరు దగ్గరకు తీసుకెడ్తే ? ఏమని తీసుకెడుతుంది ? ఏమని చెపుతుంది. రండి - అంటే అతను వస్తాడా ? తను పనిచేస్తున్న - నర్సింగ్‌హోమ్‌లోని కన్సల్టెంట్ చీఫ్‌ని అడిగింది.

ఆయన కార్డియాలజీ చీఫ్ _ బాగా పేరున్నవాడు. ఓపిగ్గా పేషంట్లు చెప్పేవన్నీ వింటాడు. అసలు గుండెజబ్బులకీ - మానసికస్థితికీ మధ్య గట్టి సంబంధం ఉందని ఆయన థియరీ. రోగికి గుండెజబ్బు - గుండె బలహీనమవటానికి - అతను మానసికంగా యీ జబ్బుని ఆహ్వానిస్తున్నాడు. అంతరాంతరాల్లో, హృదయపు పొరలక్రింద _ చాలా

లోతుగా, అతను నిరాశానిస్పృహలకి లోనయిపోయి, యీ మానసిక వత్తిడులనుంచి తప్పించుకు పారిపోవాలని అనుకుంటుంటాడు. ఈ ప్రయత్నం అతని ప్రమేయం లేకుండా జరుగుతూ ఉంటుంది. ముందు రోగి మానసికంగా బలహీనమైన గుండెకి దాసుడై, గుండెబలహీనతని తనకి తెలయకుండానే ఆహ్వానిస్తుంటాడు. అదే రక్తపుపోటు వగైరాలకి దారితీస్తుంది. మనిషి మానసికమైన వత్తిడివల్ల, తనకి తెలియకుండానే, రోగాలని పిలుస్తూంటాడు. ఇది ఒకరికంగా పరిస్థితులనుంచి పారిపోయే ప్రయత్నం. బాధ్యతలనుంచి, నిరంతర పోరాటాన్నించి తప్పించుకోవాలనే కోర్కె అంటారు. అది ఆయన థియరీ. అది నాగమణికి ఒక్కొక్కప్పుడు అతి చాదస్తంగా అనిపిస్తూండేది — ప్రతిదానికీ 'మెంటల్' అంటూంటారీయన—అని! కాని, తనభర్త ఇలా డిప్రెషన్స్‌కి లోనయి, మాట్లాకుండా అంతర్ముఖుడైనపుడల్లా తన చీఫ్‌కి చూపిస్తేనో—ఆయనసలహా అడిగితేనో— అన్న ఆలోచన వచ్చేది.

ఆరోగ్యంగా, తిని తిరుగుతున్న వ్యక్తిని - మామూలుగావున్న వ్యక్తిని - డాక్టరుదగ్గరకు రమ్మని ఎలా పిలుస్తుంది ? రమ్మంటే అతను వస్తాడా ?

అతను ఉద్యోగాన్వేషణలో పడ్డాడు. గ్రేడ్ రాలేదుకాబట్టి ఎమ్. ఫిల్. చేసే ప్రసక్తి లేదన్నాడు.

'మీరు బి. ఇడి. చెయ్యండి. ఖచ్చితంగా ఉద్యోగం వస్తుంది.' అంది నాగమణి.

'నాకెవరిస్తారు ?'

'ఏం - ఎందుకివ్వరు ?'

'గ్రేడ్ రాలేదు _ నా కులం సంగతి మర్చిపోతున్నావ్.' అన్నాడు చాలా సహజంగా.

'మీరు ఉద్యోగం చెయ్యకపోతే ఏం ?' అడిగింది _ అతని ముక్కుపట్టుకు గుంజుతూ అల్లరిగా.

'అవును - చెయ్యకపోతే ఏం ?' సీరియస్‌గావుంది అతని జవాబు. అటువంటి సమయాల్లో అతని మనసులో ఏముందో చీల్చి చూడాలనిపిస్తుంది నాగమణికి. నిజంగా ఉద్యోగం అవసరం లేదనుకుంటున్నాడా ? లేక, సర్‌కాస్టిక్‌గా అంటున్నాడా ? అని. కాని, యీతను సంపాయించటం లేదన్న ధ్యాస తమయింట్లో ఎవరికీ లేదు. తండ్రికిగాని, తనకిగాని పెద్ద పెద్ద యాంబిషన్సు లేవు. తమ అవసరాలు చాలా పరిమితమైనవి - ఎప్పుడోగాని టాక్సీలూ, ఆటోలు ఎక్కరు. సినిమాల కెళ్ళటం తమకి అలవాటులేదు. మందులూ, అవీ తనే తెచ్చిస్తుంది. ఇంట్లో ఖరీదైన సామాన్లు కొనాలనిగాని, ఫ్రిజ్‌లూ, ఏర్‌కండీషన్సూవంటి 'లగ్జురీస్' తమకి అలవాటులేదు - వాటి అవసరమూలేదు. తృప్తిగా వెళ్ళిపోతున్నాయి తమ జీవితాలు.

కాని, మధ్యమధ్య తన భర్త ఎందుకిలా ముభావంగా అయిపోతూంటాడు ? ఆ సమస్యమటుకు నాగమణిని బాధిస్తూ వుండేది. 'దీనికేదన్నా దారిచూడాలి - తప్పకుండా తన చీఫ్‌దగ్గరకు తీసుకెళ్ళాలి' అనుకుంటుంటే మళ్ళీ మామూలుగా, సరదాగా అయిపోయేవాడు.

రెండేళ్ళు సమస్యలూ, కష్టాలూ లేకుండా చాలా సాఫీగా గడిచిపోయాయి. అతనికి వుద్యోగం దొరకలేదు. బిజినెస్ స్టార్ట్ చేద్దామని కొన్నాళ్ళు అనుకున్నాడు. అప్పటి కింకా పట్టభద్రులయిన నిరుద్యోగులకి ప్రభుత్వమూ బాంక్‌లూ అప్పులు యిచ్చే పథకాలు అమలులోకి రాలేదు. అంచేత పెట్టుబడి సమస్య అయి వూరుకున్నాడు. అతని ఖర్చులకీ, అవసరాలకీ ఏనాడూ లోటు చేసేదికాదు నాగమణి. అతనుకూడా సాధ్యమైనంతవరకూ నడిచే వెళ్ళేవాడు ఎక్కడికైనా. బస్సుఖర్చులుకూడా అతి స్వల్పంగా వుండేది.

ఒకసారి సుందర్‌రాజన్ రెండు రాత్రిళ్ళు యింటికి రాలేదు. నాగమణి యించుమించు పిచ్చిదానిలా అయిపోయింది. తండ్రీ, ఆమె తెలిసిన అందరినీ వాకబు చేశారు. ఏమయ్యాడు ? .... ఎక్కడి

కెళ్ళిపోయాడు? యాక్సిడెంటు అయిందా? పోలీసు రిపోర్టుకూడా ఇచ్చింది ఎక్కడైనా యాక్సిడెంటు అయిందేమో కనుక్కోమని. 'లేదు' అన్నారు వారు – రికార్డులు పరిశీలించి: ఆ రెండురోజులూ అన్నంనీళ్ళు లేవు ఆమెకి.

మూడోరోజు వుదయం యింటికొచ్చాడతను. ఒక్కసారి ఆనందంతో అతన్ని గట్టిగా పెనవేసుకుంది. పెద్దపెట్టున ఏడ్చింది – 'ఎక్కడి కెళ్ళారు? ఏమైపోయారు?' అని అడుగుతూ.

'నామనసు బాగాలేక అలా తిరిగి వచ్చాను' అన్నాడు తప్పు చేసిన పిల్లవాడిలా.

'ఎక్కడికెళ్ళారు?' కోపంగా అడిగింది.

జవాబు చెప్పలేదు.

'మీవాళ్ళింటికా?' అడిగింది తీక్షణంగా.

'కాదు.'

'మరి?'

'నన్ను నిలవతియ్యకు. తరువాత చెపుతానుగా' ప్రాధేయపడు తున్నట్లుంది ఆ కంఠం. నాగమణి మంచులా కరిగిపోయింది – మొదలియార్ గబగబా వేడినీళ్ళు కాచాడు. మళ్ళీ వేడిగా అన్నం వండాడు. తండ్రీ కూతుళ్ళు యిద్దరూ పరమానందంగా అతనికి సేవలుచేసి – సేదదీర్చారు.

ఆరాత్రి గదిలో భార్యని దగ్గిరకు తీసుకుంటూ అన్నాడు. 'మణీ, నేను చాలా అదృష్టవంతుడిని_'

'ఎందుకు?' అడిగింది.

'ఇన్నాళ్ళనుంచీ, నేను ఎవరికీ అక్కర్లేదు అనుకునేవాడిని. ప్రతి వాళ్ళకీ నేను బరువు అనుకుంటున్నాను.'

'ఎవరన్నారు? మీరు నాకు బరువా? నేను ఏడుస్తే, నాన్న మకి చెంబేలు పడతారని – ఏడుపు నోట్లోనే కుక్కుకుని వూరుకునేదాన్ని – ఆయన పిచ్చివాడయిపోయారు....'

'అందుకే అంటున్నది, ఇంత ప్రేమించే మీరు వుండగా నాకేమిటి అనిపిస్తోంది ? నేను యింత అభిమానానికి తగను' అన్నాడు బాధతో.

'ఛ-ఛ అల్లా మాట్లాడకండి. మొదటిరోజుల్లో - మనం కల్సుకున్న మొదట్లో యిలాగే మాట్లాడేవారు. అప్పుడే మనిపించిందో తెలుసా ?'

'ఏమనిపించింది.'

'ఈ పిల్లాడిని యిలా యిక్కడ దాచుకోవాలి - ఎప్పుడూ కష్టం కలగనివ్వకూడదు' అంటూ గట్టిగా తన గుండెలకి హత్తుకుంది అతనిని. ఆరాత్రి అతిమధురంగా గడిచింది. రెండురోజుల ఎడబాటు, ఆదుర్దా, అతనేమయిపోయాడో అన్నభయం, మళ్ళీ తిరిగివచ్చిన ఆనందం - యీరెండూ మిళితమయిపోయి, వారిద్దరినీ, వుక్కిరి బిక్కిరి చేశాయి. గాలికూడా చొరనంతగా ఒకరి నొకరు పెనవేసుకుపోయారు - మళ్ళీ ఎన్నడూ ఎడబాటు సహించబోము అన్నట్లుగా.

ఆమరునాడు మొదలియార్ అడిగాడు. 'నాయనా ఎక్కడికెళ్ళావ్ ? చెప్పి వెళ్ళకపోయావా ? చాలా ఖంగారుపడ్డాం' అని. ఆ వృద్ధుని కంఠం లోని ఆవేదనకి చలించిపోయాడు సుందర్‌రాజన్.

'ఇంకెప్పుడూ అలా చెయ్యనండి. మీకు చెప్పకుండా వెళ్ళను' అన్నాడు. కాని ఎక్కడికి కెళ్ళాడోమటుకు చెప్పలేదు.

ఆ తరువాత సంసారం వొడుదుడుకులు లేకుండా సాఫీగానే సాగిపోయింది. అతను వుద్యోగాల కోసం ప్రయత్నిస్తున్నాడు. చాలాచోట్ల అప్లికేషన్సు పెట్టాడు. రోజూ వాంటెడ్‌కాలమ్స్ చదవటం - అవకాశాలకి ప్రయత్నించటం - ఇది మామూలు అయింది. తనకిగాని, తండ్రికిగాని అతను సంపాయించటంలేదు, వూరికే కూచుని వున్నాడు - అన్న ఆలోచనలు వచ్చేవి కావు. తమ ముగ్గురికీ ఖరీదైన అలవాట్లు లేవు. జీవితావసరాలకి మించి తమకి కోర్కెలు వుండేవికావు. సంతృప్తిగా,

హాయిగా వుండేది తనకి. అవ్వాళ తను మామూలుగానే నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళటానికి తయారయింది. రోజులాగానే అతను వుదయం వీధిదాకా వచ్చి చెయ్యివూపి బైబై చెప్పాడు. మధ్యాహ్నంపూట తండ్రీ, అతనూ కలిసి భోంచేస్తారు. నాలుగింటికి తను వచ్చేప్పటికి ఏ ఇడ్లీయో, ఊతప్పమో చేసి – ఇద్దరూ కనిపెట్టుకుని ఉంటారు. కబుర్లు చెప్పుకుంటూ తింటారు.

'ఈరోజు పొంగల్ చేస్తాను – తొందరగా వచ్చెయ్–' అన్నాడతను నవ్వుతూ తను బయటకి వెళ్ళేముందు.

'మీరా – మీకేంవచ్చు – నాన్న చేస్తాడులెండి' అంది తను.

'కాదు – నేనే చేస్తాను. చూడు....నాకు కట్టెపొంగలి చెయ్యటం బాగా వచ్చు. గుళ్ళోకి చేసేవాడిని....' అన్నాడతను.

నాగమణి ఆశ్చర్యంగా చూసింది అతనివైపు. ఈమధ్య అతను గుడిగురించిగాని, పూర్వపు తన జీవితంగూర్చిగాని మాట్లాడటంలేదు. మైలాపూర్‌వైపుకి గాలి మళ్ళిందా ? ఈ యిల్లు, ఈ పరిసరాలూ అతనికి విసుగ్గా ఉన్నాయా ?

'అల్లాగే వస్తాను.' అంది చిరునవ్వుతో.

అయిదింటికి వచ్చేప్పటికి నాన్నా, అతను కబుర్లుచెప్పుకుంటున్నారు. తనని చూడగానే అతను ఎదురువచ్చాడు. 'త్వరగా కాళ్ళూ చేతులూ కడుక్కునిరా....పొంగలి చల్లారిపోతోంది.' అన్నాడు హడావుడిగా.

'ఇవ్వాళ అబ్బాయే టిఫిన్ చేశాడమ్మా – చాలా రుచిగావుంది. నేను కాస్త తిని చూశాను.' అన్నాడు తండ్రి ఉత్సాహంగా.

నాగమణికి యీ మామా అల్లుళ్ళమధ్య బాంధవ్యం చూస్తే తమాషాగా వుండేది. ఇతన్ని యింటికి తీసుకురావటానికి, యీతని పరిచయం గురించి చెప్పటానికి తను ఎంత భయపడిపోయింది ? అల్లాంటిది తన భర్త ఈయింట్లో అతిసహజంగా కలిసిపోయాడు. తండ్రికి కొడుకులేని

లోటు తీర్చాడు. అరవై ఏళ్ళు దాటుతున్న తండ్రి, ముప్పైఏళ్ళున్న యితనికి మధ్య సంభాషణ, యిద్దరూ కూడబలి అతి తీవ్రంగా చర్చించే రాజకీయాలు, ధరలూ, వుద్యోగావకాశాలు వింటుంటే - నాగమణికి తమాషాగా వుంటుంది. ఒక్కొక్కప్పుడు వాళ్ళిద్దరూ ఒకటి - తనకి వారు మాట్లాడుకునే విషయాలు అర్థం అవవు - తను మూడోవ్యక్తి అని కాస్త అసూయకూడా కలుగుతూ వుంటుంది.

మిరియాలు, వెన్నకాచిన నెయ్యి వేసి చేసిన ఆ కట్టెపొంగలి నిజంగానే రుచిగావుంది. బరువుగాకూడా ఉంది పొట్ట. పొంగలీ, కాఫీ అయాక - కాసేపు కబుర్లు చెప్పుకున్నారు ముగ్గురూ.

'మణీ - ఓ ఫ్రెండింటికి వస్తానన్నాను. వచ్చేప్పటికి ఆలస్యం అవచ్చు. నాకోసం వెయిట్ చెయ్యకండి. భోంచేసెయ్యండి.' అని చెప్పులువేసుకు బయలుదేరాడు. పగలంతా నర్సింగ్ హోమ్‌లో కాళ్ళమీద నిలబడివుంటంచేత - సాయంత్రాలు సాధారణంగా పక్కమీద పడుకుని, ఏ వారపత్రికో చేతిలో పుచ్చుకు - రెస్టుతీసుకుంటుంది. ఎప్పుడోగాని యిద్దరూకలిసి బయటికెళ్ళరు.

'త్వరగా వచ్చెయ్యండి.' అంది చదువుతున్న సీరియల్‌లోంచి తలఎత్తి చూడకుండానే. ఆరాత్రి ఎంతసేపయినా అతను తిరిగిరానేలేదు. పది, పదకొండు___ఒంటిగంట, రెండు___టైము చూసుకుంటూవుంది___ ఆదుర్దాతో. ఎక్కడికెళ్ళాడు? మళ్ళీ ఏమయింది! ఇది రెండోసారి కాబట్టి మొదటిమాటులాగా ఏయాక్సిడెంటయిందో, ఏ ఆస్పత్రిలో పడి వున్నాడో అన్న భయాలు క్రితంసారంత పీడించలేదు.

తెల్లవారింది _

తండ్రీ కూతుళ్ళు యిద్దరూ, చాలా ఆదుర్దాగా ఎదురుచూశారు. మధ్యాహ్నం అయింది. అతను రాలేదు. పోలీసురిపోర్టు యివ్వనా, వద్దా - క్రితంసారిలాగా ఏ రెండురోజులో పోయాక తిరిగి వస్తాడేమోనన్న ఆశ.

ఆరోజు ఎలాగో అలా గుండెరాయిచేసుకు డ్యూటీకి వెళ్ళింది. మరునాడూ వెళ్ళింది. మూడురోజులయింది – అతను రాలేదు.

'నాన్నా....ఎలా ? ఏంచెయ్యను ?' అడిగింది ఏడుస్తూ. రోజూ పేపర్లో వెతుకుతూ వుంది. ఎక్కడైనా యాక్సిడెంట్ అయిందా ? ఏదన్నా ట్రాఫిక్ కేసు గురించి పడుతుందా అని.

'వాళ్ళింటికెళ్ళి చూసిరానా ?' అడిగాడు ఆయన.

'నేనూ వస్తాను నాన్న – నాకు పిచ్చి ఎక్కేట్లుగా వుంది – ఒక్క మాట చెప్పకూడదా. ఒక్క ఉత్తరం రాసిపడెయ్యకూడదా ? ఎందుకిల్లా చేస్తున్నారు, నాన్నా ? వాళ్ళింటికి వెళ్ళి అడిగొద్దాం.'

ఇద్దరూ ఆటో కట్టించుకు వెళ్ళారు.

ఆయింటి కెళ్ళాలీ అంటే – నాగమణికి భయంగా వుంది. మూడున్నరఏళ్ళక్రితం, తాము పసుపుబట్టల్తో వెళ్ళినపుడు అతని తండ్రి తర్పణాలు వదులుతూ కన్పించాడు. కుటుంబం అంతా అతనికి నీళ్ళు వొదిలారు. ఈరోజు వెళ్తే ఏమంటారు ? మొహాన తలుపులేస్తారా ? అతను లోపల వుంటాడా ? వుండి రాలేదు అంటారా ? మూడున్నరఏళ్ళుగా యిటువైపు రానివాడు – ఈరోజు వెళ్ళివుంటాడా ? ఆటో వీధిచివర ఆపుకుని గబగబ అడుగులువేస్తూ – ఆయింటి గుమ్మందగ్గర కెళ్ళి నుల్చుని మనసులోని ధైర్యాన్ని, దేహంలోని శక్తిని కూడతీసుకు తలుపుకొట్టింది.

తలుపు తెరుచుకుంది. తలుపు వెనకాతల ఎవరో అపరిచితస్త్రీ.

'ఇది – ఇది కృష్ణమాచార్యులిగారి యిల్లేనా ?'

'అవును.'

'ఆయన యింట్లోలేరా ?' అడిగింది _ నాలికతో తడిఆరిపోతున్న పెదాలని తడుపుకుంటూ.

'ఉన్నారు.'

'ఒక్కసారి పిలుస్తారా ?'

'మీరెవరు ?'

'నేను_నేను....' తడుముకుంటున్నది మాటలకి.

'అబ్బాయి మూడురోజులయింది - ఇంటికి రాలేదు. చాలాచోట్ల వెతికాము. ఇక్కడికి వచ్చాడేమోనని...'

ఎప్పుడొచ్చాడో తనవెనక వణుకుతున్న తండ్రి కంఠం.

'ఏఅబ్బాయి ?' ఆస్త్రీ అర్థంకానట్లు ప్రశ్న.

'సుందరరాజన్'

'మామయ్యా, మీకోసం ఎవరో వచ్చారు' పిలుస్తూ లోపలి కెళ్ళింది. ఆమె తమని రమ్మనలేదు. వీరికి లోపలికి వెళ్ళే సాహసంలేదు.

'ఎవరూ ?' తడిపెంట్రుకలని దులుపుకుంటూ వచ్చాడు లోపలినుంచి కృష్ణమాచార్యులు.

'నేను - నేను. మీఅబ్బాయి కనపడటంలేదు. మూడురోజులయింది.'

'వాడు చచ్చిపోయి మూడున్నర ఏళ్ళయింది - నాకిద్దరే కొడుకులు' గభాలున తలుపులేసుకున్నాడు అయన - గడపలోపలినుంచే.

'నాన్నా, ఏంచెయ్యను ?' అలా అరుగుమీదనే కూలబడిపోయింది, కన్నీళ్ళుకూడా తుడుచుకోటం మర్చిపోయి.

'పోలీసురిపోర్టు యిచ్చి, ఇంటి కెడదాం. ఒకవేళ యీపాటికి వచ్చేసి వుంటాడేమో...ఏం అయివుండదు. మనం వెళ్ళేప్పటికి వచ్చేసి వుంటాడు ... చూడు, ధైర్యంతెచ్చుకో, పద .... ఇక్కడికి రావటం అనవసరం. పదమ్మా, పద' రెక్కపుచ్చుకుని, బలవంతాన తీసుకెళ్ళాడు తండ్రి.

# 8

ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు, ఆరు, ఏడురోజులు గడిచి పోయాయి. తెల్లవారుతోంది – పొద్దువాలుతోంది. చీకటిపడుతోంది – మళ్ళీ వెల్తురువస్తోంది. సూర్యాస్తమయం అవుతున్నది – తిరిగి సూర్యోదయమూ అవుతున్నది. రోడ్డుమీద మనుషులు తిరుగుతున్నారు. బస్సుల్లో జనం పెళుతున్నారు. గడియారం గంటలు కొడుతున్నది – కిటికీలోంచి గదిలోకి గాలివస్తోంది. వెల్తురూ వస్తున్నది, చీకటీ వస్తున్నది, ఆ చీకటిని ఛేదించటానికి దీపాలు వేసుకుంటున్నారు.

అతను రాలేదు. రోజూ తండ్రి కాఫీకాచి తీసుకొస్తాడు – 'అమ్మా, తాగు' అని. తనకి గుటకపడదు. 'నువ్వు ఖంగారుపడకు. పోలీసురిపోర్టు యిచ్చాంగదా! ఎక్కడా యాక్సిడెంట్ అవలేదు అంటున్నారు. అంచేత క్రితంసారిలా ఏ స్నేహితుడింట్లోనో గడిపిరావచ్చు – తాగు' అని బలవంతం చేస్తాడు. అతను 'వస్తాడు' అని తండ్రి ధైర్యం చెప్పినపుడు నోట్లోని కాఫీ గొంతులోకి జారుతోంది – గుటకపడుతోంది.

'అమ్మా....నువ్వు నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళు. ఎన్నాళ్ళు యింట్లో కూచుంటావు, నామాట విను. అతను యింటికి రాగానే, తక్షణం వచ్చి నీకు చెపుతాను. రాగానే టాక్సీలో ఎక్కించుకుని తీసుకొస్తాను – నువ్వు డ్యూటీ మానకు – వెళ్ళమ్మా....'

నాలుగోరోజున నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళింది. మనసు ఒకవైపు మొద్దుబారినట్లుగా వుంది, మరోవైపు అతని రాకకై నిరీక్షిస్తున్నది. ఫోన్ మోగినా, నర్సింగ్‌హోమ్‌ముందు ఏకారు ఆగినా తండ్రి అతన్ని తీసుకొచ్చాడేమోనన్న ఆశ.

బాస్‌తో చెప్పింది 'సార్, యిలా జరిగింది. ఆయన వారంరోజుల నుంచీ కనపడటంలేదు' అని.

'ఇదివరకు రెండురోజులు రాలేదు అన్నావుగా – అప్పుడూ యిలాగే చేశారా ?'

'చెప్పకుండా వెళ్ళిపోయి, మూడోరోజు తిరిగి వచ్చేశారు.'

'వచ్చాక ఎక్కడికి వెళ్ళారో చెప్పారా ?'

'చెప్పలేదు.'

'మీరు అడిగారా ?'

'అడిగాను. ఆ విషయంతప్ప అన్నీ చెప్పారు. ఇంకెప్పుడూ యిల్లా చెయ్యనన్నారు.'

'మీరు మిస్టేక్ చెయ్యనంటే – ఒక డౌట్ – మీ హస్బెండ్‌కి.... యితర యింటరెస్ట్లు, గరల్‌ఫ్రెండ్సూ, డ్రింక్, కార్డ్సు యిలాంటివి వున్నాయా ?'

'లేవండి, అబ్సల్యూట్‌లీ నిల్ – అలాంటి అలవాట్లులేవు' అంది నాగమణి దృఢంగా.

'చిన్నచిన్న తగాదాలూ, భేధాభిప్రాయాలూ ?'

'ఉహూ, అలాంటివేంలేవు. మాది చాలా కంటెంటెడ్ లైఫ్.'

'వాళ్ళ వాళ్ళింటికి వెళ్ళారేమో ?'

'లేదు అక్కడికీ వెళ్ళొచ్చాను' నాగమణి కడుపులోంచి తన్నుకొస్తున్న దుఃఖాన్ని అణుచుకోలేకపోతున్నది. అలా టేబుల్‌మీద తల వాల్చుకుని, సైలెంట్‌గా ఏడ్చేస్తున్నది.

'డోంట్ లూజ్ యువర్ కంపోజర్ – కంపోజ్ యువర్‌సెల్ఫ్ డాక్టర్ – పోలీసురిపోర్ట్ యిచ్చానన్నారుగదూ–'

'ఇచ్చామండీ.'

'యాక్సిడెంట్‌లూ–'

'అవేం వాళ్ళదృష్టికి రాలేదుట' కళ్ళనీళ్ళు తుడుచుకునే ప్రయత్నం కూడా చెయ్యలేదు – నాగమణి.

'అయితే – ఎక్కడో ఏ ఫ్రెండుదగ్గిరో ఉండివుంటారు. ఛేంజికోసం వెళ్ళుంటారు. అసలు మీరింటికెళ్ళేప్పటికి వచ్చివుండవచ్చు – బి బ్రేవ్....'

'ఈ సస్పెన్సు భరింలేకుండావున్నాను. ఒక ఉత్తరం – ఎక్కడైనా సరే – క్షేమంగావున్నారని ఒక్కమాట, ఎవరిచేతైనా కబురుపంపితేచాలు.'

'నిజమే........మన ఖంగారుపడటానికి తగినంత కారణం ఉండాలి. ఎలిమినేషన్ ప్రోసెస్‌లో ఆలోచిస్తే – ఖంగారుపడటానికి – నాకెక్కువ కారణాలు కనిపించటం లేదు. పోలీసులు యాక్సిడెంట్ జరగలేదు అంటున్నారు – తమ రికార్డ్సులో మీరుచెప్పిన గుర్తులుగల వ్యక్తి లేడు అంటున్నారు. ఆడవాళ్ళూ, పసిపిల్లలూ అయితే – ఎవరన్నా నిర్బంధించారేమోనని అనుమానించవచ్చు. చదువున్నవారు – అన్నీ తెలిసినవారు. కాబట్టి, పట్టబలవంతాన దాచిపెట్టే అవసరం ఎవరికీ ఉండదనుకుంటా. అందుచేత, ఆయనఅంతట ఆయనే 'ఛేంజి'కోసం వెళ్ళివుండవచ్చు. యు ఆర్ షూర్ – ఆయన మైలాపూర్‌లో తండ్రిదగ్గర....'

'ఉహు – ఈయన వెళ్ళరు – వెళ్ళినా ఆయన రానివ్వరు–'

'అయితే మీరు ధైర్యంగా ఉండచ్చు. మనసు సరిగ్గాలేక ఏ 'ఛేంజి' కోసమో వెళ్ళివుండచ్చు. ఒకటిరెండు రోజుల్లో వచ్చేస్తారు. మీరేం భయపడకండి. వూరికే ఆలోచించి భయపడుతూ కూచోక – వర్కులో మిమ్మల్ని మీరు మర్చిపోండి. అదొక్కటే నేనివ్వగల సలహా' అన్నాడు బాస్ సానుభూతితో. మూడున్నర ఏళ్ళకి ఈరోజా యిన్ని మాటలు మాట్లాడింది. ఎప్పుడూ 'ఇది చెయ్యండి - అది యిలాచెయ్యండి'—అని ట్రీట్‌మెంటూ, మందులూ విషయంతప్ప – మిగతామాటలు ఉండేవికాదు తమ మధ్య. ఆయన తనకోసం యింతసైము ఖర్చుచేశారు. సానుభూతితో మాట్లాడారు. ఈ ఓదార్పుమాటలు తనకి శక్తిని యివ్వటంలేదు. ఆయన భయపడకండి అని సలహాయిచ్చాడుకాని, తన మనసుని అదుపులోపెట్టుకోలేకుండా ఉంది. తన బుర్రని స్వాధీనంలోకి తెచ్చుకోలేకుండావుంది.

మొదటిరోజు : మరునాడు వస్తాడన్న ఆశ ; రెండోరోజు : ఇంత క్రూయల్‌గా అతను ప్రవర్తించాడన్న కోపంతో మిళితమై బాధ – రాగానే గట్టిగా అడగాలి – ఏమేమి అడగాలి అన్న ఆలోచనలు ; మూడోరోజున : మైలాపూర్‌లో ఉన్నాడేమోనన్న ఆశ ; నాలుగోరోజు : నిరాశ, నిస్పృహ ; అయిదు-ఆరు రోజులు : తనకి తెలియకుండానే — 'ఏది జరగాలసివుందో అది జరుగుతుంది – తనచేతుల్లో ఏమీ లేదు' — అన్న నైరాశ్యత – ఒకరకంగా మెదడు మొద్దుబారి, ఆరురోజుల అతని వియోగానికి అలవాటుపడిపోయింది. ఫ్లాస్కులో మరోకప్పు కాఫీ—పుగ్గురి కోసం వంట—మూడు పళ్ళాలు, రెండు మంచాలు. ఖాళీగావున్న ఆ మూడోపళ్ళెం పెట్టే స్థలం చూసి – కన్నీళ్ళు, ఆగకుండా వచ్చే దుఃఖం, ముద్దదిగకుండా పూడుకుపోతున్న అన్నవాహిక—ఖాళీగావున్న రెండో మంచం. రాత్రంతా కిటికీలోంచి చీకట్లోకి వెతుకుతూ చూస్తున్న రెండు కళ్ళు – కన్నీటితో మసకలువారుతున్న రెండు కళ్ళు, కన్నీరు క్రమక్రమంగా యింకిపోతున్న పొడి కళ్ళు — ఆశలో, భయంతో, బెంగతో, ఏంజరిగిందో తెలియక కొట్టుమిట్లాడుతూ, ఆశనిరాశల మధ్య ఊగిసలాడుతూవున్న స్థితి.

తను లాబ్‌లో కూచుని – పేషంటు కేసుషీట్‌మీద రిపోర్టు చెక్ చేస్తూవుంది. ఈ ఫైలు ఒకటి పేషంటు డిశ్చార్జిఅవుతున్నపుడు యిస్తారు. దీని డూప్లికేట్ నర్సింగ్‌హోమ్ రాకుల్లో ఉంటుంది. ఆ ఫైలు నెంబరు చూసుకుని పేషంటుకి మిగతా ట్రీట్‌మెంటుగాని, మధ్యమధ్యవచ్చే జనరల్ చెకప్‌గాని ఉపయోగపడుతుంది. పేషంటు ప్రతిసారీ – తనపేరూ, ఫోల్డరు నంబరూ చెప్పాలి – వచ్చినపుడల్లా. అటువంటి ఫోల్డర్‌లోని డిటైల్సు చెక్‌చేస్తున్నది నాగమణి. ఆమెకి ఫోన్ వచ్చింది – ఎవరో ఫోన్‌లో పిలుస్తున్నారన్న వార్త.

ఒక్కసారి హృదయం ఆశతో గంతువేసింది. మరుక్షణంలో ఏదో భయం. ఎవరు ? తండ్రా ? అతనొచ్చేశాడా ? — తన భర్త యింటి కొచ్చేశాడా. గబగబ - తడబడే అడుగుల్తో, అదిరే గుండెల్తో - రిసీవర్ ఎత్తింది -

'హలో - డాక్టర్ నాగమణేనా ? నేను డాక్టర్ జుబేదాని మాట్లాడు తున్నాను. ఒక్కసారి రాగలవా ?'

'దేనికి ?' అదిరే గుండెల్తో అడిగింది.

'ఏంలేదు - మన ఓల్డు ఫ్రెండు డాక్టర్ లీల వచ్చింది.... వెంటనే రాగలవా ?'

'ఇప్పుడా ?'

'ఇప్పుడే - తను వెళ్ళిపోతోందిట .... రా - గేటుదగ్గర వెయిట్ చేస్తూంటాను.'

'ఎక్కడ ?'

'జి. హెచ్ గేటుదగ్గర.'

నాగమణి చెయ్యి గజగజ వణుకుతూ వుంది. 'హల్లో హల్లో' అని పిల్చింది - నూతులోంచిలాగా. అవతల ఫోన్ క్లిక్ అన్న శబ్దం.

తనకి వెళ్ళాలంటే భయంగా వుంది. జుబేదా దేనికి పిలుస్తోంది ? ఒక్కత్తే వెళ్ళే ధైర్యం లేకపోయింది. ఇంకోగంటకిగాని డ్యూటీ లేని నర్సుని తీసుకుని టాక్సీ ఎక్కింది.

పదినిముషాల్లో జి. హెచ్. కి జేరుకుంది. ఆపదినిముషాల్లో నాగమణి బుర్ర - నల్లని తెరకప్పుకున్నట్లు, అఖాతంలోకి పడిపోయినట్లు జ్ఞాపకం గాని, పరిసరాలని గుర్తించే జ్ఞానంగాని లేకుండా అయిపోయింది. గేటు గుమ్మంలో జుబేదా.

డాక్టర్ జుబేదా నాగమణి చెయ్యిపట్టుకుంది. బుజాలమీద చెయ్యేసింది. 'నీతో పనుండి రమ్మన్నాను....లోపలికి వెళదాంరా' అంటూ

తనకి చిరపరిచితమైన వార్డులు, వరండాలు తప్పించి – రెండోగేటువైపుగా తీసుకువెళ్తోంది.

'జుబేదా ! ఏంజరిగింది ? చెప్పు దాచకు' ఏడుపుకంఠంతో అడిగింది నాగమణి.

'నాకు అనుమానంవచ్చి రమ్మన్నాను. ఖంగారుపడకు. కాదనే 'ప్రే' చేస్తున్నాను – కాకుండా వుండాలనే' యనాటమీ డిపార్ట్మెంటు దాటుకుంటూ, ఆపక్కగావున్న పొడుగాటి చీకటి చీకటిగావున్న హాలువైపుకి తీసుకెడ్తోంది.

నాగమణి తనని తాను కంట్రోల్ చేసుకోవాలని, ప్రయత్నిస్తూ వుంది. అడుగు ముందుకు పడటంలేదు. జుబేదా చేతికిందనున్న ఆమె భుజాలు కిందకి జారిపోయి, నేలమీద కుప్పలా కూలిపోయింది.

'మణీ,మణి. బి బ్రేవ్ – నువ్వు డాక్టర్వి. అన్నీ తెలిసినదానివి. అసలు అవునో కాదో. నేను పొరబడ్డానేమో. అందుకే నిన్ను రమ్మన్నాను' అంది జుబేదా.

పొడవుగా, చీకటి చీకటిగావున్న హాలు. పైనించి వేళ్ళాడుతున్న బల్బులు. నిర్మానుష్యంగావున్న వరండా. లోపల అయిదుగురు స్టూడెంట్సు. చుట్టూ ఆప్రాన్స్ కట్టుకుని, మెడికల్కోట్స్ కాటోలు వేసుకుని ఉన్నారు. అప్పటిదాకా సన్నసన్నగా వినిపిస్తున్న మాటలు – యీయిద్దరూ రావటంతో గబుక్కున ఆగిపోయాయి.

పొడవాటి మానవాకారం. రసాయనాల్లో నానబెట్టబడి – బిగుసుకుపోయి, తెల్లగా కాయితంలావున్న మానవాకారం. నాగమణి ముందుకువంగి, బల్బుకాంతిలో ఆముఖంవైపు చూసింది. స్పృహతప్పి అక్కడే పడిపోయింది.

నెత్తిమీద సుత్తితోకొట్టినట్టు ఠంగున శబ్దం. నాగమణి వులిక్కిపడి చుట్టూ చూసింది. తాను జనరల్హాస్పిటల్లో, యనాటమీ డిపార్ట్మెంటులో

లేదు. తనయింట్లో నిశ్శబ్దంగా, ఎక్కడా మనుషులులేని - యింట్లో వంటరిగా ఏకాకిగా వుంది. 'ఠంగు' మన్న ఆశబ్దం ఎక్కడిది? తలఎత్తి చూసింది - గోడగడియారం వొంటిగంట కొట్టింది.

ఒంటిగంట అయిందా? బయట ఎండ బాగానే వుంది. ఎంత మర్చిపోదామని ప్రయత్నించినా, ఆ టేబుల్‌మీదనున్న అతని ఆకారం జ్ఞాపకం రాక మానటంలేదు. తను ఎన్నిసార్లు ఆహాలులోకి రాలేదు? స్టూడెంట్‌గా ఎన్ని మానవాకారాలు కోయలేదు? ఆరోజుల్లో - ఆడ, మొగ రెండు దేహాలు కొయ్యాల్సివస్తే, ఎంత క్రూయల్‌గా జోక్ చేసుకునేవారు. మగస్టూడెంట్సు అవి తమలాంటి మానవాకారాలే అని మర్చిపోయి, మగకాలు ఆడదేహానికి, ఆడదేహపు అవయవాలు మగకళేబరానికి తగిలించి నవ్వేవారు. దిక్కులేని ఆ దేహాల్తో మగస్టూడెంట్సు అంత 'కేలస్'గా ఆడుతూ జోక్‌చేస్తుంటే - మొదట్లో వొళ్ళు జలదరించినా, రాను రాను అలవాటయిపోయింది. అప్పుడు అనిపించేది, అనాథలైన యీ మృతదేహాలు - వారూ ఒకప్పుడు ప్రాణంవున్న మనలాంటి మనుషులే. వారికీ ప్రేమలూ, కోపతాపాలు, మనలా నవ్వగల హృదయమూ వుండి వుంటాయి. ఆ దేహాల గురించి యిలా జోక్ చెయ్యటం న్యాయంకాదు అని.

కాని, కాని అదేస్థితిలో - తన భర్త తను ప్రేమించి పెళ్ళి చేసుకున్న సుందర్‌రాజన్, క్రూయల్‌గావున్న ఆ యనాటమీ డిపార్ట్‌మెంటు లోని, ఆఖరి హాల్లో చల్లగా - కట్టెలాగా బిగుసుకుపోయిన అతని దేహం చూసేటప్పటికి - నాగమణి - అన్నీ మర్చిపోయి అక్కడే స్పృహతప్పి పడిపోయింది.

ఆతరువాత? ఆతరువాత? తండ్రికి కబురు పెళ్ళింది. నర్సింగ్ హోమ్‌లోంచి బాస్ - సాఫ్‌ని పంపారు. యాంబులెన్సు పంపారు. సానుభూతికి కొలీగ్స్ వచ్చారు.

ఎలా జరిగింది? అనాధగా ఎక్కడ పడివున్నాడు? ఎవరికి దొరికాడు - అనాధగా అయిన శవంతప్ప, స్టూడెంట్స్‌కి 'డైసెక్షన్'కి దొరకదు. అంటే అతను ఎవరికీ చెందనివాడు, ఎవరూ లేనివాడుగా నమోదు చెయ్యబడ్డాడు కాబోలు. ఇంతకంటే అన్యాయం, ఘోరం ఎక్కడైనా వుంటుందా? మూడురోజులక్రితం మహాబలిపురం సముద్రపుఒడ్డున పడివున్నాడుట. ఒక యువకుని శవం. బట్టలు తడిసిపోయినాయి. జేబులో కాయితాలు లేవు. గుర్తులు లేవు. ఎవరూ వాకబు చెయ్యలేదు. పోలీసులు జి. హెచ్ కి అప్పజెప్పారు. వయసులోవున్న, ఆరోగ్యంగావున్న శవాలు అరుదుగా దొరుకుతాయి. అనాధ, గుర్తుతెలియని, ఎవరూ వాకబు చెయ్యని శరీరం కాబట్టి యనాటమీకి వొప్పజెప్పారు....జుబేదా ఆరోజు అనుకోకుండా అటువైపు వచ్చి, ఆ హాల్లోకి తొంగిచూసింది. ప్రొఫెసర్ యింకా రాలేదని, స్టూడెంట్సు వెయిట్ చేస్తున్నారు. ఆ టైములో బల్లమీద, ఆదేహాన్ని చూసి - ఖంగారుపడి, గుర్తించి, ఆ విషయాన్ని ప్రొఫెసర్‌కి తెలిపి, ముక్కలు చెయ్యకుండా ఆపింది. పైన బట్టకప్పి, నాగమణి వచ్చేదాకా ఆగారు.

'అతనివాళ్ళకి చెప్పద్దూ? తల్లీతండ్రీ వున్నారంటున్నారు' ఎవరిదో కంఠం.

అతని యింటికి కబురు వెళ్ళిందిట. తండ్రి 'నాకు సంబంధంలేదు. నాకొడుకు ఎప్పుడో చచ్చిపోయాడు' అని వెళ్ళినవాళ్ళ మొహంమీద తలుపు భడాలున వేశేడుట. ఈవార్త విడ్డూరంగా చెప్పుకుంటూ, వెనక్కి తిరిగి వచ్చారు.

ఏర్పాట్లన్నీ జరిగాక - మరికాసేపటికి అతని దేహాన్ని తీసుకెళ్ళిపోతారనగా....అతని తల్లి, ఆవిడ భర్తకి తెలియకుండా, రహస్యంగా వచ్చి కొడుకుశవంమీదపడి రాగాలుపెట్టి ఏడ్చింది. ఆమెని ఎవరూ వోదార్చలేదు.

ఆవిడ నాగమణిని పల్కరించలేదు - ఎవరితోనూ మాట్లాడలేదు. కడుపులోని దుఃఖాన్నంతా ఆకక్షైముందు వెళ్ళబోసుకుని వెళ్ళిపోయింది.

మరణం అంటే ఏమిటి? అలా చల్లగా - అతి నిర్దాక్షిణ్యంగా, ఎవరో గుర్తు చెప్పుకోలేక, తాను ఎవరితాలూకు దేహమో చెప్పుకోలేక, ఈలోకంలోని భవబంధాలతోపాటు, బాంధవ్యాల్నికూడా తెంచుకుని పోవటమా? అతను ఎందుకిలా చేశాడు? ఇది ఆత్మహత్యా. లేక సముద్రపు వొడ్డుకి అనుకోకుండా వెళ్ళి మునిగిపోయిన యాక్సిడెంటా? అసలు అతను ఎందు కెళ్ళిపోయాడు యింట్లోంచి? మహాబలిపురందాకా ఎందుకెళ్ళాడు? అతనికి అక్కడెవ రున్నారు?

ఆత్మహత్యో, యాక్సిడెంటో చెప్పలేకుండా వున్నారు. ఆత్మహత్య ఎందుకు చేసుకోవలసివచ్చింది? జీవితంపైన అతనికి విసుగొచ్చిందా? ఎందుకు? తానేం చేసింది? తనని వదిలి వుండలే ననేవాడు, తను లేకుండా బ్రతకలే ననేవాడు ఎక్కడి కెళ్ళాడు? దేహం విడిచిపెట్టినా, అతని ఆత్మ తనచుట్టూ తిరుగుతుందా? అసలు మరణం అంటే? తను డాక్టరు. రక్త ప్రసారం ఆగిపోతుంది. గుండె అనే యీపరికరం - పనిచెయ్యకుండా ఆగిపోతుంది, అని తనకి తెలుసు. అయితే అంతేనా? ఈనవ్వులకి, యీ బాంధవ్యాలకి, యీ మానసికవ్యధకీ - ఇదొక్కటే సమాధానమా? అతను ఆత్మహత్య చేసుకున్నాడా - ప్రమాదవశాత్తూ అలల్లో చిక్కుకున్నాడా? అసలు మహాబలిపురం ఎందుకెళ్ళాడు? తను ఏంలోపం చేసింది? గంతలు కట్టుకున్న గానుగఎద్దులాగా తిరిగి తిరిగి ప్రశ్నించుకుంటున్నది. నాగమణి మాట్లాడటం మర్చిపోయింది. కదలటం మర్చిపోయింది. కళ్ళు తెరిచి చూడటం మర్చిపోయింది. తిండి తింటం మర్చిపోయింది. వెల్తురుని చూడటం మర్చిపోయి, చీకటిలో, అలా కిటికీలుదగ్గరనుంచీ మూసుకుని చీకటో - పగలూరాత్రి గడుపుతూ వుంది. ఎందుకు? ఎందుకు? ఆ

యనాటమీటేబుల్‌మీదనున్న ఆ కళేబరానికి అర్థం ఏమిటి? ఇవే ప్రశ్నలు ఆమె బుర్రలో తిరిగి తిరిగి జయింట్‌వీలులాగా, గుండ్రంగా అడుగునించి పైకి, పైనుంచి అడుక్కి తిరుగుతూ వున్నాయి.

తల్లి చనిపోయినపుడు తనకు యింతబాధ అనిపించలేదు. ఈ ఏకాంతత, వంటరితనం తను ఎలా ఎదుర్కొంటుంది? అతని మనసులో ఏముంది? నిజంగా జీవితాన్ని అంతం చేసుకోవాలనే అనుకున్నాడా? ఎందుకని? తల్లితండ్రులమీద ప్రేమా? వారినించి దూరంగా వచ్చాననే బాధా? కాని ఏనాడూ వాళ్ళని గురించి తలుచుకోలేదే? అటువైపు ప్రేమాభిమానాలు కరువైపోయాయనేగదా బాధపడుతూండేవాడు. ఒకవేళ తాము పెళ్ళి చేసుకోకుండా వుండి వుంటే అతను తనవాళ్ళమధ్య బతికి వుండేవాడా? తననుగాక ఏపిల్లను చేసుకున్నా, జీవించి వుండేవాడేమో! అతని మనసులో ఏంబాధలో? ఏంసంశయాలో? తాను ఎందుకు కనిపెట్ట లేకపోయింది. ఎందుకు వోదార్చలేకపోయింది? ఎక్కడ లోపంచేసింది? అత నెందుకు తనని యిలా వదిలిపెళ్ళిపోయాడు?

అతని దేహం ఏమయింది? నీటిలో తేలిపోయి, యిసకలో దిక్కు లేక పడివుండి, ఆ రసాయనాల్లో వూరి, చివరికి అగ్నికి ఆహుతిఅయిందా? ఇన్ని మార్పులకి లోనయింది - ఆదేహం వొక్కటేనా? ఆత్మలేదా? ఆత్మ లేని దేహానికి, ఎండా వానా, నీరూ నిప్పు అన్నీ ఒకటే! దానికి స్పర్శజ్ఞానం వుండదు. కాని - కాని దిక్కులేకుండా - అలా సముద్రపువొడ్డున పడిపోయి .... అయ్యో .... ఎందుకయింది, ఎందుకిలా అయింది? పిచ్చిగా చీకటిలోకి చూస్తూ కూచుంది. అప్పటికి మూడురోజు లయింది - అతని అంతిమయాత్ర ముగిసి! మనసులో ఆశలేదు. సంశయమూలేదు. భయంకర మైన నిజం-అతను యింకలేడు. అనాథగా, దిక్కులేనివాడిగా వెళ్ళిపోయాడు. ఎంత అకస్మాత్తుగా తన జీవితంలోకి ప్రవేశించాడో, అంత ఆకస్మికంగానూ నిష్క్రమించాడు. ఒక్కమాట - ఒకే ఒక్కమాట - 'మణీ, నామనసులో

యిలా వుంది. నా కీకష్టం-' అని చెప్పకుండా వెళ్ళిపోయాడు. సిగ్గు, మొహమాటం, నిస్సహాయత, ఈ మూడుస్వభావలక్షణాలవల్లే అతనిపట్ల తను ఆకర్షితురాలయింది. ఆ స్వభావలక్షణాలతోనే అతను అనాథగా వెళ్ళిపోయాడు.

'అమ్మా, అమ్మా తలుపు తియ్యి' మొదలియార్ పసిపిల్లవాడిలా ఏడుస్తూ, తలుపుకొడుతున్నాడు.

నాగమణి ఆ పిలుపు ఎన్నిసార్లో వింది ఈ మూడురోజులలో. ఆ చీకటిగదిలోకి తండ్రి ఆక్రందన, వేడికోలు తలుపుసందుల్లోంచి చీల్చుకు వస్తున్నది. నాగమణి తలుపు తియ్యాలనుకుంటుంది. తియ్యలేకుండా వుంది. కదిలే శక్తిలేదు, కాళ్ళు చచ్చుపడినట్లుగా వున్నాయి.

'తల్లీ, నువ్వు తలుపు తియ్యకపోతే నేనుకూడా చచ్చిపోతాను. యిక్కడే ప్రాణాలు తీసుకుంటాను' ఏడుస్తూ చెప్పకుంటున్నాడు తండ్రి.

'నేనుకూడా చచ్చిపోతా - ప్రాణాలు తీసుకుంటా' అంటున్నాడు తండ్రి. అంటే అతను ప్రాణాలు తీసుకున్నాడన్నమాట. కావాలనే ఆత్మ హత్య చేసుకున్నాడు. దుఃఖం తెరలు తెరలుగా వస్తున్నది. పొట్టచీల్చుకుని, కంఠం పెగుల్చుకుని, ఉవ్వెత్తుగా వస్తోంది. నేలమీద పాకుతూ వెళ్ళి, తలుపు గడియతీసింది. గదిలోకి చొచ్చుకొస్తున్న కాంతి-కళ్ళని పొడుస్తున్న వెల్తురు. చూడలేక రెండుకళ్ళూ మూసుకుని అలాగే నేలమీద పడిపోయింది- స్పృహలేకుండా.

ఆతరువాత పదిహేనురోజులకి 'నాన్నా' అని పిలవగలిగింది. ఆ పదిహేనురోజులూ ఆమె పిచ్చిదానిలాగా ఏడ్చింది, మాట్లాడింది, కొట్టుకుంది - ప్రతిసారి సెడెటివ్స్ యిచ్చి నిద్రపోగొట్టారు డాక్టర్లు. పదహారోరోజున కళ్ళు తెరిచి, 'నాన్నా' అని పిలిచింది, వంగి తన ముఖం లోకి చూస్తున్న తండ్రిని చూసి.

'ఏంతల్లీ ?' ఆకంఠంలో ఆదుర్దా, బాధ, ఆశ.

'నాన్నా, మనం యిక్కడ వుండొద్దు. ఎక్కడికయినా వెళ్ళిపోదాం. ఈవూర్లో వుండలేను _ వెళ్ళిపోదాం - నన్ను తీసుకెళ్ళిపో' తండ్రిని పట్టుకుంది గట్టిగా, భయంతో గజగజ వణికిపోతూ.

'అల్లాగే తల్లీ, వెళ్ళిపోదాం. ఈ ముసలివాడిని అన్యాయం చెయ్యనని మాటియ్యి - నాకోసం తల్లీ - నన్ను ఒక్కడినీ చేసి వెళ్ళిపోతావా? నాకోసం నువ్వు మామూలుమనిషివి అవాలమ్మా? నాకెవరున్నారు? మీ అమ్మలేదు. అతను వెళ్ళిపోయాడు....నువ్వూ, నువ్వూ అన్యాయంచేస్తే' ఏడుస్తున్నాడు మొదలియార్.

ఆక్షణాన నాగమణికి తనగురించిగాక తండ్రి గురించిన ఆలోచన వచ్చింది. ఈ వృద్ధునికి ఎవరున్నారు? తను కోరిందల్లా యిచ్చాడు. తనమాట ఒక్కటీ కాదనలేదు. తనేంచేస్తోంది. తనమీద సానుభూతితో - తనకి అన్యాయం జరిగిపోయిందని బాధపడుతోందేతప్ప, యీ వెర్రినాన్నని గురించి ఆలోచించలేదు....

'నాన్నా' చెయ్యి పట్టుకుని నెమ్మదిగా నీరసంగా చెప్పటం ఆరంభించింది. 'ఎందుకు యిలా జరిగింది? ఏలోపం చేశాను - అని గిలగిలకొట్టుకుంటున్నాను. నాకు బదులు దొరకటంలేదు. ఎందుకు? అన్న ప్రశ్న యిక వేసుకోను. ఏంచెయ్యాలి? నాకర్తవ్యం ఏమిటి? అని ఆలోచించుకోబోతున్నాను. ఏదీ మన చేతిలోలేదు. నాకు చదువుచెప్పించావు, డాక్టరుని చేశావు. నాకర్తవ్యం - వైద్యం చెయ్యటం, సాధ్యమైనంతమందిని మృత్యువుకి దూరంగా_దూరంగా తీసుకువెళ్ళిపోవటం. కాని, కాని ఈవూళ్లో వద్దు - మనం యిక్కడ వుండొద్దు' అంది బలవంతాన కన్నీళ్ళు ఆపుకుంటూ కంఠంలోకి లేనిశక్తిని తెచ్చుకుంటూ.

ఆ చుట్టుపక్కల పల్లెల్లో వైద్యసదుపాయం సరిగ్గాలేదు. ప్రైమరీ హెల్త్‌సెంటర్సూ - గవర్నమెంటు మెటర్నిటీ - ఛైల్డుకేర్ సెంటర్సూ యివి - గ్రామ రాజకీయాల్లో తలమునకలయి, లేడీడాక్టరంటూలేదు ఆవూళ్లో.

షుమారు పాతికవేలదాకా జనాభా. ఆచుట్టుపక్కల పదిపన్నెండు గ్రామాలకి ఈవూరే కా స్త బ స్తీ. వారం వారం సంతా, ఇంకా యింటింటా పశువులూ, బిచ్చగాళ్ళూ, రాత్రిళ్ళు మాధవకబళం అంటూ అడుక్కునేవాళ్ళూ, కరంటూ, పంచాయితీసమితీ, సినిమాహాలు యిలా కనీససౌకర్యాలు - మురికిగల పట్నమూ పల్లెగాని - మామూలుగ్రామం ఆవూరు. భారతదేశంలోని అనేక గ్రామాలలాగానే ఆవూళ్ళోనూ సంపన్నులూ అతిబీదవారూ వున్నారు. సంపన్నులు తమ పిల్లల్ని - యూనివర్సిటీలకి పంపి చదువులు చెప్పించి - ఫారెన్ కూడా పంపుతున్నారు పై చదువులకి. అయితే అక్షరంముక్కగూడా రానివారూ వున్నారు. సరిఅయిన డాక్టరులేక - కానుపు కష్టంఅయి - బండిలో గర్భిణీస్త్రీని పట్నంతీసుకెళితే, దారిలోనే ఆస్త్రీ కన్న సంఘటనలూ, చనిపోయిన వుదంతాలూ వున్నాయి. ఆవూళ్లో మగడాక్టరు వున్నాడు అయిదారేళ్ళుగా. ఆయన హ స్తవాసి మంచిదేగాని - కోపిష్టి, భార్యాపిల్లలు లేని వొంటికట్టె - పై పెచ్చు రాత్రి అయేప్పటికి పూటుగా తాగి పడుకు నుంటాడు. ఆ టైములో - భగవంతుడు దిగివచ్చినా ఆయన్ని లేపటానికి వీలపడు. అన్న వాడుక వుంది. ఆ చుట్టుపక్కల స్త్రీలు - ముఖ్యంగా ఘోషా యింకా పాటించే పెలమా, రాజుల కుటుంబాల్లోని స్త్రీలు - కానుపు సమయంలో ప్రాణాలనైనా వదులుతారుగాని మగడాక్టరుని రానివ్వరు. హెల్త్ విజిటరూ - మిడ్ వైఫూ కలిసి పెద్దప్రాణానికి ముప్పు తీసుకొచ్చిన సంఘటనలు నాలుగైదు జరిగాయి ఆగ్రామంలో.

'చావు పుట్టుకలు మన చేతుల్లో లేవు. భూమిమీద నూకలు చెల్లిపోయాయి - అది వెళ్ళిపోయింది. పెళ్ళాం బోతే - మగవాడు వంటరిగా ఎలా బతుకుతాడు, అంటూ కాబోయే మావగార్లు - 'మాపిల్లని చేసుకో' అంటూ క్యూలో నిల్చుని, రెండోపెళ్ళికి పిల్లని యివ్వటానికి కుమ్ములాడే గ్రామం అది. ఆడదాని ప్రాణానికి అంతటి అమూల్యమైన విలువవున్న వూరు. ఒక్కొక్క ప్రాణి - గర్భిణీస్త్రీ నిష్క్రమించగానే, వైద్యసహాయం

లేక - చనిపోగానే, ఆవూళ్ళో ప్రాక్టీసుచేస్తున్న సర్వేశ్వరరావు - పరమ శివుడులాగా మూడోకన్ను తెరుస్తూంటాడు. తను మగవాడుఅన్న కారణంగా, పురిటిగదిలోకి రానివ్వక, ప్రాణాలు తీసుకునే యీవూరివాళ్ళ మీద, వారి మూర్ఖసంప్రదాయాలమీద - రుద్రతాండవం చేస్తూంటాడు. పేషంట్లని, వూళ్లోవాళ్ళని బండబూతులు తిడ్తూంటాడు.

'ఏం, పెళ్ళాందగ్గర పడుకున్నవాడివి, అది చచ్చిందో, బతికుందో లేదో కనుక్కోఖర్లేదా ? సంతోషం నీదీను - చావు నీపెళ్ళాందీనా - మళ్ళీ పెళ్ళికి తయారవుతున్నావు సిగ్గులేమా ?' అంటూ మందుకొచ్చినవాళ్ళని దులుపుతూ వుంటాడు.

ఆయన ఎంత మోటుగా మాట్లాడుతాడో అంత బాగా వైద్యం చేస్తాడు. ఆ తిట్లవెనక బాధ - యీవూరిప్రజలమీద ప్రేమవుందని వొచ్చేవారికి తెలుసు. అందుకనే ఆయన ఏమన్నా పట్టించుకోరు. లావుగా తెల్లగా వుండి - నలభై ఏళ్ళకే జుట్టుపండిపోయి, కరుకుగా మాట్లాడే సర్వేశ్వరరావు - అవూళ్లో వందలాదిమంది పసిపిల్లలని యీలోకంలోకి తీసుకొచ్చాడు తన చేతుల్తోటి. ఆ డాక్టరే, నాగమణి పనిచేస్తున్న నర్సింగ్ హోమ్ బాస్‌కి ఫ్రెండు. అతనిద్వారానే ఈవూరు వచ్చింది - నాగమణి.

జీవితమంతా మద్రాసులో గడిపిన మొదలియార్, కూతురికోసం యీపల్లెటూరు వచ్చాడు. వచ్చిన పదిరోజులదాకా, నాగమణి మరబొమ్మ లాగా - తండ్రి నిద్రలేపుతే లేచి, ఆయన చెయ్యిపుచ్చుకు తీసుకెళ్ళి ముందుగదిలో, అది క్లినిక్‌గా వాడటానికి కేటాయించారు. ఆగదిలో కుర్చీలో కూచుని శూన్యంలోకి చూస్తూ వుండేది. లోపల అదెమ్మ వంట - తండ్రి వూళ్ళో కెళ్ళి, నలుగురినీ కలుసుకుని, తనకూతురు డాక్టరు, వూరికే వైద్యం చేస్తుంది అని చెపుతూండేవాడు. ఒకరోజున విరోచనాలతో వేళ్ళాడబడిపోతున్న ఒక పదహారేళ్ళపిల్లని తీసుకొచ్చారు. అప్పటికి వారం రోజులయింది నాగమణి ఆ వూరొచ్చి - బోర్డుకట్టి ! ఏది తిన్నా, యిమడటం

లేదు. అంతా రెండోమార్గంగుండా వెళ్ళిపోతున్నది. ఇంచుమించు 'డీహైడ్రేషన్'స్థితిలో పేషంటుని తీసుకొచ్చారు. నాగమణికి ఆకేసుని చూడగానే, మర్చిపోయిన వైద్యవిజ్ఞానం, ఒక రకమైన సంచలనం కలిగించింది. పేషంటుని అక్కడినుంచి కదలనివ్వద్దని, డీహైడ్రేషన్ రాకుండా – గ్లూకోజ్, కొబ్బరినీళ్ళూ కలిపి యిస్తూ – డయేరియా కట్టడానికి నల్లమందుతో కలిపి, బిస్మత్‌మిక్చర్ యిచ్చింది – గంటగంటకూ. ముందు అరచెమ్చా, తరువాత చెమ్చా యిల్లా – మందూ ద్రవమూ రెండూ పక్కన కూచుని పోస్తూనేవుంది సాయంత్రందాకా। ఆరాత్రికి విరోచనాల వుధృతం తగ్గింది. రెండురోజులదాకా పేషంటుని ముందుగదిలోంచి కదలనివ్వక అర్ధరాత్రి మధ్యమధ్య లేస్తూ మందులిచ్చింది. ఆశలు వదులుకున్న, పదహారేళ్ళపిల్లా మళ్ళీ బతికి బయటపడేప్పటికి, నాగమణి తిరిగి చూసుకోవలసిన అవసరం లేకపోయింది. ఆ తరువాత ఆడవాళ్ళూ అంటే ఆమె దగ్గిరకే వైద్యానికి వచ్చేవారు.

ఆవూరు వచ్చాక నెల్లాళ్ళకి కాబోలు డాక్టర్ సర్వేశ్వరరావు నాగమణి కినిక్‌కి ఆమెని చూడటానికి వచ్చాడు. అతని మాటలోని కరుకుతనం, సంభాషణలో దొర్లే అశ్లీలాలు, మందపాటి కళ్ళజోడు, ఈ గ్రామస్థుల నమ్మకాల విషయంలో కఠినమైన ఆయన అభిప్రాయాలు – చకచక చెప్పుకుంటూపోయాడు. నాగమణి ఒక్కమాట మాట్లాడలేకపోయింది. బెదురుగా, తలవంచుకుని కూచుంది. ఈ నాగమణి గత చరిత్ర తన ఫ్రెండుద్వారా వినివున్న సర్వేశ్వరరావు ఈ కొత్త లేడీడాక్టర్ ఫాషన్‌బుల్‌గా వుంటుంది. ఫార్వేర్డుగా వుంటుంది. సోషల్‌గా మాట్లాడుతుంది. మగవాళ్ళని పడగొట్టగల గ్రంథసాంగురాలు అని చాలా చాలా వూహించుకుని, ఆమెని చూడటానికి వచ్చాడు కుతూహలంతో. అసలు ఆమె తనవల్లనే యీగ్రామం వచ్చింది కాబట్టి, ఆమె తనని చూడటానికి తనయింటికి రావాలి – అలా వస్తుందని నెల్లాళ్ళు ఎదురుచూశాడు. నాగమణి

అతనింటికి వెళ్ళలేదు. ఆమెకి గర్వం అనుకున్నాడు. తలబిరుసు, గీర అనుకున్నాడు. వీధిగుమ్మంలోకికూడా రాకుండా యింట్లోనే పాతుకుపోయిన, యీలేడీడాక్టర్ని చూడాలన్న కుతూహలం, ఆమెముందు తన సీనియారిటీని, ఆధిక్యతనీ చూపించాలన్న ఆతృత అతనిని నిలవనివ్వలేదు. ఒకరోజు సాయంత్రం అయిదింటివేళ నాగమణి యింటి కొచ్చాడు - తనకి తానుగానే.

'ఎల్లావుంది, ప్రాక్టీసు బాగా వస్తోందా ? ఇక్కడి జనం గొర్రెల మందలాంటివాళ్ళు - వుత్త యూస్లెస్ ఫెలోసే. అంతా - యీకొడుకులు, ఆకొడుకులు' అంటూ అచ్చసంస్కృతంలో మాట్లాడుతుంటే నాగమణి ఖంగారుపడిపోయింది. ఆమె మనసులో గాయం చాలా పచ్చిగా వుంది. ఇంకా నెత్తురుకూడా కట్టలేదు. అసలు మగవాళ్ళు అంటే ఏదో భయం - వణుకు. తన భర్త ఏనాడూ యిలా మోటుగా, అశ్లీలాలు మాట్లాడలేదు. అసలు అతను మితభాషి. ఈ డాక్టరు చనువుగా, మీదిమీదికి తరుము తున్నట్లు వస్తున్నాడు. గబగబా మాట్లాడుతున్నాడు, ఏంమాట్లాడాలో, ఎలా సమాధానం చెప్పాలో తెలియనట్లూ, తండ్రివైపు చూసింది నిస్సహాయంగా.

అతి సింపుల్గా, చామనచాయరంగులో వున్న యీ లేడీడాక్టర్ని చూస్తే, సర్వేశ్వరరావుకి ఆశ్చర్యం కలిగింది. ఈ డాక్టరుని చూస్తే పెళ్ళయిన అమ్మాయిలా అనిపించటంలేదు. నాలుగేళ్ళనుంచీ వుద్యోగం చేస్తున్నా అప్పుడే కాలేజీనుంచి వచ్చిన స్టూడెంటులాగా వుంది. బెదిరిపోతూ, బోనులో చిక్కిన కుందేలుపిల్లలా యిటూ అటూ భయంతో చూస్తూ, దృష్టి ఎటువైపు మళ్ళించుకోవాలో తెలీక, నేలచూపులు చూస్తుంటే సర్వేశ్వర రావుకి నవ్వొచ్చింది - పులిపిల్ల అని వూహించుకువస్తే, యిక్కడ లేడిపిల్ల తటస్తబడింది. నాగమణి యిలా భయంతో నిస్సహాయంగా యిటు అటూ చూడటం సర్వేశ్వరరావుకి చికాకు అనిపించింది. ఎందుకంటే అతనికి నిస్సహాయంగా కనిపించే వ్యక్తులంటే చులకన, కోపం. అనేమంది గర్భిణీ

స్త్రీలు నిస్సహాయంగా, దీనంగా కేకలుపెట్టి, తమ ప్రాణాలు తీసుకున్నారే తప్ప, పురిటిగదిలోకి అతనిని రానివ్వలేదు. మగడాక్టరు కాబట్టి రావద్దు అన్నారు. ఒక ప్రాణి అతని కళ్ళఎదుటే నిస్సహాయంగా కేకలువేసి చచ్చిపోతుంటే, ఏమీ చెయ్యలేని, సహాయం చెయ్యటానికి అవకాశం కల్పించలేని వారి మూర్ఖత్వాన్ని చూస్తే సర్వేశ్వరరావుకి ఒకరకమైన కసి, ద్వేషం కలుగుతూ వుంటుంది. అలాంటివాళ్ళని తిట్టి, చివాట్లువేసి 'సర్కాస్టిక్'గా మాట్లాడితేగాని అతనికి తాపంతీరదు ; తృప్తిగా వుండదు.

'ఈవూళ్లో మీరు ఎన్నోరోజులలో వుండలేరు. ఇట్లాయితే లాభం లేదు' అన్నాడు సర్వేశ్వరరావు దూకుడుగా.

'మీలాంటి పెద్దలున్నారు. అమ్మాయి చిన్నది. మీరు కడుపులో పెట్టుకుంటారని, మద్రాసు డాక్టరుగారు చెప్పారు' అన్నాడు మొదలియార్.

డాక్టరు సర్వేశ్వరరావు నాగమణినుంచి సమాధానం ఆశించాడు. కాని అక్కడినుంచి జవాబులేదు.

'మీ రేకాలేజీనుంచి వచ్చారు ?' సర్వేశ్వరరావు తెలియనట్లు అడిగాడు. నాగమణి ప్రైవేట్ డాక్టరని అతని ఫ్రెండు ముందే రాశాడు. అయినా యీ డాక్టర్‌ని బెదరగొట్టాలి, మాట్లాడించాలి.

'అమ్మాయికి రికమెండేషన్సు లేకుండానే సీటొచ్చిందండి-ఎక్కడా తప్పలేదు. ఈవూళ్ళోవాళ్ళంతా మంచివాళ్ళు. మీరున్నారు, ఏంకావలసినా సాయంచేస్తారు.'

అందుకేనా - నాయింటివైపుకైనా రాలేదు అని మనసులో అనుకుని 'బల్లలూ కుర్చీలూ ఏమీలేవే - పేషంట్లువస్తే ఎక్కడ కూచుంటారు ? మందులూ అవీ వున్నాయా ?' అడిగాడు సర్వేశ్వరరావు.

'కాస్త నిలదొక్కుకునేదాకా ఏమీ ఏర్పాటు చేసుకోదలుచుకోలేదు. మాసంగతి మీకు తెలిసేవుంటుంది. ఏదో అలా అలా....' ఆగిపోయాడు మొదలియార్.

'రేపు పొడుగుబల్లా, కుర్చీలు పంపుతాను. మందులుకూడా పంపుతాను' అంటూ కాఫీయిస్తే పుచ్చుకోకుండా గభాలున లేచాడు సర్వేశ్వరరావు. అతను పిలవకండా వచ్చాడు. ఎంత గభాలున వచ్చాడో, అంత గబుక్కునా లేచాడు వెళ్ళిపోటానికి. నాగమణి కుర్చీమీంచి లేచిందేగాని తలఎత్తలేదు.

'వెళ్ళొస్తాను' అంటూ గభాలున వెనక్కి తిగాడు గుమ్మందాకా వెళ్ళిన సర్వేశ్వరరావు.

ఆమె గబుక్కున తలఎత్తింది - ఏదో కొత్తశబ్దం వింటున్నట్లు. ఆమె కళ్ళనిండా నీళ్ళు. కళ్ళనీళ్ళు పొంగి రెప్పలుదాటుకుని చెంపలమీదకి జారుతున్నాయి.

'స్టుపిడ్స్ - ఇడియట్స్ - ' అంటూ తిట్టుకుంటూ గుమ్మందాటాడు సర్వేశ్వర్రావు. ఎవరిని తిడుతున్నాడో అతనికే తెలియటంలేదు. ఏవో కచ్చ - మనుషులు ఎందుకు అంత చేతకానివాళ్ళలా బిహేవ్ చేస్తారు - వెదురుగొడ్లులాగా ఎందుకయిపోతారు ! ఆరాత్రి మరోపెగ్గు ఎక్కువ వేసుకుని పడుకున్నాడు - తెల్లవారేదాకా - ఎవరు పిలిచినా, అరిచి చచ్చినా లేవకూడదని.

అయితే, అర్ధరాత్రి - అతని తలుపు బిద్దలుకొడుతున్నారు - అపద లోని రోగులు. నిద్రమత్తులో, డోసు ఎక్కువయిన స్థితిలో - గట్టిగా బండబూతులు తిడుతూ - తలుపుతీసి, పేషంటుని చూడటానికి వెళ్ళాడు అర్ధరాత్రి రెండుగంటలవేళ. అక్కడి వెళ్ళి చూసేసరికి అతని మత్తు చాలామటుకు దిగిపోయింది. ఒక పార్టీ ఈవైపుకి వచ్చి - మరికొందరు కొత్తగావచ్చిన లేడీడాక్టరుయింటికి వెళ్ళి ఆమెను వెంటపెట్టుకొచ్చారు. అనుభవంలేని డాక్టరూ యీవూరుకి కొత్తా కాబట్టి, ఎందుకైనా మంచిదని సర్వేశ్వరరావుని తీసుకొచ్చారు. ఆయన పక్కనవుంటం మంచిదని. సర్వేశ్వరరావు వెళ్ళేప్పటికి అప్పుడే పుట్టిన కవలల కాళ్ళు ఎడంచేతిలో

పట్టుకుని ఒకరి తరువాత ఒకరిని తలక్రిందులుగా చేసి పిర్రలమీద వాయిస్తోంది నాగమణి. కవల లిద్దరూ 'కుయ్యో'మని పిల్లిపిల్లల్లాగా కీచుమంటున్నారు.

మంచి కోపంతో విసుగ్గా వచ్చిన డాక్టర్ సర్వేశ్వరరావు పకపకా నవ్వాడు ఆ దృశ్యం చూసి. ఆకాశంలో పురుషులు ఫెళఫెళమన్నట్లు బిగ్గరగా నవ్వుతున్నాడు. కాని నాగమణి తలఎత్తలేదు. చుట్టూ మనుష్యులని గమనించలేదు. ఈ డాక్టర్ నవ్వు ఆమె చెవుల్లోకి సోకలేదు. మంత్రసానిని పిల్లలకి స్నానం చేయించమని చెప్పి పురిటిగదిలోకి వెళ్ళిపోయింది నాగమణి. కాసేపు ఆగి పురిటిగదిలోకి వెళ్ళాడు డాక్టర్ సర్వేశ్వరరావు. పురిటాలుకు చెయ్యాల్సిన ప్రథమచికిత్స అంతా అయిపోయింది. దుప్పటి కప్పుకుని కళ్ళుమూసుకు అలసటగా పడుకునివుంది బాలింత.

'ఏమిటీ యిద్దరిని కన్నావా? వున్న జనాభా చాల్లేదా? పుట్టినవాళ్ళు చాలుకాని ఎల్లుండి ఆపరేషన్ చేయించుకో.'

'నాకు భయంఅండీ' నీరసంగా అంది పురిటాలు.

'అయితే నీమొగుడికి చేసేస్తాను. వింటున్నావా – నలుగురిని కన్నావ్. చాలు డాక్టరమ్మకి చెప్పేస్తాను. నీకు ఆపరేషన్ చెయ్యమని' బిగ్గరగా చుట్టూ అందరికీ వినిపించేటట్లు చెపుతున్నాడు సర్వేశ్వరరావు.

దానికి నాగమణినుంచి ఎటువంటి సమాధానమూ రాలేదు.

ఆతరువాత .... ఆతరువాత .... తను దేనికీ వెతుక్కోవలసి రాలేదు. కూరలు, పళ్ళు, బియ్యం, ఇంట్లో సామాను ఇవి తను ఏప్రయత్నం చెయ్యకుండానే వాటంతట అవే అమరుతూ వచ్చాయి. తను ఏనాడూ ఫీజు అంటూ అడిగేదికాదు. ఎవరేనా ఫీజు యివ్వబోతే 'నాన్న కివ్వండి. నాన్నకి పంపించండి' అనేది. పేషంట్లు ఏమి యిచ్చేవారో తండ్రి ఎంత తీసుకునేవాడో తనకి తెలియదు.

'అమ్మా, మనకి యీభాగం చాలదు. పక్కవాటాకూడా తీసుకుని విశాలంగా క్లినిక్ పెట్టుకుందాం' అన్నాడు తండ్రి ఏడాది గడిచాక.

నాగమణి మాట్లాడలేదు. అసలు అవసరంవస్తేతప్ప తను నోరు తెరిచేదికాదు. రోగులూ, రోగిలక్షణాలు, మందులూ, పథ్యాలు యివితప్ప మామూలుమాటలు మర్చిపోయింది – తన కాలేజీరోజుల్లోలాగానే తండ్రి ఏంతినాలో చెప్పేవాడు. అన్నీ వడ్డించి పిలిచేది ఆదెమ్మ. తనతోపాటు తండ్రికూడా భోజనానికి కూచుని, 'ఇది కలుపుకోమ్మా, అది తినమ్మా' అని చిన్నపిల్లకి చెప్పినట్లు చెప్పేవాడు. తను తినేది. రుచిగావుండి కాదు, పెద్దవయసులోని తన యీ తండ్రిని సంతోషపెట్టాలని, ఆయనని బాధించ కూడదని.

'బెజవాడనుంచి రాజారావుగారింట్లో చీరెలు తెప్పించారు. నీకు తీసుకున్నాను. కట్టుకునేందుకు బాగున్నాయా ? ఈమూటలో నీకేం కావాలో సెలక్ట్ చేసుకోమన్నారు. ఒక ఆరుచీరెలు తీసుకోమ్మా' అనేవాడు తండ్రి.

తను నిరాసక్తతతో వుండిపోయేది. ఏంచీరె కట్టుకుంటే ఏం ? ఏం తింటేఏం ? ఈదేహం చివరికి కట్టెలాగా బిగుసుకుపోతుంది. అతనిలాగా టేబుల్‌మీద కర్రలా చలనరహితంగా అయిపోతుంది. అటువంటి దానికోసం దేని కీతాపత్రయం ? తను నిశ్శబ్దంగా వుండిపోయేది – తన ఆలోచనల్లో తాను పడిపోయి. '

ఆదెమ్మా, నాన్నా కూచుని యీరంగు బాగుంది, ఆచీరె నాణ్యంగా వుంది. నేతబాగుంది. ప్రింటు బాగాలేదు. అని యిలా తామిద్దరూ కట్టుకో పోతున్నట్లు వాదించుకుంటుంటే తనకి సంబంధం లేనట్లు వారి వాదోప వాదాలు వింటూ కూచునేది. వాళ్ళిద్దరే తనకు చీరెలు సెలక్ట్‌చేసి కొనేవారు. రోజూ యిస్త్రీచీరె మంచంమీద రెడీగా వుండేది. తాను ఆ చీరె తీసుకు కట్టుకునేది. బాగున్నాయా లేవా ? పాతవా, కొత్తవా అన్న ఆలోచనలు వచ్చేవికావు. కర్తవ్యం – తన కర్తవ్యం, డాక్టరుగా తను చెయ్యవలసిన విధి – యిది వొక్కటే జ్ఞాపకానికి వచ్చేది.

తలవంచుకు గతంలోకి వెళ్ళిపోయింది. ఆ గతంలోంచి – వర్తమానం లోకి వచ్చింది. టేబుల్‌మీదనున్న గ్లాసులో ఏదో కదలిక కనిపించడంతో. పొద్దుటనుంచీ ఎక్కడా కదలికలేదు. ఆఖరికి మనిషినీడకూడా పడలేదు ఈ క్లినిక్‌లో. అల్లాంటిది యిప్పుడు గ్లాసులో ఏదో ప్రతిబింబం. కదులుతున్న మానవాకృతి. పొడవుగా నీడ. తలఎత్తింది. ఎవరన్నా పేషంట్లు వొచ్చారేమోనన్న ఆశతో.

ట్రేలో టీకప్పు పెట్టుకు ఆదెమ్మ. బిస్కట్లప్లేటు టేబుల్‌మీద పెట్టింది. క్లిక్ అని శబ్దం. ఆశబ్దం ఎంతో హాయిగా అనిపించింది. నిశ్చలంగావున్న యీవాతావరణంలో కాస్తంత ధ్వని. టీకప్పుకూడా టేబుల్‌మీద వుంచి, గిరుక్కున వెనుతిరిగిపోయింది ఆదెమ్మ. ఎంత నెమ్మదిగా వచ్చిందో, అంత చప్పుడు లేకుండానూ వెళ్ళిపోయింది.

నిశ్చలంగా, నిశ్శబ్దంగావున్న యీ వాతావరణంలో వేడిటీ గొప్ప రిలీఫ్‌లాగా వుంది. వూదుకుంటూ యీ టీ తాగితే, అదికూడా కొంత కదలికేగా! వేడివేడిటీ తాగుతోంది. ఆదెమ్మని పిలిచి 'పంచదారలేదు' అని కేకలేసి చెపుతే! మళ్ళీ వేసుకుంటే పానకం అవుతుంది. ఆదెమ్మ అంత బెట్టుగా వుంటే, తనుమటుకు ఎందుకు ప్రాకులాడాలి! వంటమనిషి జీతానికివున్న ఆమనిషికే అంత గీరయితే!

ఆదెమ్మ జీతానికి వుందా? వంటమనిషా? తను అలా అనుకోలేదు? ఆదెమ్మ ఎలా ప్రవర్తించినా – ఆమెని డబ్బుతో కొలవలేదు.

ఆదెమ్మ లేకపోతే తను ఏమైపోతుంది? ఒక్కర్తే బతకగలదా. తనకి తల్లిలేదు, భర్తలేడు, తండ్రిలేడు. అనాధ – తాను అనాధ. అతను కూడా యిలాగా వంటరిగా ఫీలయ్యేవాడా? కాని తనకి నిజంగానే ఎవరూ లేరు.

ఎవరూ లేరా? లేకపోతేనే తండ్రికి జబ్బుగా వున్నపుడు అంతమంది ఆదుకున్నారా? ఎంతమంది సాయంచేశారు? వూరువూరల్లా తన కష్టంలో

ఆదుకున్నారు. ఆరోజు పదేళ్ళక్రితం తాము ఏకాకులుగా ఈవూరు వచ్చారు. అయిదేళ్ళు గడిచేప్పటికి తమకి కాకిబలగం ఏర్పడింది. తండ్రికి తను వైద్యం చెయ్యలేకపోయింది. ఆయనకి ఏంమందు వాడాలో, ఆఖరికి యింజక్షను యివ్వాలన్నా చేతులువణికేవి. ఆటైములో రోజూ రెండుపూట్లా వచ్చేవాడు డాక్టర్ సర్వేశ్వరరావు. తను రమ్మనమని పిలవలేదు - రావద్దూ అనలేదు. అతనే వచ్చేవాడు - ట్రీట్ మెంటుచేసేవాడు. తండ్రి బతకడేమోనని తనకి సందేహంగా వుండేది. తన సందేహాన్ని లోలోపలే అణుచుకునేది. ఆతలంపే తనని పిచ్చిదాన్ని చేసేది.

'డాక్టర్ - మీరు చదువుకున్నవారని, మూర్ఖులుకారనీ అనుకుంటున్నాను' అన్నాడు సర్వేశ్వరరావు - ఒక సాయంత్రం. రెండురోజుల నుంచీ తండ్రికి సెడెటివ్స్ డోస్ పెంచారు. రెండుపూట్లా యింజక్షన్సు యిస్తున్నాడు కడుపులోని బాధ తట్టుకోటానికి.

తను తలఎత్తలేదు.

'మిమ్మల్ని చూస్తుంటే ఆస్ట్రిచ్ పక్షి జ్ఞాపకంవస్తోంది.' అన్నాడు ...్వరరావు కరుకుగా.

తను తల ఎత్తింది - ఏమిటంటున్నారు - అన్నట్లు ప్రశ్నార్థకంగా చూస్తూ.

'మీరు జీవితాన్ని ఫేస్‌చెయ్యా లంటున్నాను. తప్పించుకోవాలని ప్రయత్నించి లాభంలేదు. కొన్ని నిజాలని 'ఫేస్' చెయ్యక తప్పదు-' అన్నాడు సర్వేశ్వరరావు. ఈసారి అతని కంఠం కరుకుగా లేదు. ఆ కంఠంలో సానుభూతి.

నాగమణికి గిర్రున కన్నీళ్ళు తిరిగాయి. గొంతులోంచి దుఃఖం తన్నుకొస్తోన్నది.

'నేను భరించలేను. నాన్న బాధని చూడలేకుండా వున్నాను. ఆయన, ఆయన లేకుండా.... నేను బతకలేను.'

'నాన్‌సెన్స్, ఈ జననమరణాలు ప్రకృతి సహజమైన పరిణామాలు. ఆయన టైము అయిపోయింది. ఎంత తక్కువ సఫర్ అయితే అంతమంచిది. ఈబాధనుంచి విముక్తి పొందాలని కోరుకోవాలి.'

'నాన్నకూడా లేకుండా ఎలా....మీకు తెలియదు - ఆయనమీద నేను ఎంత ఆధారపడివున్నానో.'

'అయితే, మీరు పట్టుకుంటే, ఆయన ఆగుతాడా? డాక్టర్లం మందు లివ్వగలం, బాధని తగ్గించగలం - 'డెత్'ని ఆపలేం. సిల్లీగా మాట్లాడకండి- యు మస్ట్ ఫేస్ ది ట్రూత్.'

'నావల్లకాదు'

'ఏంచేస్తారు? మీరూ ఛస్తారా?' అడిగాడు మొరటుగా.

నాగమణి తలఎత్తలేదు. ఆమె కన్నీళ్ళు చెంపలమీంచి జారి నేలమీద టప్‌న పడ్డాయి.

'అయామ్ సారీ. నాకు నాజూగ్గా మాట్లాడటం చేతకాదు. మేనర్స్ లేని డాక్టరుని. చూడండి, మనం అంతా వంటరివాళ్ళమే. ఎవరికి ఎవరూ తోడురారు. ఇదేదో వేదాంతం అని కొట్టిపారేస్తాం. నిజానికి అది స్టార్క్ ట్రూత్. ఎంతమందివున్నా, వెళ్ళేప్పుడు అందరూ ఒంటరివాళ్ళే.'

'నాన్నగురించికాదు - నాగురించి. నాకు నాన్నలేకుండా బ్రతకటం చేతకాదు - బ్రతకలేను.'

'ఇదంతా ఎమోషన్స్ క్రియేట్‌చేసే హావక్. ఎవరం ఎవరికోసం బతకం. మనకోసం మనం బ్రతుకుతాం. చావలేక కొందరు బతుకుతారు, కొందరికి మృత్యువంటే భయం. మరికొందరికి బతుకంటే భయం. ఎవరు ఎందుకు బతుకుతున్నారు? ఎందుకు చచ్చిపోతున్నారు? అని ఆలోచించటం శుద్ధ తెలివితక్కువ. మన జీవితాలని ఎంత అర్థవంతంగా చేసుకు బ్రతుకుతున్నాం - అన్నది ఆలోచించాలితప్ప, బ్రతకలేం, అనుకోటం స్టుపిడిటీ....' అని వెళ్ళిపోయాడు.

# 9

తండ్రిపోయినలోటు తెలియనివ్వకుండా చేసింది ఆదెమ్మ. కన్న కూతురులా చూసుకుంది. ఇంట్లోకి ఏంకావాలి — డబ్బు ఎలా జాగ్రత్తచేయాలి — అన్నీ ఆదెమ్మ ఆధ్వర్యంలో ఉండేవి. తమకేం కావాల్సినా - ఎలిజబెత్, మరియమ్మ ఆదెమ్మతో చెప్పుకునేవాళ్ళు. తను ఏమీ పట్టించుకోలేదు. ఇల్లు నిర్వహించుకోటం తనకి చేతకాదు. తండ్రి పోయిన నెల్లాళ్ళకి కాబోలు సమీర తనకి దగ్గరకావటం ఆరంభించింది. మొదట్లో తలనెప్పి అని, కొద్దిగా జ్వరం వస్తోంది అంటూ వచ్చిన సమీర తనలో నిద్రాణమైవున్న నవ్వుని, వుత్సాహాన్ని కొద్దిగా కదిల్చింది. తన కాలేజీరోజులనాటి చిలిపితనం సమీరలో కనిపిస్తూ వుండేది.

'డాక్టర్, మీలాగా నేనుకూడా సీరియస్‌గా వుండాలని చాలా ప్రయత్నించాను. లాభంలేదు. మాట్లాడకపోతే నాకు జబ్బు చేస్తుంది. మీరెల్లా వుంటారోగాని.'

అన్నిటికీ చిరునవ్వే సమాధానం. తనని మాటల్తో వేధించే సమీర, వూరికిరాగానే తనకోసం పరుగెత్తుకొచ్చే సమీర, ఈరోజు తనని చూడటానికి రాలేదు. స్టేట్సులోవున్నా వారానికి ఒక వుత్తరం రాసే సమీర వూళ్ళోకి వచ్చీ రాలేదు. మనుషులు మారిపోతారా? పరిస్థితులతోపాటు మనుషులూ మారిపోతారు. మారిపోనివ్యక్తి తనొక్కర్తే.

రాజారావుగారితోపాటు శుభలేఖ యివ్వటానికి వచ్చిన సమీర 'నాన్న, యీవూళ్ళోనే నా పెళ్ళి జరగాలని ఎందుకు పట్టుపట్టానో తెలుసా? ఆఖరికి బావతోకూడా పోట్లాడాను' అంది నాగమణివంక భక్తితో చూస్తూ.

'దేనికి పోట్లాడావ్ ? అతను మంచివాడు, నెమ్మదస్తుడు. నీతో ఎలా నెగ్గుకొస్తాడో' ప్రేమగా, గర్వంగా నవ్వుతూ చూస్తున్నాడు రాజారావుగారు కూతురువంక.

ఇద్దరు కొడుకులూ, ఒకే ఒక్క ఆడపిల్లాగల రాజారావుగారికి తన గారాలపట్టిని చూస్తే విపరీతమైన ప్రేమ, వాత్సల్యం. ఆయన ఆస్తి, అధికారం, పలుకుబడి, అంతస్థూ అంతా యీబంగారుబొమ్మముందు దిగదుడుపే అన్నట్లుగా వుంటాయి ఆయన మాటలూ, చేతలూ.

'ఈ డాక్టరుగా రుండే - ఈమె యిల్లు కదలరు - ఈవూరు వొదిలి రారు. తిరపతిలో అయితే ఈవిడ రారుగా, అందుకనే దేముడిని నువు నమ్ము - డాక్టరుగారిని నేను నమ్ముతా అన్నాను.'

'తప్పమ్మా అలా అనకూడదు.'

'నిజం, నాన్నా - ప్రాణంలేని ఆవిగ్రహాలకంటే, ప్రాణంపోసే డాక్టర్లు గొప్పవాళ్ళుకాదా. వైద్యుడు భగవంతునితో సమానం అని నువ్వేగా అంటావు. అందుకని ఈవూళ్ళోనే నాపెళ్ళి జరగాలని పట్టుబట్టాను. మీరు రాకపోయారో వూరుకోను.'

నవ్వింది నాగమణి.

'మీరు ప్రతిదానికి అలా నవ్వి, తప్పించుకుందా మనుకోకండి. ఈసారి లాభంలేదు. పెళ్ళిసమయానికి మీరు రాకపోతే....' ఆగింది సమీర.

'తాళికట్టించుకోవా ?'

'ఉహూ, నేనేం అంత పిచ్చిదాన్ని కాదు. బావ చెయ్యిపుచ్చుకుని బరబర యిక్కడికి లాక్కొస్తాను. శిరివెంటన్ లచ్చిలా పురోహితుడు, బాజాలూ, పెద్దలూ మావెనకబడి వచ్చేస్తారు. అప్పుడు యీవిడ వాకిట్లో మాపెళ్ళి జరుగుతుంది' అంది సమీర కథని చాలా రసవత్తరంగా ముగించిన కథకురాలిలా మొహంపెట్టి.

ఫక్కున నవ్వారు రాజారావుగారు. నాగమణికూడా నవ్వింది - పకపక నవ్వింది.

'చూశావా ? డాక్టరుగారిచేత నవ్వించగలను - మాట్లాడించగలను - ధైర్యంగా పనులు చేయించగలను. నేను చెప్పినట్లు చేయించగలను....' అంటూ చెప్పుకుపోయిన ఆ సమీర తనని మర్చిపోయిందా? ఎందుకు రాలేదు?

వాచీలో టైము చూసుకుంది. రెండున్నర. కాసేపు వెళ్ళి పడుకుంటే· ఉహు. వెళ్ళదు. ఆ భాగంలోకి వెళితే అదెమ్మ నిర్లక్ష్యంగా చూస్తుంది - పనీపాటూ లేకుండా పడుకోడానికి వచ్చినట్లు - పేషంట్లులేక వోడిపోయి వచ్చినట్లు తనవంక తేలిగ్గా చూస్తుంది. ఆచూపు తను భరించలేదు.

ఎమ్. ఎ. ఫస్టియియర్ చదువుతున్న సమీర ఆ పూజా హాలిడేస్‌కి వైజాగ్‌నుంచి వచ్చింది. వైజాగూ హాస్టల్‌జీవితమూ సమీరకు కొత్తకాదు. బి. ఎ. అక్కడే చదివింది. అయితే ఆ సంవత్సరం యూనివర్సిటీ వుమెన్స్ హాస్టల్లో - కొంచెం స్వేచ్ఛ ఎక్కువగానే వుండేది. అంతక్రితం మిషనరీ కాలేజీలో బి. ఎ. అవటంచేత హాస్టల్లో కట్టుదిట్టాలు పకడ్‌బందీగా వుండేవి. ఇంచుమించు యింట్లో వున్నట్లే వుండేవి అక్కడి రూల్సు. పోస్టు గ్రాడ్యుయేట్ లెవల్ కాబట్టి, హాస్టల్‌రూల్సు అంత ఖచ్చితంగా వుండేవి కావు. బాయ్‌ఫ్రెండ్సుని రూముల్లోకి రానివ్వరుగాని బయట స్వేచ్ఛగానే కలుసుకోవచ్చు.

పూజాహాలిడేస్ కొచ్చినపుడు సమీర రెక్కలువచ్చిన పక్షిలా, స్వేచ్ఛగా ఎగిరే విహంగంలాగా గుక్కతిప్పుకోకుండా కబుర్లు చెప్పింది. ఆపదిరోజులూ, రోజూ తమ యింటి కొచ్చేది. బీచ్‌లు, అయిస్‌క్రీమ్‌లూ, సినిమాలు, సీతమ్మధారకి పిక్నిక్‌లూ, తరుచు యీకబుర్లు, చాలా సరదాగా చెప్తూండేది. స్తంభించిపోయిన తన జీవితంలోకి ఈపిల్ల కొత్తసౌరభాల్ని

పట్టుకొస్తున్నది. తనకంటే పదేళ్ళు చిన్న అయిన ఈ అమ్మాయి ఎంత స్వేచ్ఛగా వుండగలుగుతోంది అని ఆశ్చర్యపడుతూండేది తాను ప్రతిసారి.

'మీక్లాసులో ఎంతమంది వున్నారు?' అడిగింది నాగమణి. సమీర ఇంగ్లీషు లిటరేచర్ చేస్తున్నది.

'ఇరవై ఒక్కరు' అంది సమీర.

'అదేమిటి? ఇరవై మీద ఆ ఒకటీ కొసరా?' అడిగింది నాగమణి.

'అసలు యిరవై మందినే యూనివర్సిటీ ఎలవ్ చేస్తుంది. ఆ ఒకటో అతను సెనేట్, వి.సి ఇలా చాలామందిని పట్టుకు రూల్సు రిలాక్స్‌చేయించి దూరుకున్నాడు. ఇంత కష్టబడి చేరాడా - ఎప్పుడూ రోడ్లమీదనే వుంటాడు' అంది సమీర.

'గర్ల్స్ ఎంతమంది? బాయస్ ఎంతమంది?'

'పన్నెండుగురం అమ్మాయిలం - తొమ్మండుగురు అబ్బాయిలు. మా డిపార్ట్‌మెంటులో అబ్బాయిలకి డిమాండ్ జాస్తి. ఇద్దరు పల్లెటూరు బైతులు, మగ్గింగితో క్లాసు తెచ్చుకు యూనివర్సిటీ కొచ్చారు. వాళ్ళకి ఒక్కముక్క యింగ్లీషురాదు. ప్రొఫెసర్‌తోకూడా తెలుగులో మాట్లాడే ప్రబుద్ధులు.'

'అమ్మాయిలు?'

'మేమంతా అక్స్‌ఫర్డ్ రిటరన్స్‌మి. వస్తే తెలుగుమాట్లాడం. ఆ యిద్దరు బడుద్దాయిలూ మమ్మల్ని చూసి భయపడి పారిపోతారు. ఇంకో యిద్దరున్నారు. మెలికలు తిరిగిపోతారు. భరనాట్యావతంసులు. డాన్సు చెయ్యడానికి పనికొస్తారు వాళ్ళు.'

'వాళ్ళతోనూ మీరు మాట్లాడరా?'

'ఊహూ, మిగతా అయిదుగురిలో ఒకతను పక్కాకమ్యూనిస్టు. అతను గత తార్కికభౌతికవాదంతప్ప యింకోటి మాట్లాడడు. మిగతా

నలుగురబ్బాయిలూ మాతో సోషల్‌గా సరదాగా వుంటారు. పిక్నిక్‌లకీ, సినిమాలకీ వెళ్తూంటాము, చాలా జాలీగా వుంటారు' అంది సమీర.

జనరేషన్ గాప్ అంటే యిదే కాబోలు అనుకుంది తను. తను చదువుకునేరోజుల్లో, చదివింది మెడిసన్ అయినా, బాయ్‌ఫ్రెండ్స్ అంటూ వుండేవారు కాదు. స్నేహం అయిన ఆ వొక్కవ్యక్తీ....అది స్నేహమా! తొలిచూపులోనే ప్రేమకాదా? తను అతనిపట్ల ఆకర్షితురాలవలేదా? నాగమణికి తెలియకుండానే నిట్టూర్పు వెలువడింది.

సమీరకి అందం వుంది, చదువుకుంటున్నది, తెలివివుంది, భాగ్యవంతులయిన తల్లితండ్రు లున్నారు. పెళ్ళి చేసుకోటానికి రెడీగా స్టేట్స్‌లో చదువుకుంటున్న బావ వున్నాడు. ఇటువంటి జీవితం ఎందరమ్మాయిలకి లభిస్తుంది అనుకునేది తను సమీరని చూసినప్పుడల్లా.

ఆ డిశంబరు శలవలకి వచ్చిన సమీరని చూసి చూడగానే తను వులిక్కిపడింది.

'ఏమిటల్లా చిక్కిపోయావ్? హాస్టల్ భోజనం పడటంలేదా? జ్వరం వచ్చిందా?' అడిగింది నాగమణి.

'అబ్బే, బాగానే వున్నాను. మామూలుగానే వున్నాను' అంది సమీర కాస్త జంకుగా వెనక్కి అడుగువేస్తూ.

'ఇల్లారా' అంటూ చెయ్యి చేతిలోకి తీసుకుని, పల్స్ చూసింది సెకండ్ హాబిట్‌లాగా.

పల్స్ చాలా తీవ్రంగా, గబగబా కొట్టుకుంటున్నాయి.

'నీకు వంట్లో బాగాలేదు. భయపడిపోతున్నావ్, బలహీనంగా వున్నావు. ఏదన్నా టానిక్ తీసుకో' అంది తను మామూలుగా.

'బాగానే వున్నాను. ఏంలేదు. మిమ్మల్ని చూసిపోదామని వచ్చాను. మళ్ళీ కలుస్తానెండి' సమీర గబగబా వెళ్ళిపోయింది. ఆపిల్ల మాటల్లో ఎప్పుడూలేని తడబాటు, భయం కనిపిస్తున్నాయి.

ఆరాత్రి వాళ్ళనాన్నకి కబురుపెట్టి, సమీర ఆరోగ్యం గురించి శ్రద్ధ తీసుకోమని చెపుదామనుకుంది. ఈ శలవల్లో యింటిపట్టున వుండి, శుభ్రంగా భోంచేసేటట్టు చూడండి అని హెచ్చరిద్దామనుకుంది. కాని తన స్వభావలక్షణమైన పిరికితనం ఆపని చెయ్యనివ్వలేదు.

అమరునాడు మధ్యాహ్నం ఒంటిగంటవేళ సమీర వచ్చింది. తను అప్పుడే భోంచేసి, ఆరోజు వుదయంవేళ చదవటానికి వ్యవధిలేకపోయిన పేపరు చూస్తూ వుంది మంచంమీద పడుకుని. సాధారణంగా వొంటిగంటా, మూడింటిమధ్య అర్జంటుకేసు అయితేతప్ప, ఎవరూ తలుపుకొట్టరు. పేషంట్లు వచ్చినా ఎలిజబెత్ వాళ్ళని క్లినిక్‌లోనే అట్టేపెట్టేస్తుంది. ఇటువైపు రానివ్వదు. ఆదెమ్మ వంటయింట్లో గిన్నెలు సర్దుతూవున్న శబ్దాలు సన్నగా చెవుల్లో పడుతున్నాయి. ఆ సమయములో, సమీర తన పడక గదిలోకి వచ్చింది. 'నిద్రపోతున్నారా ?' అని అడుగుతూ. సమీరకి యిలా సరాసరి బెడ్‌రూమ్‌లోకి వచ్చేచనువుంది.

'లేదు. పగటినిద్ర నాకు అలవాటులేదు. వూరికే రెస్టు తీసుకుంటున్నాను' అంది నాగమణి.

'మీతో మాట్లాడాలని వచ్చాను. యిప్పుడయితే ఎవరూ వుండరు. డాక్టర్ మిమ్మల్నోప్రశ్న అడగనా ?' సమీర సూటిగాచూస్తూ వుంది.

తను వులిక్కిపడింది. ఖంగారుపడింది. ఈ అమ్మాయి ఏం అడగబోతున్నది. తన గతజీవితం గురించి సమీరకి తెలుసా ? సర్దుకుని 'అడుగు' అంది తాపీగా.

సమీర పక్కనున్న కుర్చీ లాక్కోబోతున్నది.

'ఇలా మంచంమీద కూచో' అంది పక్కకి జరిగి నాగమణి.

'ఊహు. ఎదురుగా - దూరంగా కూచునే మాట్లాడుతాను. మీరు ఎప్పుడైనా పొరబాటు నిర్ణయం తీసుకున్నారా ?'

'అంటే....?'

'తప్పుచేసి - ఎందుకు చేశానని బాధపడ్డారా ?'

'తప్పు కావాలని చేసినపుడు బాధ్యత నీది అవుతుంది. నీప్రమేయం లేకుండా జరిగినపుడు ఆబాధ్యత నీదికాదు' నాగమణి తనని తాను డిఫెండ్ చేసుకుంటున్నది. తన భర్త పోవటం అతను అలా సముద్రజలాల్లో కలిసిపోవటం, తన తప్పువల్లకాదు. ఆత్మహత్యో, యాక్సిడెంటో ఏది జరిగినా అది తన ప్రమేయం లేకుండా జరిగింది - అని చెప్పుకుంటున్నది. సమీర తన గతజీవితం గురించి అడుగుతోంది అన్న అనుమానంతో.

'అయితే, ప్రమేయం లేకుండా జరిగిపోయినదానికి మనబాధ్యత లేదంటారు - అవునా ?' అడిగింది చాలా నిదానంగా స్పష్టంగా సమీర.

'తప్పుకు లోనయినవ్యక్తి అలా అనుకోవచ్చు. కాని, బయటవాళ్ళు ఏలా ఆలోచిస్తారో మనం చెప్పలేం. లోకులు కాకులు. ఎంతకీ తప్పు ఆడదానిమీదనే తోస్తారు.'

'లోకుల గురించి ఎవడిక్కావాలండీ, మన అంతరాత్మ - మన మనస్సాక్షి యివే ముఖ్యం.'

'అటువంటి మనోబలం అందరికీ వుండదు. తమ తప్పు లేకపోయినా కుమిలిపోతూంటారు చాలామంది స్త్రీలు.'

'అయ్ కేర్ ఎ డామ్ ఫర్ అదర్స్. నాకు అటువంటి నాన్‌సెన్స్ నచ్చదు. నామనసు ఏంచెపితే అది చేస్తాను'. అంది సమీర.

'ఎవరినైనా ప్రేమించావా ?' అడిగింది నాగమణి. అప్పటికి అర్థం అయింది సమీర తనగురించి అడగటంలేదు, తన గతజీవితం గురించి మాట్లాడటంలేదు అని.

'ఆహా, ప్రేమించాను. అందుకే యీబాధంతా.'

'మీనాన్నగార్కి యిష్టంలేదా ?'

'ఉంది. నాన్నకి, నాకు అందరికీ యిష్టంవున్నవ్యక్తిని, మాబావని ప్రేమించాను, ప్రేమిస్తున్నాను.'

'మరి ?'

'చెప్పానుగదా – నాప్రమేయం లేకుండా పొరబాటు జరిగిపోయిందని' అన్నది నెమ్మదిగా గొంతు తగ్గించి సమీర.

అప్పటిదాకా దిళ్ళకి జారబడి రిలాక్స్‌డ్‌గా కూచున్న నాగమణి, నిటాగ్గా అయిపోయింది. జారబడిన మనిషి కర్రలాగా అయింది. వేగంగా కొట్టుకుంటున్న పల్సు, చిక్కిపోయి, వడిలినట్లున్న సమీర, యివన్నీ తన కళ్ళకి కనిపించిన లక్షణాలు. అయితే తను డాక్టరుగా యింకా లోతుగా ఎందుకు చూడలేకపోయింది ? ఈ చిహ్నాలకి అసలు కారణం, యీ లక్షణాలు నెలతప్పిన ఆడవాళ్ళలో కనిపిస్తాయని, తను యిట్టే పట్టెయ్య గలదు. అలాంటిది సమీరని చూస్తూ ఎందుకు గ్రహించలేకపోయింది. అదే పెళ్ళయిన అమ్మాయి అయితే, ఠపీమని, చూసిన మరుక్షణంలో ఏ టెస్టులూ అక్కరలేకుండా చెప్పేసేది. సమీరకి పెళ్ళికాలేదు కాబట్టి తనకి ఆ ఆలోచన రాలేదు. డాక్టర్ల డయాగ్నొసెస్‌మీదకూడా సాంఘికమైన కట్టుబాట్ల ప్రభావం వుంటుందా ?

సమీర తలవంచుకుని కూచుంది. ఇక తను చెప్పేది ఏమీలేదన్నట్లు.

'ఎలా జరిగింది ? ఎందుకీపొరబాటు జరిగింది ? ఆర్ యు ష్యూర్ ?' అడిగింది నాగమణి ఆదుర్దాగా.

'పొరబాటులో నాబాధ్యత లేదని ముందేచెప్పాను. నేను కావాలని చెయ్యలేదు. నాప్రమేయం....'

'నీమీద....నీమీద....' ఎలా అడగాలో తెలియక

'ఉహూ, మీరు వూహిస్తున్న అత్యాచారం....అల్లాంటిదేం జరగ లేదు....టెస్ట్ చేయించుకున్నాను – నా 'డౌట్' నిజం అయింది – అందులో సందేహంలేదు.'

'ఇప్పుడేం చేస్తావ్ ? అతనెవరో చెప్పు, మీనాన్నగార్కి చెప్పి...'

'ఆగండి. సినిమాల్లోలాగా మాట్లాడకండి. అయ్ హేట్ హిమ్. వాడంటే నాకు అసహ్యం....ఆ రోగ్‌ని పెళ్ళిచేసుకుంటా ననుకుంటున్నారా– నెవర్!'

'మరి?'

'మీరు హెల్ప్ చెయ్యాలి–అందుకే ఈ రహస్యం మీతో చెప్పాను.'

'ఎన్నాళ్ళయింది?'

'పీరియడ్ మిస్ అయి .... పదిహేనురోజు లయింది.'

'ఏం టెస్ట్ చేయించుకున్నావ్?'

'యూరిన్ టెస్ట్ చేసి – గంటలో చెప్పారు – కన్‌ఫరమ్ చేసి – '

'తరువాత?'

'మీరు దీన్ని టెర్మినేట్ చెయ్యాలి. చాలా చిన్న ఆపరేషన్ – డి. యన్. సి. చేస్తే చాలని అంది నా ఫ్రెండు – '

'నేనా?'

'అవును. మీరుగాక ఎవరిదగ్గర కెడతాను – మీరయితే నాకు ధైర్యంగా ఉంటుంది – '

'నేనా ? నేను చెయ్యలేను.'

'ఎందుకని ?'

'అది పాపం – డాక్టర్లం ప్రాణాలు కాపాడుతామునుగాని – వూపిరి పోసుకుంటున్న జీవిని చంపం. నామాట విను – అత నెవరో చెప్పు – మీ నాన్నగార్కి చెప్పి – కన్విన్స్ చేసి పెళ్ళి జరిపిస్తా.'

'డాక్టర్, మీకు మతిపోయింది. అయామ్ సారీ. చనువుగా అనేశాను. వాడంటే నాకు అసహ్యం. ఆ 'లోఫర్'ని పెళ్ళిచేసుకో మంటున్నారా ? దేనికి ? ఈ పుట్టబోయే ప్రాణికోసమా ? అసలు – అది ప్రాణి అందులో జీవం వుంది – అని నాకు అనిపించటంలేదు....'

'ఇంకో తొమ్మిదినెలలకి.'

'తొమ్మిదినెలలుకాదు - తొమ్మిదేళ్ళయినా నాకు యీ ప్రాణిమీద ప్రేమరాదు - అసహ్యాంతప్ప. ఎందుకో తెలుసా ? నా ప్రమేయం లేకుండా జరిగి యాక్సిడెంట్ యిది. మీకాలుమీద కురుపులేస్తుంది - దాన్నేం చేస్తారు? దేహారోగ్యంకోసం ఆకురుపుని ఆపరేషన్ చేసి తీసిపారెయ్యరా ?'

'అదీ యిదీ ఒకటి ఎల్లా అవుతుంది - అది దేహంలోని జబ్బు - నెత్తురు ప్యూర్‌గా లేకపోతే వస్తుంది.... అందుకని ఆపరేషన్ చేస్తాం.'

'ఏం ? ఆనెత్తురూ మీదేగా - కాలు సలుపుతున్నాసరే - ఆ కురుపుని హాయిగా పెంచుకుని, 'ఈ కురుపుకోసం నాకాలు నరుక్కుంటానోహో' అని దండోరా వేయించండి - అందరూ మీ నీతినిజాయితీలని మెచ్చుకు పూల మాలలు వేస్తారు' కసిగా వుద్రేకంగా అంటున్నది సమీర.

నాగమణికి ఏంమాట్లాడాలో అర్థం కావటంలేదు. సమీర యిల్లా మాట్లాడుతున్నదేమిటి ? నైతికవిలువలూ, దృక్పథాలు అన్నిటినీ తల్లకిందు చేసి మాట్లాడుతోంది.

'అసలేం జరిగింది ?' అడిగింది నాగమణి.

'ఏంజరిగిందో, ఎల్లా జరిగిందో తరువాత చెపుతానుగాని, ముందు నాకు డి. యస్. సి ఎప్పుడు చేస్తారో చెప్పండి.'

'సమీరా, నామనసెందుకో యీపద్ధతికి వొప్పుకోనంటున్నది. నీ వాదనలో ఎక్కడో లోపం వుందనిపిస్తున్నది.'

'ఎందుకని ?'

'ఇంత జరిగాక, నువ్వు మామూలుగా తిరగ్గలవా ? తప్పు చెయ్యలేదని సరిపెట్టుకోగలవా ?'

'నేనేం కావాలని తప్పు చెయ్యలేదు అది యాక్సిడెంట్.'

'అన్ని బర్త్‌లూ యాక్సిడెంట్సే ! అలా కాకపోయినట్లయితే, యీపాటికి మనకి నుల్చునే చోటుకూడా లేనంతమంది పుట్టివుండేవాళ్ళు. అందరి జంటలకీ, కలుసుకున్నపుడల్లా పిల్లలుపుట్టరు.'

'ఆమాత్రం నాకు తెలియదనుకుంటున్నారా? బేసిక్ నాలెడ్జ్ నాకూ వుంది - కావాలని - పరస్పర ప్రేమతో, ఇష్టంతో కలుసుకోటంవేరు - మోసగించి - ట్రిక్ చేసి....' ఆగిపోయింది సమీర.

'నిన్ను పెళ్ళిచేసుకుంటానని మోసగించాడా?'

'ఇదిగో మీరు ఒక్క ట్రాక్‌లోతప్ప ఆలోచించరేం - కడుపు అంటే దానికి ముగింపు పెళ్ళితప్ప యింకేమీ వుండదా - నాకు వాడంటే అసహ్యం'

'ఎలా జరిగింది? ఆ పరిస్థితిలో ఎందుకు వచ్చావ్? నిన్ను బలవంతం....'

'ఛెట్. అల్లాంటిదికాదు.'

'ఆక్షణంలో నీకు యిష్టంఅయిందా?'

'కోర్టులో ప్లీడరులాగా అడుగుతున్నారు. ఇంకెవరయినా యిల్లా అడిగివుంటే - జుట్టుపీకి వుండేదాన్ని - మీరు కాబట్టి, మీకు నామీద యిష్టం కాబట్టి జవాబు చెపుతున్నాను. ఆఖరికి మానాన్నకికూడా జవాబు చెప్పి వుండేదాన్ని కాదు.'

'మీనాన్నగార్కి తెలుసా?'

'నాన్నా, నాకు కడుపొచ్చింది, ఇందులో మీఅభిప్రాయం ఏమిటి అని అడుగుతాననుకున్నారా?'

'అదికాదు - సమీరా....'

'మా నాన్నావాళ్ళూ మీకంటే మరో శతాబ్దం వెనక వున్నారు - అందుకని వాళ్ళకి చెప్పను. ఈవిషయం బయటకి చెప్పటంచేత 'సోకాల్డ్' నీతిని పరిరక్షించి వుండచ్చు. ఆ నీతివుంది చూశారూ - అది ఎవరికీ సంతోషాన్ని ఆఖరికి నాకు, మావాళ్ళకి, బావకి ఎవరికీ ఆనందాన్ని యివ్వదు. అందరినీ కష్టాలపాలు చేస్తుంది. నీతికోసం నేను నామెడకి గుదిబండను కట్టుకోదలుచుకోలేదు.'

'ఏంచేస్తావు?'

'డి. యన్. సి.'

'నేను చెయ్యనంటే_'

'వైజాగ్ వెళ్ళి చేయించుకొస్తాను.'

'మరి అక్కడే ఎందుకు చేయించుకోలేదు. ఈపాపంలో నాకుకూడా–'

'ఇది పాపంకాదు - పుణ్యం. అని మీకు ఎన్నిసార్లు చెప్పినా అర్థం అవదే - ఆఖరికి గాంధీజీకూడా యిటువంటి విషయాల్లో స్త్రీ - టెర్మినేట్ చేయించుకోవచ్చు అన్నారు.'

'ఎక్కడ ?'

'హరిజన్‌లో - ఎవరో అడిగిన ప్రశ్నకు యీవుద్దేశ్యం వచ్చేట్లు జవాబు యిచ్చారుట.'

'ఆయన చెప్పింది అదికాదు. అత్యాచారం జరిపే పురుషుడిని ఎదుర్కోటానికి స్త్రీ హత్యకూడా చెయ్యచ్చు. 'సెల్ఫ్ డిఫెన్సు' కోసం అన్నారు.'

'నేనుమటుకు ? సెల్ఫ్‌డిఫెన్సుకోసమే ఈపని చెయ్యాలనుకుంటున్నాను.'

'అదీ యిదీ ఒకటి ఎలా అవుతుంది ? నాయిష్టం లేకుండా, నాకు వంటిమీద - కంట్రోల్‌లేనపుడు'

'నువ్వు విషయం పూర్తిగా చెప్పు, సమీరా !'

'మా కాలేజీమేట్స్‌తో ....'

'ఇంకా ఆడపిల్లలు లేరా ? నువ్వొక్కదానివే వెళ్ళావా ?'

'ఇంకా ఇద్దరం ఉన్నాం. అతను యూనియన్ ఎలక్షన్స్‌లో నిల్చుని గెలిచాడు. అతను గెలవటానికి మేమూ కాన్వాస్‌చేశామనుకోండి. ఆ సంతోషంలో పార్టీ - సినిమా అన్నాడు. హోటల్ కెళ్ళాం ; సినిమాకి వెళ్ళాం, సినిమానుంచి అతని రూమ్‌కి వెళ్ళాం _ '

'ఎంతమంది?'

'టూ పెయిర్స్'

'రెండు జంటలా?' అడిగింది నాగమణి.

'తొమ్మిదేగదా అయింది. మా రూమ్‌కి రండి అన్నాడు. సరదాగానే వెళ్ళాం.'

'అలా వెళ్ళటం నీకు అపాయమని తోచలేదా?'

'ఉహూ. అంతక్రితం ఒకటిరెండుసార్లు వెళ్ళాం. కబుర్లు చెప్పుకున్నాం. నామీద నాకు నమ్మకం ఉంది. నన్ను ఎవరూ ఏం చెయ్యలేరని నమ్మకం. అంతక్రితందాకా సరదాగా కబుర్లతో నడిచిన మా సంభాషణ డ్రింక్స్‌మీదకి మళ్ళింది. 'ఆడవాళ్ళు మగవాళ్ళతో సమానం అంటారు. డ్రింక్ తీసుకోమంటే హడలిపోతారు....' అంటూ టీజ్ చేశారు.'

'నీతోవచ్చినమ్మాయి?_'

'వాళ్ళింట్లో డ్రింక్‌పార్టీ అలవాటేట. ఆ అమ్మాయి జిన్ చాలాసార్లు పుచ్చుకుందిట. 'ఫరవాలేదు ఏమవదు. ఇంత పిరికిగొడ్డువా' అంటూ ఛాలెంజ్ చేశారు. ఛాలెంజ్ నిలబెట్టుకోవాలని, డ్రింక్ ఎలావుంటుందో రుచి చూద్దామన్న కుతూహలంతో-సోడాతో కలిపిన జిన్ తాగాను. తలతిప్పలేదు. మామూలు సోడా తాగినట్లుంది. ఓస్ - యింతేగదా అనుకుని - మళ్ళీ గ్లాసు అడిగాను. ఈ రెండోసారి తాగింది వగరుగా, ఘాటుగా, తమాషాగా ఉంది. ఆరాత్రి మూడునాలుగుసార్లు తాగాననుకుంటా - '

'మైగాడ్ - తరువాత ?'

'పదింటికి హాస్టల్‌కి వెళ్ళలేకపోయాము. ఏదో మత్తు _ ఉత్సాహం, కుతూహలం - అసహ్యంతోపాటు _ కొత్తగా, చికాగ్గా అనిపించింది. నాపక్కనతను ___ 'ఎడ్వాంటేజ్' తీసుకుంటున్నాడని తెలుసు ___ కాని అడ్డుకోలేకపోయాను...'

'తరువాత?'

'అసహ్యంగా - చికాగ్గావుండి అప్పటికప్పుడే వెళ్ళిపోతానని లేచాను. పదకొండింటికి _ మాయిదరినీ _ కారులో దించారు. వాచ్‌మన్ చేతిలో

అయిదు రూపాయలు పెడితే, గప్‌చిప్‌గా గేట్లు తెరిచాడు. నా గదికెళ్ళి - స్నానంచేసి పక్కమీద పడ్డాను - '

'తెల్లవారి నీకు భయంవెయ్యలేదా ? ఆరాత్రి నిద్రఎలాపోగలిగావ్?'

'ఏదో మత్తుగా వుంది. మెదడులో పొరబాటు జరిగిపోయిందన్న బాధకలిగింది. జరిగింది వెనక్కి తీసుకోలేముగా - ఇంక వాడిమొహం చూడకూడదనుకున్నాను. తెల్లవారి పదింటికిగాని మెళుకువ రాలేదు. రాత్రి జరిగింది మర్చిపోయాను. అదో చేదు అనుభవంలాగా తప్ప - నాలో యింకే భావమూ కలగలేదు. అసలు యిలా జరిగివుండకపోతే - పీరియడ్ మిస్ అవకపోయినట్లయితే - ఎవరికీ చెప్పేదాన్ని కాదు.'

'అతను మళ్ళీ కలుసుకునేందుకు ప్రయత్నించలేదా ?'

'ఒకటిరెండుసార్లు పల్కరించబోయాడు - స్లిప్పర్ తీసి చూపించాను'

'బ్లాక్ మెయిల్ చెయ్యబోలేదా ?'

'వాడిమొహం - అంతధైర్యం ఎక్కడేడిసింది ? వాడో పురుగు - బొద్దెంకలుంటాయి చూడండి - అటువంటి పురుగునుచూస్తే ఎల్లావుంటుందో వాడి మొహంచూస్తే నా కంతటి వెలపరింత వేస్తున్నది. అల్లాంటివాడిని మీరు పెళ్ళిచేసుకోమని సలహా యిస్తున్నారు - దానికిబదులు కాళ్ళూచేతులూ నరుక్కోవటం సుఖం....'

'మీబావ అంటే నీకు అంత ప్రేమకదా - అతన్ని చేసుకోటం యీస్థితిలో తప్పుగదా - నీకు గిల్టీగా...'

'మనం - స్త్రీలం యిలా ఆలోచించటంచేతనే యిన్ని అన్యాయాలూ, బాధలూ కలుగుతున్నాయి. నాకు యిలా జరిగి - యీవిషయం బయటకొచ్చి మీదాకా వచ్చాను. లేకపోయినట్లయితే జరగరానిది జరిగిపోయింది అని మర్చిపోయేదాన్ని....అంతే....'

'నిజంగా మర్చిపోగలిగేదానివా ?'

'మొదట్లో కొన్నాళ్ళు మనసులో కొంచెం బాధపడి 'గిల్టీ'గా ఫీలయేదాన్ని - ఆతరువాత తప్పక మర్చిపోయేదాన్ని. ఇటువంటి తప్పులు,

ఏభార్యాభర్తలు, స్త్రీపురుషులు పెళ్ళికి ముందుగాని, తరువాతగాని చెయ్యలేదని? అందరూ మహాపవిత్రంగా వున్నారని గుండెలమీద చెయ్యేసి గ్యారంటీ యివ్వగలరా?' అడిగింది సమీర.

నాగమణి జవాబు చెప్పలేకపోయింది. ఎన్ని దాంపత్యాల్లో - ఎన్ని కల్లలున్నాయో - ఎవరికి తెలుసు ?

'ఇవన్నీ నేను ఆలోచించలే దనుకుంటున్నారా ? ఈ నెల్లాళ్ళూ చాలా బాధపడ్డాను. పిరియడ్ మిస్అయే పరిస్థితి వూహించికాదు. ఎందుకు యిలా జరగనిచ్చాను అని. ఈ జరిగినదానివల్ల ఒక్క నాజీవితమేకాదు - నాతల్లితండ్రులు, బావ, మా పేరు, గౌరవం, అన్నిటికీమించి నేను ఏ విధంగానూ గౌరవించలేని లోఫర్‌తో పెళ్ళి....'

'చేసుకోకు'

'అందువల్ల .... ఈ పుట్టబోయే ప్రాణిని పెంచుతాను అనుకోండి సినిమాల్లోలాగా ! అప్పుడు మావాళ్ళ గౌరవం చెక్కు చెదరకుండా వుంటుందా ? మాబావ హాపీగా వుంటాడా ? జీవితమంతా యీ 'స్టిగ్మా' నే నెందుకు మొయ్యాలి ? ఇదంతా దేనికోసం ? నాకు ఆ వ్యక్తిమీద ఏకొంచెం గౌరవంగాని, ప్రేమగాని వుండి వుంటే కావాలని నే నీపని చేసివుంటే యీ యీబాధ్యతలన్నీ ధైర్యంగా మోసేదాన్ని. ఒక్క రెండునిముషాలు తాగిన మత్తులో, ఏంజరుగుతోందోకూడా తెలుసుకోలేని పరిస్థితిలో జరిగిన పొరబాటుకి యిన్నిబాధలు - యింతమందిని క్షోభపెట్టటం దేనికి ? పవిత్రత అన్నది మంచిదే - కారెక్టరు అన్నది అందరికీ వుండాలి. యిది దైహికమా? మానసికమా ? చెప్పండి.'

ఇంత సూటిగా సమీర అడుగుతుంటే నాగమణి జవాబు చెప్పలేక పోతున్నది.

సమీర మళ్ళీ చెప్పటం ఆరంభించింది. 'మాబావ రెండేళ్ళుగా స్టేట్స్‌లో వున్నాడు. తను హైయ్యర్ స్టడీస్‌కి వెళ్ళాలని పట్టుపట్టింది ఎవరో తెలుసా ?'

ప్రశ్నార్థకంగా చూసింది నాగమణి.

'నాన్నా మీరెప్పుడో కట్నం అంటూ మూటగట్టి యివ్వటానికి బదులు, బావని ఫారెన్ పంపటానికి ఖర్చుపెట్టండి' అని నేను ప్రోత్సహించాను. బావ నన్ను డబ్బుకోసం ప్రేమించాడనుకోకండి. మాయిద్దరికీ ఒకరిమీద ఒకరికి అప్పటికే యిష్టం. అంచేత వొప్పుకున్నాడు. వారం వారం మేము వుత్తరాలు రాసుకుంటాము. మొన్న రెండువారాలు జాబులు రాలేదని – ఎందుకు రాలేదని కేబుల్ యిచ్చాడు. అయితే మాబావ యీ రెండేళ్ళలో ఏ అమ్మాయివంకా చూడలేదని, శ్రీరామచంద్రుడిలా మడి గట్టుకు వున్నాడని నేను అనుకోను. అసలు అతను పవిత్రంగా వున్నాడా లేదా అన్న ఆలోచనలే నాకు రావు.'

'అతను మగవాడు.'

'నాన్‌సెన్స్. తప్పటడుగువేసి, ఆడది జలగలా పట్టుకుంటే లొంగిపోయినవాళ్ళూ, పెళ్ళిచేసుకుని జీవితాంతం ఏడుస్తున్నవాళ్ళూ మగాళ్ళలోనూ వున్నారు.'

'నువ్వెంత చెప్పినా, నేను కన్విన్స్ అవలేకుండా వున్నాను.'

'ఎలా అవుతారు ? అవరు. పెళ్ళికాకుండా నేనింత పొట్టవేసుకు తిరిగి, ఆ 'లోఫరు' నాకేం తెలియదు అంటే, నేను ఏ నుయ్యో గొయ్యో చూసుకుని, మావాళ్ళు యీ అవమానం భరించలేక వూరువొదిలిపెట్టి వెళ్ళిపోతే, మాబావ మజ్నూలాగా పిచ్చివాడై తిరుగుతుంటే – మీ ఎథిక్స్ – మీ మోరల్స్ భద్రంగా వుంటాయి. మీరు ధర్మాన్ని రక్షించానని సంతోష పడుదురుగాని. కాని యిదంతా దేనికి ? ఎవరికోసం – ఎవరిని రక్షించాలని – దీనివల్ల ఎవరికైనా సుఖసంతోషాలు కలుగుతున్నాయా ? – ఆలోచించండి. అప్పుడు నేను చెయ్యబోతున్నది రైటు అని వొప్పుకుంటారు.'

'తరువాత పెళ్ళి అయాక మీబావకి యీవిషయం చెవుతావా?'

'చెప్పను.'

'అవసరంవస్తే? డాక్టరుగా, హ్యూమస్ ఎనాటమీ తెలిసినవ్యక్తిగా అడుగుతున్నాను.'

'అయితే ముందే చెప్తాను. నీకు యిష్టం అయితేనే చేసుకో అంటాను. నాకు ఆమాత్రం మోరల్ కరేజ్ వుంది, డాక్టర్' అంది సమీర.

ఆమరునాడు పదినిముషాల్లో గుట్టుచప్పుడు కాకుండా పని ముగించేసింది నాగమణి. ఆ తరువాత నాగమణి చాలాసార్లు అనుకుంటూ వుండేది. అర్గ్యుచేసినంతసేపు పట్టలేదు – దీని ఛాయలు పూర్తిగా తొలిగించెయ్యటానికి అని : ఆ తరువాత సమీర బావ అమెరికానుంచి వచ్చాడు. అతను నల్లగా పొడవుగావున్నా, మంచి చురుకైన కళ్ళు. అతను కళ్ళతో సమీరని నిలువెల్లా ఆరాధనతో ఆస్వాదిస్తున్నాడని – ఈ యువతీ యువకులు తలమునకలుగా ప్రేమలో వున్నారని తను చూసి చూడగానే గ్రహించుకుంది. తను మంచిపని చేసింది. ఎవరికీ అఖ్ఖర్లేని, ఎవరికీ ఆనందం యివ్వని ఆ 'అన్వాంటెడ్'ని తీసిపారెయ్యగలిగాను అనుకుంది.

సమీర బావని వెంటపెట్టుకొచ్చింది పెళ్ళికిముందు. 'మాబావ – ఈమె నాడాక్టర్ – ఫ్రెండ్, ఫిలాసఫర్ అన్నీ యీమే నాకు. షి యీజ్ మై గైడింగ్ స్టార్' అంది సమీర చాలా పొయిటిక్‌గా పరిచయంచేస్తూ.

అతను నవ్వుతూ, 'మా సమీర ఎవరికీ అన్ని సుపర్లేటివ్‌నేమ్స్ పెట్టదు. మీరంటే చాలా యిష్టంఅని వుత్తరాలనిపట్టి అనుకున్నాను – మీరు లావుగా, పొడుగ్గా భయంకరంగా వుంటారని – కళ్ళజోడూ వగైరా – వగైరా....' నవ్వుతూ వర్ణించాడు తను వూహించుకున్న మానసిక చిత్రాన్ని. ముగ్గురూ సరదాగా నవ్వుకున్నారు.

'అయామ్ రియల్లీ గ్రేట్‌ఫుల్ డాక్టర్. మీరు సమీరని చాలా సపోర్ట్ చేశారుట. మెనీ మెనీ థాంక్స్' అన్నాడతను చాలా వుద్రేకంగా.

ఆ క్షణంలో సమీర ధైర్యస్థురాలేకాదు, చాలా మోరల్ పర్సన్ అని కూడా అనిపించింది నాగమణికి .... మోరల్ కరేజి అన్నది - ఫిజికల్ కరేజికంటే—వున్నతమైనది—పై మెట్టుమీద వున్నదీను. అటువంటి మోరల్ కరేజిగల సమీర నిజంగానే - సుఖంగా - సంతోషంగా వుంటుంది. వారి దాంపత్యజీవితం మూడుపువ్వులూ ఆరుకాయలుగా వుంటుంది అనుకుంది.

రెండేళ్ళ బాబుని ఎత్తుకుని భార్యాభర్తలు స్టేట్స్‌నుంచి వచ్చారు. సమీర వచ్చీరాగానే, అసాయంత్రమే తనని చూడటానికి వచ్చింది.... బాబుని తనకి యిస్తూ - 'వీడి పేరేమిటో తెలుసా ?' అడిగింది గలగల నవ్వుతూ - మాటలూ నవ్వులూ కలగాపులగంచేస్తూ.

'సుబ్రమణ్యం - మేము మణి అని పియిస్తాము. రేప్పొద్దుట మణీ మణీ అంటే, మీరు 'హోయ్' అంటారేమోనని ముందే చెప్పేస్తున్నాను. మీస్నేహం, ప్రేమా, ఆఖరికి పేరుకూడా లాగేసుకున్నానోచ్....' అంటూ తనని పిల్లవాడితో కలిపి కౌగలించుకుంది సమీర. సమీర ఏమీ మారలేదు. ఆ అల్లరి, సూటిగా మాట్లాడే అలవాటు - తనకి ఏంకావాలో తెలుసుకుని, దానిని పొందగలిగి, ఆ పొందిన ఆనందసౌభాగ్యాలని పదిలంగా దాచుకో గల నేర్పూ, సాహసమూ వున్నాయి ఈ సమీరకు.

తనకోసం బి. పి. చూసే అపరేటస్ - స్టెతస్కోపు, రిస్టువాచీ, లేటెస్టు మెడికల్‌జర్నల్సూ పట్టుకొచ్చింది సమీర. ఆజంటని చూస్తే నాగమణికి చాలా సంతోషమూ - తృప్తీ కలిగాయి. సమీర భర్త సరేసరి- అతని కళ్ళకి అందాలబొమ్మ అయిన భార్యా - పిల్లవాడూ తప్ప ఏమీ కనిపించనట్లుగా వున్నాడు. సాధారణంగా తనవంటి డాక్టర్లకి డెలివరీకేసు అటెండ్‌అయి, కొత్తజీవిని యీ ప్రపంచంలోకి తీసుకొచ్చిన ప్రతిసారీ ఏదో గర్వంగా, తృప్తిగా వుంటుంది. బ్రహ్మచేసిన యీ సృష్టిలో, తనకి కూడా కొస్త భాగం వుంది. తాను యీ జీవిని లోకంలోకి తీసుకురావటానికి కొంత సహాయం చేశాను అని. సమీర దంపతులను వాళ్ళ బాబుని చూసినపుడుకూడా తనకి అటువంటి తృప్తే కలిగింది.

అయితే ఆ సమీర ఎందుకు రాలేదు ? రాత్రి అనగా వచ్చి వుండాలే-పోనీ, రాత్రి బయలుదేరి వుండకపోతే పొద్దుటయినా బయలుదేరి వుండాలే-పొద్దున బయలుదేరితే పన్నెండింటి లోపల యీవూరు జేరుకుని వుండాలి. ప్రయాణబడలికలో ఒకగంట పడుకున్నా యీపాటికి రావాలి. ఠంగు – ఠంగున మూడుకొట్టింది. మూడుగంటలయినా సమీర రాలేదు. ఒక్క-పేషంటూ రాలేదు, నర్సురాలేదు, మంత్రసానీ రాలేదు. రిక్షావాడూ రాలేదు. ఎందుకని అందరూ కట్టుకట్టి తనని ఎందుకు బాయ్‌కాట్ చేస్తున్నారు ?

ప్రెసిడెంట్‌గారు అవసరం అయితే – మనిషిని పంపుతానన్నారు. కారు పంపిస్తామన్నారు. ఎల్లా వుందో ? బాలింతరాలు ఎలా వుందో కబురుకూడా పెట్టలేదు. పదేళ్ళపాటు ఈ వూరివాళ్ళకి పగలనక రాత్రి అనక సేవచేస్తున్నది. కాని, కాని ఈరోజు తను ఎవరికీ అక్కర్లేక పోయిందా ? ఏంచేశానని – ఏంజరిగింది ? అకారణంగా అందరూ ఎందుకిలా బాయ్‌కాట్ చేస్తున్నారు ? పోనీ, డాక్టర్ సర్వేశ్వరరావయినా, కారణం చెప్పారు కాదేం ? అతనన్నా వస్తే బాగుండును....

డాక్టర్ సర్వేశ్వరరావు అయినా వస్తే బాగుండును అనుకుంటున్నదా ? తన ఆలోచనకి తనకే ఆశ్చర్యం కలిగింది. మొదటినుంచీ యీ డాక్టరన్నా – అతని మొరటుమాటలన్నా, పేషంట్లపట్ల అతను రఫ్‌గా ప్రవర్తించే తీరన్నా నాగమణికి చికాకు. తను డాక్టరు - రోగాలు నయం చేస్తాడు. పురుషులకీ, స్త్రీలకి, బాలెంతలకి, ముసలింతలకి వైద్యం చేస్తాడు. నిజమే. అంతమాత్రంచేత – స్త్రీపురుషులమధ్యగల సంబంధ గురించి అంత పచ్చిగా, బాహాటంగా మాట్లాడక్కరలేదు. ఎందుకంత మోటుగా, అశ్లీలాలు దొరిసూ మాటాడుతాడో అర్థం అయేదికాదు నాగమణికి. ఆ

డాక్టరు అలా మాట్లాడుతుంటే పేషంట్సు - ఆడా మగా యిద్దరూ నవ్వి వూరుకుంటారేతప్ప - చికాకు పడరు. కోపగించుకోరు. ఈ అశ్లీలాలని - తిట్లనీ వాళ్ళు ఎంజాయ్ చేస్తున్నారా? వాళ్ళకి యిలా మాట్లాడితే యిష్టమా? అన్న సందేహం వస్తూండేది నాగమణికి.

'ఈ సుబ్బమ్మకి ఆరుగురూ ఆడపిల్లలే. మగపిల్లాడు పుట్టేదాకా, గొడ్డులా పిల్లల్ని యీనాలిట - మళ్ళీ కంటే చచ్చిపోతుంది మీరు దాని అత్తకి చెప్పండి. కోడలు చస్తే, వండిపెట్టేవా ళ్ళుండరు - కొడుకు పక్కలోకి పెళ్ళాంరాదు - అని' అంటూ సన్నగా పీలగావున్న మధ్య వయస్కురాలిని తీసుకొచ్చాడు డాక్టర్ సర్వేశ్వరరావు. మొగుడికి బట్టల కొట్లో పని, వుంటానికి యిల్లుంది - నాలుగుఎకరాల పొలంవుంది. ఈ ఎస్టేటు అనుభవించటానికి వారసుడు లేడని - అత్తగార్కి, మొగుడికీ బెంగ. అందుకని ఏటేటా పిల్లల్ని కంటున్నది. సుబ్బమ్మ అని పిలువబడే సుబ్బలక్ష్మి, యస్. యస్. యల్. సి. పాసయింది. ఆవూళ్ళో చదువుకున్న వారిలోకే లెక్క. అయినా భర్తనీ, అత్తనీ ఎదురించలేని నిస్సహాయురాలు. ఏటా కానుపుతో అరడజను ఆడపిల్లల తల్లి సుబ్బలక్ష్మి - బక్కగా, ఎండిపోయి, గూడఎముకలు పైకి కనిపిస్తూ వుంది. అసలే అనారోగ్యంతో మగపిల్లలు లేరు అని బాధపడుతున్న స్త్రీని తీసుకొచ్చి, యింత పచ్చిగా తోటిమగడాక్టరు పరిచయం చెయ్యటం నాగమణికి అసహ్యంగా తోచింది. తన కొలిగ్, తనకంటే వయసులో, అనుభవంలో పెద్ద. ఏమీ అనలేక తలవంచుకుంది చికాగ్గా - ఆయన వెళ్ళిపోతే పేషంటుతో నెమ్మదిగా మాట్లాడచ్చుని. కాని ఆయన కదిలేట్టు లేడు.

'ఈమనుషులకి ఏంచెప్పీ ప్రయోజనం లేదు. చెప్పి చెప్పి నా గొంతునెప్పి తప్పితే, ఎందుకు చెపుతున్నానో అర్థం చేసుకో. పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకోవయ్యా అంటే - 'అమ్మో చచ్చిపోతాను' అంటాడు. పెళ్ళాం చస్తే ఫరవాలేదు. మరోపెళ్ళాన్ని, వయసులో

వున్నదాన్ని చేసుకోవచ్చు. అదో వెరైటీ అనుకుంటున్నాడు - పిల్లల్ని కనీ కనీ పెళ్ళాం మూలబడితే అప్పుడేం చేస్తాడో ?' రోగి ఎదురుగుండా యిట్లాగా మాట్లాడటం ! విసుగ్గా వుంది నాగమణికి.

'ఏవిటమ్మా - మీకంప్లయింట్' నెమ్మదిగా అడిగింది నాగమణి.

'ఏముంది. వంట్లో శక్తి వున్నంతవరకూ కన్నది. ఇప్పుడేమో యీవినింగ్ టెంపరేచర్ వస్తోంది. అదీ కధ' అన్నాడు సర్వేశ్వరరావు.

'మీరు ట్రీట్‌మెంటు మొదలుపెట్టలేదా ?'

'నామందులుదారి మందుదే, వీళ్ళదారి వీళ్ళదే. ఈవిడకీ బుద్ధిలేదు, మొగుడుకీ లేదు. ఆమధ్య కాస్త ఫరవాలేదు అనుకున్నాను.'

'ఏవయిందమ్మా ?' నెమ్మదిగా అడుగుతోంది నాగమణి.

'ఏవవుతుంది ? మొగుడూ పెళ్ళాలకి బుద్ధి లేదన్నాగా - వెధవపని చేశారు. ఆ అత్త వుందే_అదేదో పెద్దఘనకార్యంలా చెపుతోంది' కోపంతో ఎర్రగా వుంది ముఖం. గొంతు చించుకుని చెప్తున్నాడు.

ఆక్షణంలో సర్వేశ్వరవుని చూస్తే నాగమణికి మొదటిసారి మనసులో కాస్త సానుభూతి చోటుచేసుకుంది. ఈ మనుషులు ఎప్పుడు బాగుపడతారు ? ఆయన కోపం వెనకనున్న నిస్సహాయత అర్థం అవుతోంది.

'ఏంచేస్తావమ్మా ?' అడిగింది.

'ఏంచేస్తుంది ? మీరు టెర్మినేట్ చెయ్యండి. టి. బి మనిషికి పిల్లలేమిటి ? 'లా'వొప్పుకుంటుంది....'

'ఆమె భర్త వొప్పుకుంటారా ?'

'వొప్పుకోడు' అన్నాడు సర్వేశ్వరరావు చాలా తాపీగా.

'మరి ఎల్లా ?'

'నేను తిడితే, వాళ్ళు లెక్కపెట్టరు. పదేళ్ళగా అలవాటయి పోయాను. ఈయన తిట్టి తిట్టి చివరికి వైద్యంచేసి మగపిల్లాడిని కనిపిస్తాడు అని నామీద నమ్మకం. అంచేత మీరన్నా చెపితే వింటారని తీసుకొచ్చాను.

ఈమనిషి కనలేక చచ్చిపోతే కేసు పెడతానని బెదిరించండి. ప్రెగ్నెన్సీ పెర్మినెట్ చేసుకోడానికి యీవిడకు హక్కుందని – ఆ అత్తని పిలిచి చెప్పండి.’

‘మీరు ?’

‘నేను మగడాక్టరుని – మీఅంత ఫ్రీగా ఆడపేషంట్లకి వివరించి చెప్పటం అవదు’ అన్నాడు.

నాగమణికి చాలారోజులకి ఫక్కున నవ్వు వచ్చింది. కంట్రోల్ చేసుకోలేక నవ్వేసింది.

‘దేనికి నవ్వుతున్నారు ?’ కోపంగా అడిగాడు కుర్చీకి నిండుగా కూర్చున్న సర్వేశ్వరరావు.

‘ఏంలేదు ?’

‘అయ్ నీడ్ ఎ ఆన్సర్ – కమాన్ – ఎందుకు నవ్వారు ?’ తీక్షణంగా అడుగుతున్నాడు. తిట్టటానికీ, నవ్వటానికీ ఆయనకిమటుకే హక్కుంది కాబోలు. ఇంకెవరికీ లేదుకాబోలు.

‘మీరు ఫ్రీగా పేషంట్లతో మాట్లాడలేను అంటే నవ్వొచ్చింది. అంతకిమించి కారణం ఏంలేదు నానవ్వుకి’ అంది నాగమణి.

‘అదా, ఈగ్రొరెలమంద గురించి మీకు తెలియదు, డాక్టర్. ‘ఇదిగో నువ్వు లోపలి కెళ్ళు’ పక్కనున్న సుబ్బలక్ష్మిని గదమాయించినట్లు నర్స్‌కి అప్పజెప్పి, టేబుల్‌మీదకి వంగి, కుడిచేత్తో తెల్లజుట్టుని పైకి తోసుకుంటూ, ‘మనదేశం యిప్పట్లో బాగుపడదుదు. ఒక్కొక్కళ్ళు పిల్లల్ని కంటమే తమ ధ్యేయంగా పెట్టుకున్నారుతప్ప, ఆ పుట్టినవాళ్ళు ఎలా పెరుగుతారు – ఏంతింటారు, అని వీళ్ళకి లేదు. ఈ సుబ్బమ్మకి ఆరుగురు ఆడపిల్లలా, తల తాకట్టు పెట్టయినా ఆరుగురికీ పెళ్ళిళ్ళు చేస్తారు. ఆ ఆరుగురూ ఆరేసి చొప్పున ముప్పైఆరుమందిని – ఆ ముప్పైఆరూ మరో ఆరేసి – రెండువందలపదహారు. ఇలా ఒక్కొక్కరూ పదేసిరెట్లు

హెచ్చించుకుంటూ పోతే మనదేశం ఎట్లా బాగుపడుతుంది. ఫామిలీప్లానింగ్, పరిమితకుటుంబం, లూపూ, ఆపరేషనూ - చెవులు చిల్లులుపడేటట్లూ, ప్రభుత్వమూ డాక్టర్లూ గొంతు చించుకుని లాభం?' ఆగాడు - వూపిరి పీల్చుకోటానికి అన్నట్లు. ఈయన ప్రయివేట్ డాక్టరు అయాడుగాని, లేకపోతే గొప్ప ఫామిలీప్లానింగ్ ప్రోపగాండిస్టు అయివుండేవాడు అనుకుంది నాగమణి.

'ఈవిషయం - మీరు చెప్పినవిషయాలే. కాస్త నిదానంగా సౌమ్యంగా చెప్పొచ్చుగా' భయభయంగానే అడిగింది నాగమణి.

'నాన్‌సెన్స్. నెత్తిమీద మేకులు దించుతేగాని మనుషులు వినరు. మొట్టికాయలువేసే రోజులు ఎప్పుడో పోయాయి. సుత్తిదెబ్బలకిమటుకే వీళ్ళు జడిసేది....'

'నా మెథడ్ అదికాదు.'

'చూద్దాం! మీరు గనక యీ సుబ్బమ్మ ప్రెగ్నెన్సీని టెర్మినేట్ చెయ్యగలిగితే- వాళ్ళని వొప్పించగలిగితే- మీరు చెప్పింది సాధ్యమేమోనని ప్రయత్నిస్తా - బెట్ కడ్తారా?' అడిగాడు.

'ఇందులో బెట్ చెయ్యడానికి ఏముంది? ప్రయత్నిస్తాను. నెమ్మదిగా చెపితే మనుషులు వింటారని నానమ్మకం' అంది నాగమణి.

డాక్టర్ సర్వేశ్వరరావు రెప్పవాల్చకుండా తనవంక చూస్తున్నాడన్నది నాగమణి యిన్‌స్టింక్టివ్‌గా ఫీలయింది. అతను ఎందుకలా చూస్తున్నాడు? తనవంక చూసినపుడల్లా ఆయనకి తన గతచరిత్ర జ్ఞాపకం వస్తూ వుంటుందా? అసలు ఈ సర్వేశ్వరరావు వచ్చిన ప్రతిసారీ తనకి యిబ్బందిగా, వుక్కిరి బిక్కిరిగా వుంటుంది. తన గతజీవితం తెలిసినవాడు, దాని చరిత్రకూ యీ వర్తమానానికి మధ్య తను వారధిని సుమా అన్నట్లు జ్ఞాపకం చేస్తూంటాడు. రాకండా వుంటే బాగుండును.

'డాక్టర్' పిల్చాడు సర్వేశ్వరరావు, అతనికంఠం రఫ్‌గాలేదు.

'యస్' అంటూ జవాబిచ్చింది.

'మీకు నేనంటే భయమా ? నారాక మీకు యిబ్బంది అయితే చెప్పండి - మళ్ళీ ఈవైపుకి రాను. పేషంటుని రిఫర్ చేసినప్పుడుకూడాను. నావల్ల మీకేమయినా....' అడిగాడు సూటిగా.

'నో....అదేంలేదు'

'చూడండి - కొలీగ్‌గా, యిద్దరిదీ ఒకే ప్రొఫెషన్ కాబట్టి, ఆ ఎఫినిటీవల్ల వస్తూంటాను. అంతేగాని మీగురించిగాని, మీపాస్ట్ గురించి గాని నాకు ఎటువంటి కుతూహలం లేదు. ఆర్-యు-వొకె-నవ్ ?'

నాగమణి కోపంగా, వుడుకుమోత్తనంగా వుంది. తనకి అభయం యిస్తున్నాడా ! తనేం కానిపని చెయ్యలేదు. ఎవరినీ ఖూనీ చెయ్యలేదు - దొంగతనం చెయ్యలేదు - లేచిపోయి రాలేదు. తనకి భయం దేనికి ? ఈయనగారి అభయమూ అక్కర్లేదు.

'మీకు కోపం వచ్చిందనుకుంటా. అయామ్ సారి. నాకు ముక్కుమీద గుద్దినట్లు బ్లంట్‌గా మాట్లాడటం అలవాటు. మీరు నేను ఏదన్నా అడుగుతానేమో - మీపాస్ట్....'

'నాకు పాస్ట్ ఏంలేదు.' అంది నాగమణి దృఢంగా.

'అయామ్ వెరీహాపీ టు హియర్ దట్. మిమ్మల్ని చూస్తే, నాకు కొంత భయం. ఏంమాట్లాడితే మీకేం కోపం వస్తుందోనని. మీలో 'సెల్ఫ్‌పిటీ' పాస్టులో బతకటం - యీ రెండూ ఎక్కువ మోతాదులో వున్నాయి.'

'డాక్టర్ రావుగారూ, నాకోసం పేషంట్లు వెయిట్ చేస్తున్నారు. నేను మీలా సైకాలజిస్టుని కాను. మామూలు డాక్టరుని. సారీ, నాకు పనివుంది' అంటూ లేచింది నాగమణి.

'ఆల్‌రైట్ - యీ డిస్కషన్ మరోసారి కంటిన్యూ చేద్దాం' అంటూ లేచాడు. వెళ్తూ 'మన పెట్ విషయం మర్చిపోకండి. సుబ్బమ్మగారి విషయం...' అని హెచ్చరించాడు.

పాతిక పుష్పైవేలదాకా జనాభా, చుట్టుపక్కల పల్లెల్లో మరో పాతిక, ఒక యాభై వేలదాకా జనాభావున్న యీవూళ్లో ఒకే ఒక్కడాక్టరు - అది కూడా ఈ సర్వేశ్వర్రావు కావటం, ఆయన పరిచయంతో యీవూరుకి తను ప్రాక్టీసు పెట్టుకోటానికి రావటం దురదృష్టం - తన దురదృష్టం అనుకుంది నాగమణి. పగలంతా పేషంట్లని ఛడామడా తిడుతూ, రాత్రి అయేప్పటికి వళ్ళెరక్కుండా తాగి పడుకునే యీ డాక్టరంటే వూళ్లోవాళ్ళకి ఎందుకంత అభిమానం? వాళ్ళ కెందుకంత భక్తి? ఇత నెవరు? పెళ్ళిపెటాకులూ, పిల్లా పాపాలేని యీ వ్యక్తి యీ మారుమూల పల్లెలో ఎందుకు పాతుకుపోయాడు? ఇతనికి తల్లీతోడూ లేరా?

తనకిమటుకు వున్నారా? తనుమటుకు ఏకాకికాదా? - అనుకుంది నాగమణి. కాని మగవాడు యిలా ఏకాకిగా వుంటం అరుదు. ఈ సర్వేశ్వర్రావుకికూడా తనకిమల్లే దాచుకోవలసిన 'పాస్టు' వుందా? అతను కూడా జీవితంనుంచి పారిపోటానికి ఈవూరు వచ్చాడా? తను పారిపోతున్నదా? ఎక్కడికి? దేనినుంచి? జ్ఞాపకాలనుంచి పారిపో జూస్తున్నదా? చిన్నగా, మొహమాటంగా, యిబ్బందిగాచూసే అకళ్ళనుంచి పారిపోవాలని, వెంటాడే ఆ దృష్టినుంచి తప్పించుకోవాలన్న ప్రయత్నంతో యీవూరు వచ్చిందా? తను భర్తని మర్చిపోగలిగిందా? మర్చిపోలేదు. కాని అతని జ్ఞాపకాలు అంత తీవ్రంగా బాధించటంలేదు? ఎందుకు? ఎందుకు జరిగింది? అతను కావాలని చనిపోయాడా? ఈ ప్రశ్నలు ఇప్పుడు తరచు తనలో కలగటంలేదు. ఆజ్ఞాపకాలకీ, తనకీ మధ్య ఈ వూరు, ఈ పేషంట్లు, వైద్యం యివి అడ్డంగా - ఎత్తయిన గోడల్లాగా నిర్మించుకుంటున్నది.

ఆ తరువాత సుబ్బలక్ష్మిని - ముఖ్యంగా అత్తగారిని కన్విన్స్‌చేసి, నెమ్మదిగా ఆపరేషన్ చేసింది. 'ఈస్థితిలో పిల్లవాడు కలిగినా - వాడికి

టి. బి వస్తుంది - ఎక్కువరోజులు బతకడు - కొన్నాళ్ళు జాగ్రత్తగా వుంటే మళ్ళీ పిల్లలు కలగవచ్చు. ఒక ఏడాదిపాటు ఆమెకి విశ్రాంతి యిస్తే, పండంటి మనవడిని మీచేతుల్లోపెట్టే బాధ్యత నాది' అంటూ ఆ ముసలావిడని నమ్మించింది. ఇది ఒకవిధంగా నాగమణి వ్యక్తిగతమైన విజయం. తిట్లతో, అశ్లీలాలతో పనులు అన్నిచోట్లా జరగవు. నిదానంగా అవతలవారిని నమ్మించవచ్చు అంటూ ప్రూవ్ చేసింది - అయితే ముసలావిడను దారికి తేవటానికి పదిహేనురోజులు పట్టింది. ఆ పదిహేనురోజులూ నాగమణి తను పుట్టినప్పటినుంచీ ఆనాటిదాకా మాట్లాడిన మాటలసంఖ్యకి పదిరెట్లు ఎక్కువ మాట్లాడాను అనుకుంది. పెద్ద నీరసం వచ్చినంతపని అయింది. చివరికి విజయం లభించింది.

ఈ విజయంవల్ల ఆమెకి కొన్ని యిబ్బందులు మొదలయ్యాయి. అందులో ప్రథమయిబ్బంది—డాక్టర్ సర్వేశ్వరరావు. అతను తను వోడిపోయానని వొప్పుకున్నాడు. ఆ వోటమి గురించి వొప్పుకోటానికి - రాత్రి ఎనిమిదింటివేళ వచ్చాడు తనయింటికి.

నాగమణి అప్పుడే భోంచేసింది. సాయంత్రం విజిట్స్ ఆట్టేలేవు. ఏడున్నరకల్లా క్లినిక్ ఖాళీఅయింది. అందుకని పెందరాడే - భోంచేసింది. ముందుగదిలో కూచుని - వారపత్రిక చూస్తోంది కాలక్షేపంకోసం. నాగమణి కథలు చదవదు. నవలలు అసలే చదవలేదు. పదిపేజీలు చదివేప్పటికి - ఏ పేషంటో వచ్చి డిస్టర్బ్ చేస్తాడు. సాధారణంగా కార్టూన్సూ, జోక్సుతో తృప్తిపడి వూరుకుంటుంది. ఏదో జోక్ చదివి, నవ్వుకుంటున్నది తనలో తాను. వీధిలో స్కూటరు ఆగిన శబ్దం.

వచ్చాను డాక్టర్ సర్వేశ్వర్రావు కాబోలు - అనుకుంది మనసులో. సాక్షాత్తూ అతనే ప్రత్యక్షం అయాడు. దొర్లుకుంటున్నట్లు, గబగబ అడుగులు వేస్తూ వస్తున్నాడు. లావుమనిషి ఇంత గబగబా ఎలా నడుస్తాడా

అని ప్రతిసారీ ఆశ్చర్యంగా వుంటుంది నాగమణికి. స్లాక్ షర్టులోంచి - పాంటుపై బెల్ట్ కనిపిస్తూ వుంటుంది. అతను షర్టుగుండీలు సరిగ్గా పెట్టుకోడు.

'కంగ్రాట్యులేషన్సు - మీపేషంటుకి కాంప్లికేషన్సు ఏంరాలేదు. ఆ అత్తకూడా నోరుమూసుకుంది. ఏమంత్రం వేశారు' అడిగాడు వుత్సాహంగా కుర్చీలో నిండుగా కూలబడి.

అతను ఈ టైములో రావటం నాగమణికి యిష్టంలేదు. ఈ డాక్టరు రాత్రిళ్ళు తాగి, వొళ్ళెరక్కుండా పడివుంటాడని వింది. తాగిగాని వచ్చాడా? క్షణమాత్రం సందేహం.

జవాబు చెప్పటానికి ఏమీలేనట్లుగా వూరుకుండిపోయింది నాగమణి.

'నావోటమిని యాక్సెప్ట్ చెయ్యటానికి వచ్చాను. బెట్ కట్టాంగా - ఏంయిమ్మన్నారు - చెప్పండి?' అడిగాడు అతను వుత్సాహంగా.

తను బెట్ కట్టలేదు. ఆ విషయం జ్ఞాపకం చేద్దామనుకుంది. కాని లాభం? అతను వినిపించుకోడు. చాలా మందపాటి చర్మం.

'అలా పేషంటుని చూసి - దార్లోకదా అని ఆగాను. మీకేమన్నా యిబ్బందా?'

'ఉహూ - అదేంలేదు....' నీళ్ళనములుతోంది తను.

'రాత్రి అయిపోయింది - ఎవరన్నా చూస్తారని భయమా? లేకపోతే నేను తాగి వచ్చాననుకుంటున్నారా? డాక్టర్, వెనకోసారి చెప్పాను - మీరుత్త భయస్తులు - నేను డాక్టరుని - ఎవరింటికయినా - ఎంత అర్ధరాత్రయినా వెళ్ళచ్చు, ఎవరూ ఏమీ అనుకోరు.'

'ఒకరు అనుకుంటారని కాదు....'

'మరి దేనికి మీకాసందేహం-'

'మనమధ్యన కామన్‌గ్రౌండ్ ఏమీలేదని' అంది నాగమణి కాస్త కటువుగానే.

సర్వేశ్వరరావు నిర్ఘాంతపోయి చూస్తున్నాడు. ఎవరూ అతనిని ఇలా అని వుండరు. ఇంత సూటిగా, నిర్మొహమాటంగా అనివుండరు. ఆమాట అన్న మరుక్షణంలో నాగమణి నాలికకొరుక్కుంది – తను యిలా అని వుండకూడదు.

'సారీ' అంది ఏమీఅనలేక.

'అయ్ డిజర్వ్ దట్ స్నబ్' అన్నాడతను క్లుప్తంగా ఒక్క-ముక్కలో.

'స్నబ్ చెయ్యాలనికాదు' మాటలకి తడుముకుంటున్నది.

'సూటిగా అడుగుతున్నాను చెప్పండి. నేను అంటే మీకెందుకు అంతకోపం – నేనేం చేశాను ? పేషంట్లని మీదగ్గరకు డైరెక్ట్ చేశాను. మరో డాక్టరయితే యిలా కొత్తడాక్టరుని – లేడీడాక్టరయినాసరే రానిచ్చేవాడా? కాస్త ఆలోచించి చూడండి. ఒక ప్రొఫెషనుకి చెందినవాళ్ళం. ఈవూళ్ళో పేషంట్లుతప్ప మాట్లాడేవాళ్ళు ఎవరూ లేరు. అంచేత – మీతో మాట్లాడాలని అనిపిస్తూంటుంది. నేనూ మనిషినే' అన్నాడు సర్వేశ్వరరావు.

ఈమాటలకి ఏంజవాబు చెప్పాలి ? రోజూ రండి అనాలా ? మీతో నాకేం కబుర్లున్నాయి అనాలా ? ఆలోచనలోపడింది నాగమణి. అతను నిశ్శబ్దంగా కుర్చీలోంచి లేచిందికూడా గమనించలేదు. మోటార్ సైకిల్ చప్పుడవటంతో అరె వెళ్ళిపోయాడా ? ఎందుకిలా చేశాను. ఎందుకు ఇగ్నోర్ చేశాను' అని మధనపడింది. నువ్వు తప్పుచేశావు – తప్పుచేశావు అంటూ మనసు హెచ్చరించింది. సర్వేశ్వరరావు అన్నట్లు అతనిలోని మంచిగుణాలని తాను ఎన్నడూ గమనించలేదు. పేషంట్లని డబ్బు అడగడుట. ఎంతిస్తే అంత పుచ్చుకుంటాడుట. గొప్పవాళ్ళింటికి రెండు మూడుసార్లు పిలిస్తేగాని వెళ్ళడుట. బీదవాళ్ళు పిలవకపోయినా వెళ్తాడుట. తన తండ్రికి జబ్బుగా వున్నపుడు తనుమటుకు పిలిచిందా ? అతనంతట అతనే వచ్చాడు. ఈవూళ్ళో ప్రాక్టీసుకి అవకాశం వుందని, చెప్పినవాడూ

అతనే. తను అలా మాట్లాడి వుండకూడదు. అతను తాగితే తనకేం, కఠినంగా మాట్లాడితే తనకేం ? తను అలా ప్రవర్తించి వుండకూడదు. తను మారాలి అనుకుంది నాగమణి.

ఆతరువాత - ఆతరువాత ఆమె స్వభావంలో కొంత మెత్తదనం చోటుచేసుకుంది. సర్వేశ్వరరావు అనే అశ్లీలాలవెనుక, అతని రఫ్ బిహేవియర్ వెనుక స్నేహపూరితమైన హృదయం వుంది అన్నది గ్రహించుకుంది. సాయంత్రాలవేళ తరచు తన యింటికి వొస్తూండేవాడు. అతనిమాటలు పూర్వంలాగా పచ్చిపచ్చిగా వుండేవికావు.

'మీరు యీవూరు వచ్చి ఎన్నాళ్ళయింది ?' అడిగింది నాగమణి.

'వుండండి, లెక్కవేసి చెపుతాను.'

'ఊరికే అడిగానండీబాబూ - లెక్కలూ, డొక్కలూ నాకెందుకు?'

'నాక్కావాలి. పదమూడేళ్ళ ఎనిమినెలల పంథొమ్మిదిరోజులు' అన్నాడు సర్వేశ్వర్రావు.

'ఇంత ఖచ్చితంగా ఎలా చెప్పగలుగుతున్నారు.'

'నాకు డైరీ రాసుకునే అలవాటుంది. మీరొచ్చి ఎన్నాళ్ళయిందో చెప్పనా: ఎనిమిదేళ్ళ అయిదునెలల యిరవైఅయిదురోజులు' కరక్ట్ ఆన్సర్ చెప్పిన విద్యార్థిలాగా గర్వంగా చూస్తున్నాడు.

తను ఫక్కుననవ్వింది.

'మీరు చాలా అరుదుగా నవ్వుతారు మళ్ళీ నవ్వించనా ?'

'ఎట్లా - ఎలా నవ్విస్తారు ?'

'వినండి మీరు యిప్పటికి నాతో పరిచయమైన తరువాత తొమ్మిది సార్లు నవ్వారు. మొదటిసారి క్లినిక్‌లో, ఆసుబ్బమ్మని తీసుకొచ్చినపుడు. ఈమధ్య కాస్తకాస్త నవ్వుతున్నారు.' అన్నాడు.

ఈసారి తను మరోసారి నవ్వక తప్పలేదు.

'ఆతరువాతప్రశ్న అడగలేదేం ?'

'ఏం ప్రశ్న ?'

'ఈ ప్రశ్న మగవాళ్ళు చాలామంది అడిగారు. మీరు ఆడవారు. డాక్టరయినా ఎక్సెప్షన్ కాదనుకోండి. మీకు స్త్రీసహజమైన భయం, కోపం, ఉడుకుమోత్తనం యిత్యాదివి అన్నీ ఉన్నాయి—ఒక్క క్యూరియాసిటీ తప్ప.'

'నాకెందుకు క్యూరియాసిటీ ఉండాలి ?'

'ఉండపోవటం అసహజం. ఉండటం సహజం. నేనెందుకు పెళ్ళి చేసుకోలేదు – అని మీరు అడగలేదు. అడుగుతారేమోనని చాలాసార్లు ఎదురుచూశాను.'

'నాకేం ఆడపిల్లలున్నారా ? మీకు పెళ్ళిసంబంధాలు వెతకాలా ? నేనెందుకు అడుగుతాను ?—అడగను. అలా అడగాలి అన్న ఆలోచన రాలేదు—'

'అదే నా విచారంకూడాను. పోనీలెండి – నేను చెప్పనా ? ఇప్పుడు చెప్పను – సమయంవచ్చినపుడు చెప్తాను...' అన్నాడు సర్వేశ్వరరావు.

ఆ సమయం రాకుండా జాగ్రత్తపడుతోంది నాగమణి. ఏడాదిన్నరగా అతను మూగగా – తనని యించుమించు ఆరాధిస్తున్నాడు. ఇద్దరుముగ్గురు పెద్దలుకూడా యీవిషయం సూచనప్రాయంగా అన్నారు—డాక్టర్లిద్దరూ కలిసి – ప్రాక్టీసు పెడితే నర్సింగ్ హోమ్‌కి స్థలం వూరికే యిస్తామనికూడా ముందుకొచ్చారు. ఈ సూచన లన్నిటివెనకా అతనికి తనని పెళ్ళిచేసుకోవా లని ఉంది అని నాగమణికి తెలుసు. కాని తనకి పెళ్ళి అంటేనే భయంగా ఉంది. జీవితంలో ఒకసారి దెబ్బతింది. ఈ హృదయం పగిలిపోయింది. అది మరి అతుక్కోదు. తన మనసులో ఎవరికీ చోటులేదు—రోగులకితప్ప. ఏ జ్ఞాపకాలనుంచి పారిపోవాలని అనుకుంటున్నదో—మళ్ళీ అవే అనుభవాలు తనకు అక్కర్లేదు. సమీర కున్నంత మనోనిబ్బరం తనకి లేదు.

'ఈవూరునుంచి మకాం మార్చాలనుకుంటున్నాను — నాకిక్కడ బాగాలేదు.' అన్నాడు ఏడాదిక్రితం సర్వేశ్వరరావు ఒక సాయంత్రంవేళ. అతనీమధ్య తాగుడు తగ్గించేశాడు. లివర్ ఎఫెక్టయిందని కొందరు –

ఆయన మారిపోయాడని కొందరూ చెప్పుకోటం నాగమణి చెవులబడింది. కాని, ఆవిషయంగురించి అతన్ని కదపదలచుకోలేదు.

'మీచెందుకు బాగాలేదు ?' అని నాగమణి అడుగుతుందేమోనని అతను ఆశతో – ఆమెవైపుకి చూశాడు.

నాగమణి ఎరగనట్లు మరోవైపుకి చూసింది.

'డాక్టర్, మీరు చాలా క్రూయల్. మీకు హృదయంలేదు' అన్నాడు సర్వేశ్వరరావు నెమ్మదిగా.

నాగమణి విననట్లు వూరుకుంది.

'నేను యీమారుమూలగ్రామంలోకి ఎందుకు వచ్చానో అడగలేదు. నాకు ఎవరూలేరు అని చెప్పుకున్నపుడుకూడా మీరు సానుభూతి చూపలేదు. నేను వెళ్ళిపోతున్నానని అంటున్నా మీరు కరగటంలేదు. నిజంగా మీకు నాగురించి తెలుసుకోవాలని లేదా ?'

'మీరు యిలాంటి విషయాలు ఎత్తకండి, ప్లీజ్....' అంది నాగమణి బ్రతిమాలుతున్నట్లు.

'అమ్మయ్యా' అన్నాడు అతను – అతను తన బలహీనతని చూసి, ఫకాలున నవ్వుతాడని, భయపడింది నాగమణి. కాని అటువంటిది ఏమీ జరగలేదు సరిగదా – సర్వేశ్వరరావు ఏదో ఆలోచిస్తున్నట్లు – నిశ్శబ్దంగా వుండిపోయాడు. ఇద్దరూ బొమ్మల్లాగా కూచుని వున్నారు. సూర్యాస్తమయం వేళ—ఆవరణ అంతా ఎర్రగా కందిపోయినట్లు వుంది. అటువంటి సమయాల్లో నాగమణికి దిగులుగా – భయంగా వుంటుంది. సుందర్ రాజన్ తనని – చీకటిలోకి, వంటరితనంలోకి తోసి వెళ్ళిపోయినట్లే – సూర్య భగవానుడు యీసమస్త ప్రపంచాన్ని అంధకారంలోకి తోసి, భూమాతని ఏకాకి చేసి వెళ్ళిపోతున్నాడు అని గుబులు గుబులుగా వుంటుంది. రోజంతా విపరీతమైన కార్యభారంతో నడిచిపోతుంది – సాయంత్రాలనుమటుకు యీ దిగులు అప్పుడప్పుడు ఆమెని అవహిస్తూ వుంటుంది.

'నేనూ, మీకుమల్లేనే - ఒకరకంగా గతాన్ని మర్చిపోవాలని పారిపోయిన వచ్చాను....'

నాగమణి చివాలున తలఎత్తింది. అతనూ తలాంటివాడేనా ? అయితే సర్వేశ్వరరావు పరిసరాలని మర్చిపోయినట్లుగా – ఆఖరికి ఎదురుగుండావున్న తననికూడా గమనించనట్లుగా చెప్పుకుపోతున్నాడు.

'డాక్టర్లు, హాస్యంగా, సరదాగా కబుర్లు చెప్పటంకూడా - కొన్ని సందర్భాల్లో గొడవలకి దారితీస్తుంది .... ముఖ్యంగా ఆడపేషంట్లు ఒక్కొక్కసారి కొంపలుముంచుతారు. నాపని అలానే అయింది. ఎనిస్తేషియా యిచ్చి - అపరేషన్ టేబిల్‌మీద ఎడ్వాన్‌టేజ్ తీసుకున్నానని కేసుపెట్టారు....'

'ఛీ–ఛీ' అంది నాగమణి తనకి తెలియకుండానే.

'ఛీ ఛీ–అని నలుగురిచేత అనిపించుకున్నాను. కేసు కొట్టిపారేశారు. కాని అక్కడ ఉండలేకపోయాను. నా కేరక్టర్‌ని కోర్టులో నిరూపించుకో వలసి వచ్చింది - ఎంత అసహ్యమో చూడండి. ఆకేసు నడుస్తున్నపుడే – నాకీ తాగుడు అలవాటయింది. ప్రాక్టీసు లేదు, స్నేహితులు దూరంగా వెళ్ళిపోతున్నారు - చేసేపని లేదు. నేను నిరపరాధిని అన్నది నిరూపించు కోవాలనే లీగల్ పోరాటం మూడేళ్ళు నడిచింది. నా కేరీర్, నా స్వభావం, నా ఆశయం – అన్నీ మట్టిపాలు అయిపోయాయి.'

'కేసుగెల్చారుగా ?'

''గెల్చాను. కాని పోయిన ప్రాక్టీసురాదుగా అసలు ఆ వూరు - ఆ మనుషులూ అంటే అసహ్యం వేసింది.'

'ఇంతకీ ఆవిడ ఎవరు ? ఆవిడను ప్రేమించారా ?'

సర్వేశ్వరరావు ఫక్కున నవ్వాడు. గలగల నవ్వాడు. మీ తెలివి యింతేనా అన్నట్లు నవ్వాడు. నాగమణి కోపంగా చూసింది.

'మీవుద్దేశం – ఆ మహాసౌందర్యవతిని ప్రేమించాననీ – నాకు అందుబాటులో లేదుకాబట్టి అల్లాంటివెధవపని చేసివుంటాననీ–యీ కట్టుకథే-

ఆవూళ్లో నూటికి తొంభై తొమ్మిదిమందీ నమ్మారు. అందుకనే యీ జనాభాని గొర్రెలమందా అనేది - నేను ఆ సుందరాంగిని ప్రేమించలేదు. ఈవిధంగా అల్లరిచేస్తే - భయపడి పెళ్ళిచేసుకుంటానని - మంచిఅల్లుడు కానీ ఖర్చులేకుండా దొరుకుతాడని ఆ అమ్మాయి తండ్రి వేసిన ప్లాను....'

'ఛ-ఛ-అల్లాంటివాళ్ళు వుంటారా ?'

'అదే కోర్టులో నా ప్లీడరు నిరూపించాడు.'

'పాపం - ఆఅమ్మాయి జీవితం ?'

'అదే మన దౌర్భాగ్యం. ఆడపిల్ల కాబట్టి అబద్ధం చెప్పినా నమ్మి, బళ్ళకొద్దీ సానుభూతి వొలకబోస్తారు. నాగురించి ఒక్కరన్నా ఆలోచించారా ? ఆఖరికి మీరైనా జాలిపడుతున్నారా ? నేనెంత అవమానం ఎదుర్కొన్నానో - ఒకస్థితిలో యీ ప్రొఫెషన్‌నుంచి 'డిబార్' చేస్తారేమో ననికూడా బెంగపడిపోయాను...'

'అప్పుడే యీవూరు వచ్చారా ?'

'వెంటనే రాలేదు. ఏడాదిపాటు దేశదిమ్మరిలాగా అన్నివూళ్ళూ తిరిగాను. ఎక్కడా కుదురుగా వుండలేకపోయి - ఆఖరికి యిక్కడి కొచ్చాను. అప్పటినుంచే నాకు యీ దూకుడు, మీరు అసహ్యించుకునే సంస్కృతం అలవాటయింది. ఇవన్నీ మా ప్లీడరుగారి దగ్గిరనుంచి నేర్చుకున్న సుగుణాలు. ఒక తమాషా చూశారా ? నేను మర్యాదగా, సిన్సియర్‌గా వున్నపుడు నన్ను మొండివాడిని చేసేదాకా ఎవరూ వూరుకో లేదు. అప్పుడు సొసైటీ నన్ను భయపెట్టింది. ఇప్పుడు పేషంట్లని నేను భయపెడ్తున్నాను - హడలుకొట్టేస్తున్నాను...'

'మీరు....మీరు ఎందుకు పెళ్ళిచేసుకోలేదు ?' అడిగింది నాగమణి.

'నాకు ఆడవాళ్ళంటే భయంపట్టుకుంది కొన్నాళ్ళు. నాకు నచ్చినవాళ్ల దొరక్క కొన్నాళ్ళు. ఇప్పుడు కనిపించారు. ఆ వ్యక్తికి నేను అక్కర్లేదు -

నామీద సానుభూతిలేదు _ నాగురించి కుతూహలమూలేదు .... అదీ నా ట్రాజడీ....' అన్నాడు సర్వేశ్వరరావు.

ఆదెమ్మ స్విచ్ వేసింది. టక్‌న శబ్దం అయింది _ ఆశబ్దానికి యిద్దరూ వులిక్కిపడ్డారు. 'నేను వస్తాను. చాలాసేపు కూర్చున్నాను. సారీ వస్తాను' అంటూ వెళ్ళిపోయాడు సర్వేశ్వర్రావు.

ఆతరువాత తను సర్వేశ్వర్రావుని కలుసుకోటం చాలా తగ్గించింది. అతను యింటికొచ్చినా - ఏదో పనివున్నట్లు - తలనెప్పిగా వుందని బయటకి రాకుండానూ, ఎవరన్నా పేషంట్లు వుంటే వాళ్ళని వెళ్ళనివ్వకుండా కన్సల్టేషను పొడిగించి _ యిలా రకరకాల పద్ధతుల్లో అతనికి - ఏకాంతంగా మాట్లాడే అవకాశం యివ్వకుండా జాగ్రత్తపడుతోంది. సర్వేశ్వరరావు - తనని, వెంటబడి, వేటాడుతున్నాడు. ఏబలహీనమైన సమయంలోనో తనని పెళ్ళికి వొప్పించాలని చూస్తున్నాడు. కాని .... తనకి యిష్టంలేదు. తను చేసికోదు. గాజుగ్లాసు విరిగిపోతే, తిరిగి అతికిస్తే - అది అతికిన గ్లాసు అవుతుందేతప్ప దానికి అసలురూపు రాదు. తనజీవితం అంతే. రెండు శిథిలజీవితాలు కలుస్తే, ఒక పరిపూర్ణజీవితం అవుతుందా? అవదు. అవన్నీ పుస్తకాల్లో _ సినిమాల్లో తప్ప జీవితంలో సంభవించదు....

నాలుగుకొట్టింది. లోపలనుంచి ఏవోశబ్దాలు. ఆదెమ్మ క్లినిక్ వెనకభాగం తలుపుమూస్తున్నది. ఆ తలుపు చప్పుడు - ఘనీభవించిన యీ నిశ్శబ్దాన్ని ఛేదించి శబ్దతరంగాల్తో చైతన్యవంతం చేస్తున్నది వాతావరణాన్ని. ఎదురుగావున్న వేపచెట్టుమీంచి కోకిల కూస్తున్నది - కోకిల మామిడిచెట్టు మీద వుంటుందా? వేపచెట్టుమీద వుంటుందా? ఎక్కడయితేఏం? దూరాన్నుంచి ఏదో కారు వెళుతున్న శబ్దం. సర్వేశ్వరరావు స్కూటరా? అతనన్నావస్తే బాగుండును. ఒక్కరూ - ఏఒక్కరూ ఎందుకు రాలేదు? మళ్ళీ వీధివైపు చూసింది.

గుమ్మంలో కారు ఆగింది. నాగమణి హృదయం ఒక్కసారి ఎగిరి గంతేసింది. కారులోంచి సమీర దిగింది. నాగమణి కంటికి ఎవ్వరూ కనపడటంలేదు. ఉదయం ఏడుగంటలనుంచీ ఇప్పటిదాకా మరోమనిషికోసం మనుషుల అలికిడికోసం కరువువాచి, కళ్ళుకాయలు కాసేలా ఎదురు చూస్తోంది. సమీర – తన సమీర గబగబా వస్తోంది – చైతన్యస్రవంతిలా.

'ఇంకా మీరిల్లాగే కూచున్నారేం? లేవండి' సమీర హడావుడిగా అంటున్నమాటలు నాగమణి చెవుల్లోకి దూరటంలేదు.

'సమీరా, పొద్దుటనుంచి ఒక్కదాన్నీ....' అంటూ సమీర బుజాలు గట్టిగా పట్టుకుంది – పొంగుతున్న దుఃఖాన్ని, రాలుతున్న కన్నీళ్ళని ఆపుకుంటూ. నాగమణి తన తండ్రిని పట్టుకుని, ఆయన గుండెల్లో తల దాచుకుని యిలాగే బాధని వెళ్ళగక్కేది. సమీర తనకంటే పదేళ్ళు చిన్నదనీ, ఆమె తన పేషంటనీ మర్చిపోయి....

'మిమ్మల్ని ఒక్కదాన్నిగా ఎందుకు వొదుల్తాం – లేవండి – మీతో చాలాపనుంది. అక్కడ ...'

'ఎక్కడికి? నేను ఎక్కడికీ రాను. ఇలా నాపక్కన కూర్చో – నాకేమిటో భయంగా వుంది. మీరంతా నన్ను బాయ్‌కాట్ చేసి....'

'మిమ్మల్నా – బాయ్‌కాటా....భలేవారు....లేస్తారా లేవరా – రండి–' కుర్చీలోంచి లేవదీసింది.

అంతదాకా నిశ్శబ్దంగా – కదలిక లేకుండావున్న ఆ ఆవరణనిండా మనుషులు. ఆదెమ్మ నవ్వుతోంది అర్థవంతంగా. సమీర భర్త, రాజారావు గారు, ఎలిజబెత్, మరియమ్మ, రిక్షావాడు – తన పేషంట్లు అందరూ గుంపులాగా ఒక్కసారి ఆకాశంలోంచి వూడిపడ్డట్టు వచ్చారు. ఎందు కొచ్చారు? వుదయంనుంచీ తనని ఏకాకిని చేసిన వీరు అంతా కట్టకట్టుకుని ఎందుకొచ్చారు?

తన సందేహాలని సమీర నివృత్తిచేయలేదు. అసలు మాట్లాడే ప్రైమూ యివ్వలేదు. గబగబా ఊపిరి అడనివ్వనంత స్పీడులో _ ఆదెమ్మ సిద్ధంగా వుంచిన చీరె కట్టుకోమంది. ముఖం కడుక్కు- బొట్టు పెట్టుకోమంది. తనకి మాట్లాడే అవకాశం, 'చెయ్యను' అనే వ్యవధి యివ్వలేదు. చెయ్యి పట్టుకుని కారులో - వెనక సీట్లో కూలేసి - తనూ పక్కన కూచుంది.

'ఎక్కడికి ? ఎక్కడికి తీసుకెడుతున్నావ్ ?'

'చెపుతాను - ముందు అర్జంటు కేసుంది....'

'నా మెడికల్ బాగ్....'

'ఆదెమ్మ తెస్తుందిలెద్దురూ _ మీరు మాట్లాడకుండా కూచోండి.'

'ఊరునుంచి ఎప్పుడొచ్చావ్ ?

'రాత్రి...'

'వెంటనే ఎందుకు రాలేదు ? ....' తగాదావేసుకునే చిన్నపిల్లలాగా అడుగుతోంది నాగమణి.

'పనుండి....తీరికలేక....' నిర్లక్ష్యంగా జవాబిచ్చింది సమీర.

నాగమణి నోరెత్తలేదు. సమీర తనలోతాను నవ్వుకుంటున్నది. తననోరు మూయించానన్న విజయగర్వంతో నవ్వుతూవుందా ? కళ్ళంట నీళ్ళుతిరగబోతుంటే _ బలవంతాన మరోవైపుకి ముఖం తిప్పుకుంది. నాగమణి.

కారు హైస్కూలు ఆవరణముందు ఆగింది. 'లోపలికి పోనియ్యి' అంది సమీర డ్రైవర్‌తో. గేటుకి లోపల షామియానా, కుర్చీలు - మనుషులు - పిల్లలు, పెద్దలు _ అందరూ గుమికూడి వున్నారు. ఏదైనా మీటింగా ?

సమీర నాగమణి చెయ్యి పుచ్చుకుంది-పారిపోతుందేమో అన్నట్లుగా. చెయ్యిపుచ్చుకునే వేదికవైపుకి తీసుకొస్తున్నది.

'దేనికి ?' అడిగింది చెయ్యివిడిపించుకోబోతు.

ఎవరో చిన్నపాపచేత నాగమణి మెడలో పూలదండ వేయిస్తున్నారు. ఎవరు ? సమీరభర్త – తనపిల్లవాడిచేత మాలవేయించాడు. చుట్టూ చప్పట్లు. 'రండి-రండి' అంటూ రాజారావుగారు పక్కనుండి తీసుకెడుతున్నారు. నాగమణికి 'రాను' అనే ధైర్యంలేదు. వేదికమీదకి నడిచింది, కుర్చీలో కూలబడింది. పక్కన డాక్టర్ సర్వేశ్వరరావు. ఎందుకు – ఏంజరగబోతోంది? నాగమణికి భయంగా – శంకగా వుంది. ఎత్తయిన వేదికమీంచి – ముందున్న ప్రేక్షకులవైపు చూసింది. నేలమీద మూడువరసల్లో బారులుతీరి పిల్లలు. ఏడాదినుంచి పదిదాకా వయసులోవున్న – ఆడా మొగా పిల్లలు – ఈపిల్ల లంతా తనకి చిరపరిచితులు. వీళ్ళందరినీ తను యీలోకంలోకి తీసుకొచ్చింది. ఎంతమంది ? మధ్యగా తాను యీలోకంలోకి తీసుకొచ్చిన కవలలు. మొదటిసారి యీవూర్లో తాను చేసిన కానుపుకేసు. ఆ యిద్దరూ చెయ్యి వూపుతున్నారు – ఒకేరకమైన బట్టలువేసుకుని. ఆ పిల్లలిద్దరికీ తన హృదయంలో ప్రత్యేకమైన స్థానం.

'అమెరికాలో మదర్స్‌డే, ఫాదర్స్‌డే, టీచర్సుడే, డాక్టర్సుడే అని రకరకాల వుత్సవాలు చేస్తూంటారు. మొదట్లో నాకిది విచిత్రంగా అనిపించేది. తల్లితండ్రులకి కృతజ్ఞత చూపటం ఏమిటీ ? అని. కాని మనలోని భావాలని, మనప్రేమని ఏడాదిలో ఒక్కసారైనా చూపగలిగితే, అది ఎదుటివారికి ఎంత సంతోషాన్ని యిస్తుందో నేను కళ్ళారా చూశాను. ఏడాదిపాటూ పిల్లలకీ, భర్తకీ వండి వార్చి – అన్ని సదుపాయాలు సమకూర్చిన గృహిణికి ఏడాదిలో ఒక్కరోజున విశ్రాంతినిచ్చి, ఆమెని ఆ ఒక్కరోజూ మహారాణిలాగా కాలు కిందపెట్టనివ్వకండా కుటుంబం యావత్తూ సేవచెయ్యటం నాకళ్ళతో చూశాను. ఆ మాతృమూర్తి ముఖం దీప్తితో, తృప్తితో వెలిగిపోవటం చూశాను. పాశ్చాత్యుల అలవాట్లూ –

సంప్రదాయమూ మనం పూర్తిగా అనుకరించక్కరలేదు. అందులో మంచి తీసుకోవచ్చు. ఆ మంచే యీనాటి యీ కార్యక్రమం.

'డాక్టర్ సర్వేశ్వరరావుగారు యీవూరొచ్చి పదిహేను ఏళ్ళయింది. డాక్టర్ నాగమణిగారు పదేళ్ళయింది మనవూ రొచ్చి. ఆమె ఈ పదేళ్ళలో నాలుగువందలమంది పిల్లల్ని ఈలోకంలోకి తీసుకొచ్చారు. ఆ పిల్లలందరూ యిక్కడ లేకపోవచ్చు. మొదటివరసలోని ఆ పసివారిలో ప్రతివొక్కరూ ఈమెచేత ఈలోకంలోకి తీసుకురాబడినవాళ్ళే. డాక్టర్ ఒక్కసారి చూడండి – వారంతా మీ ప్రొడక్ట్స్....' చప్పట్లు దద్దరిల్లుతున్నాయి. పిల్లలు చిన్నచిన్న జండాలు – రంగురంగుల జండాలు వూపుతున్నారు, బలంగా వుత్సాహంగా.

నాగమణి కళ్ళు మసకలుబారుతున్నాయి. చప్పట్లకోసం ఆగిన సమీర మళ్ళీ అందుకుంది – మైకుముందు నిలబడి 'నాకు లేడీడాక్టర్ నాగమణిగారంటే ప్రత్యేకమైన అభిమానం, భక్తీ వున్నాయి. పైకి కరకుగా కనిపించే డాక్టర్ సర్వేశ్వరరావుగారు – ఎంతమంది ప్రాణాలు కాపాడారో, ఎంతమందిని వోదార్చారో నేను లెక్కలుకట్టి చెప్పదలచుకో లేదు. ఈ చుట్టుపక్కల గ్రామాల్లో – మనవూర్లో లేడీడాక్టర్‌లేని కొరత గ్రహించి, ఆయన ప్రత్యేకంగా ఈమెని ఈవూరు రప్పించారు. డాక్టర్లలో సేవాభావమూ, సహనమూ మృగ్యమైపోతున్న ఈరోజుల్లో ఇంకా అక్కడా అక్కడా యిటువంటి అమృతహృదయులు వున్నారు అనటానికి ఈయిద్దరూ ప్రత్యక్ష నిదర్శనం.

'వైద్యుడు భగవంతునితో సమానం అంటాయి మన ప్రాచీన గ్రంథాలు. ఈ యిద్దరూ భగవంతులుకాదు. మానవత్వం స్పందించే హృదయం, ప్రేమాభిమానములుగల ఉదారగుణసంపన్నులు. ఈ యిద్దరూ మనవూరికి రెండుకళ్ళలాంటివారు. ఒక్కకన్ను లేకపోయినా మానవజీవితం

కుంటుపడుతుంది. అందుకని డాక్టర్ సర్వేశ్వరరావుగారుగాని, నాగమణిగారు గాని ఈవూరు వదిలి వెళ్ళిపోకుండా, వారిద్దరూ ఎప్పుడూ ఇక్కడే వుండేటట్లు....' ఆగింది సమీర....

నాగమణి గభాలున లేవబోతున్నది కుర్చీలోంచి.

'లేవకండి - తొందరపడకండి' అంటున్నాడు నెమ్మదిగా పక్క కుర్చీలోవున్న డాక్టర్ సర్వేశ్వరరావు.

'ఈ యిద్దరు డాక్టర్లూ ఇక్కడే వుండేటట్లు నర్సింగ్‌హోమ్‌కి నిదులు పోగుచేశాము. ఆ దబ్బుతో ఒక నర్సింగ్‌హోమ్ కట్టే ఏర్పాట్లు వీరిద్దరికీ అప్పజెపుతున్నాము. ఇది మాఅందరి ప్రార్థన. ఈవూరులోని ప్రజల కృతజ్ఞత, ప్రేమాభిమానాలు ఈవిధంగా 'డాక్టర్స్‌డే' జరుపుకుని తెలియబరుచుకుంటున్నాము. ప్రతీసంవత్సరం....ఇదేరోజున డాక్టర్స్‌డే జరపాలని నిశ్చయించుకుని, వచ్చేసంవత్సరం యీనాటికి కొత్త నర్సింగ్ హోమ్ కార్యరూపం దాలుస్తుందన్న ఆశతో నావుపన్యాసం ముగిస్తున్నాను' సమీర కంఠం కరతాళధ్వనులలో మునిగిపోయింది.

డాక్టర్ సర్వేశ్వరరావువంక కృతజ్ఞతతో, అభిమానంతో నిస్సంకోచంగా చూసింది డాక్టర్ నాగమణి - మొదటిసారిగా.

